# ప్రతాపరుద్రీయం

(నవల)

రచన:

పొన్నలూరి రాధాకృష్ణమూర్తి

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# పరిచయం

కాకతీయ రాజ్య పతనానికి జైన శైవ మత ద్వేషాలొక ముఖ్య కారణం. కుల వ్యవస్థను నిరసిస్తూ ప్రారంభమైన వీర శైవమతం, అనతి కాలంలోనే మతద్వేష ప్రధానమై, ప్రజలలో అంతఃకలహాలకు ప్రోవతీసింది. స్వార్థపరత్వానికి, అధికార వాంఛకు, అన్యమతద్వేషం ఒక ముసుగు అయింది.

కాకతీయరాజులలో ఆఖరి చక్రవర్తి యైన ప్రతాపరుద్రుడు, ఈ మత విద్వేష పిశాచిని అదుపులో పెట్టటానికి ఎంతో ప్రయత్నించాడు. మతంకంటె జాతి ముఖ్యమన్న విశాల దృక్పథం కలిగిన మంత్రి అన్నయ దేవుడు ప్రతాపరుద్రునికి బాసటగా నిలచాడు. కానివీరి ప్రయత్నా లన్నీ వ్యర్థమైనాయి. కాకతీయరాజ్యం, నశించింది. ఆంధ్రభూమిపై ఢిల్లీ సుల్తాను ల బావుటా ఎగిరింది.

ఈ చారిత్రక వస్తువును స్వీకరించి రచయిత ఈ నవలను రచించారు. గంగా వినయుల ప్రేమ, ప్రతాపరుద్ర అన్నయ దేవుల సమరసధోరణి, శివయోగి నావ హించిన మత ద్వేషం, జటాశంకరుని అధికారవాంఛ – జైన ప్రజల కష్ట భరితమైన జీవితం, స్వార్థపరులకు మత విద్వేషం కలిగించిన రక్షణ మొదలైన విషయాలన్నీ ఈ నవలలో చక్కగా చిత్రించబడినవి.

తెలుగులో చారిత్రక నవలలుస్వల్పం. ఉన్న కొద్ది నవల్లోను వాస్తవికతను సక్కనెట్టి రచయితకుగల అభిమాన ద్వేషాలు ప్రథమస్థానం ఆక్రమించిన నవలలే హెచ్చు. ఇట్టి పరిస్థితుల్లో, రాధా కృష్ణమూర్తిగారి యీ నవల పై లోపా లను కొంతవరకు తొలగించ గలదు. గతంలోని మంచిని గుర్తించి గర్వించటం ఎంత అవసరమో, లోపాలను తెలుసు కొని విచారించటం, వాటిని తొలిగించు కోటానికి యత్నించటం, సజీవమైన జాతి చిహ్నాలు. ప్రతాపరుద్రీయం, పాఠకులలో అట్టి జిజ్ఞాసనుకలిగించగలదు. ఈ నవలలో

పాత్రపోషణ, రచనాశిల్పం చక్కగా ఉన్నవి.

అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్రను రచించిన శ్రీ రాధాకృష్ణ మూర్తిగారు తెలుగు పాఠకులకు సుపరిచితులు. వీరి నేటి నవలసైతం పాఠకుల ఆదరాభిమానాలను పొందగలదని ఆశిస్తున్నాను.

విజయవాడ,
7—2—56

ఏటుకూరు బలరామమూర్తి.

౧

ఈ జగత్తును వివిధరంగాలలో ఆడించి యాడించి సూర్యుడు తన అలసిపోయిన రెక్కలను పశ్చిమ దిశాంగనవైపు సాచినాడు. నీలాలోలికే నగశిఖరాలమీద అత డాడించబోయే పచ్చని బంగారు కాంతులు విరామ సూచితమైన పతాకగా యీ జీవకోటి గ్రహించింది. కాని ఓరుగల్లుప్రాంతంలో మానవకోటిమాత్రం యీ కార్యజగత్తులో విశ్రాంతిముఖులై సాగిరావటంలేదు. పరస్పర మతద్వేషంతో జైనులూ, మరియూ శైవులూ శివపురవీథులలో గుంపులు గుంపులుగా ప్రవహిస్తున్నారు.

ఓరుగల్లుదుర్గానికి పశ్చిమంగా కొలదిదూరంలోనే శివపురముంది. ఇది శైవుల పుణ్యక్షేత్రం. దుర్గంలోవలెనే యీ క్షేత్రంలో స్వయంభూ ఆలయముంది. కాకతీయవంశీయులు వీరశైవ మతస్థులు. స్వయంభూ ఆ వంశీయుల కులదేవుడు. కాకతీయ వీరప్రతాపరుద్ర చక్రవర్తి యేడాది కొకమారు విచ్చేసి స్వయంభూదేవుని దర్శిస్తారు. ఆనాడే ప్రజలకు రాజదర్శనం. ఒక విశాల భూభాగాన్ని తన యేలికలో నిలుపుకోగలిగిన చక్రవర్తిని, తన సన్నిధిలో మోకరిల్లునట్లు చేయగలిగిన ఆ దేవు యందలి మహిమ అత్యున్నతంగా ప్రజలను విభ్రమపరిచింది. కాబట్టి యిది శైవుల తీర్థక్షేత్రమైంది.

స్వయంభూదేవుని ఆలయప్రక్కనే వొక చిన్న ఆరామముంది. దీనిని శైవమఠమని పిలుస్తారు. మిగిలిన ఆరామములలోవలెనే యీ మఠంలోగూడా యేడాది కొకసారి శైవమత గురువులు సమావేశమై, మత స్థితిగతులనుగురించి చర్చిస్తారు. తమ నిర్ణయాలను చక్రవర్తికి తెలియజేస్తారు. సామ్రాజ్యంలో వాటిని చక్రవర్తి శాసించితీరాలె. లేదా మతగురువుల అరాచకచర్యలకు అంతువుండదు.

నేడీ మఠంలో జరుగబోయేది మతగురువుల సమావేశం మాత్రం గాదు. సామాన్య శైవమతస్థులలో మతదీక్ష సడలిపోతూ వున్నట్లు పీఠాధిపతి భయపడిపోతున్నారు. అర్థ దరిద్రమే యిందుకు కారణమని వారి విశ్వాసం!

సామ్రాజ్యంలో జైనమతస్థులే అధికసంఖ్యాకులు అయితే, యిది శైవరాజ్యం.

సామ్రాజ్యంలో రాజపదవులలోగాని, ప్రభుత్వోద్యోగాలలో గాని జైనులకు స్థానమేలేదు. వాణిజ్యమువంటి లాభకరమైన వృత్తులలో శైవులకుగల రాజపోషణ జైనుల కివ్వబడలేదు. జైన వర్తకంమీద పన్నులధికంగా విధింపబడినవి. మగ్గమూ మొదలైన వృత్తులలో శైవులకు పోటీలేకుండా జైన వృత్తులమీద పన్నులు కఠినపరుపబడినాయి. పాలనలో యింతటి పక్షపాత మున్నప్పటికీ, శైవులలో నిరుద్యోగ సంఖ్య అధికంగానే వుంది. వ్యవసాయవృత్తి జైనుల కాధారమైనంత యెక్కువగా శైవులకు లేదు. అందుచేత భూములుగాని, యితర వృత్తులుగాని లేనట్టి జైనులవలెనే, చాలమంది శైవులు నిరుద్యోగులై నిరుపేదలైపోయినారు. చూసీచూడగానే వీరు శైవులేయని గుర్తింప లేనంతగా వీరిలో మత విశ్వాసం బలహీనపడిపోయినదని మతగురువులు ఆందోళనపడుతున్నారు. రాజ్యంలో పంటభూములు వొక్క శైవుల భుక్తంలో వున్ననాడే, సామాన్యశైవులలో యీశ్వరభక్తి, మత విశ్వాసం కుదురుకొనగలవని పీఠాధిపతి యేడాదినాడు ప్రకటించినాడు. చక్రవర్తి సమ్మతికోసం యింతకాలం వేచియుండి, యీనాడు వోర్పు దప్పినాడు. ఈ యసహిష్ణతను వొక దీక్షగా, యీ యశేషజన మధ్యంలో స్వీకరించాలని నిశ్చయించినాడు. ఇది శైవుల పర్వదినం. మఠం యెదుట నిర్మింపబడిన వేదిక కెదురుగా విశాలమైన మైదానంలో వేలకొలది శైవులు గుంపులుపడియున్నారు.

సమీపిస్తున్న పచ్చని బంగారుపాలకీని జూసి వేదికపై ఆసీను లైన జంగాలు, అనగా మతగురువులు శంఖా లూదినారు. పీఠాధిపతు

లైన శివయోగులవారు ఆ పాలకీలో వున్నారు. జనసమూహాలలో నుంచి జయధ్వానాలు చెలరేగినాయి. శైవమతస్థులలో ప్రముఖులైన స్త్రీపురుషులు వేదిక దిగి శివయోగులవారి నాహ్వానించేందుకు యెదురేగనారు.

వేదిక సమీపించగానే బోయీలు పాలకీని దించినారు. ఈ బోయీలు జైనులు. జంగాలచేత అస్పృశ్యులుగా చూడబడే యీ పరమతస్థులు నేడీ పాలకీ మోసేందుకు పీఠాధిపతి యెట్లంగీకరించినాడో శైవు లాశ్చర్యపడినారు. సంజ్ఞలనంది బోయీలు పాలకీ ప్రక్కనే సాష్టాంగపడినారు. శివయోగులవారు నెమ్మదిగా లేచి బోర్లపడియున్న బోయీల వీపులమీద పాదాలు మోపి నిలిచి మరింత ఆశ్చర్యపరచినారు.

పాలకీతో వచ్చిన జంగమ శిష్యులు జైనుల నణగద్రొక్కే గురుపాదాలకు వొంగి నమస్కరిస్తూవుంటే, తనవైపు వింతబడి చూసే వొక వ్యక్తిని చూసి పలికినాడు.

శివ : జటశంకరా! యీ జైన శరీరాలమీద యిట్లా నిలిచినంత మాత్రాన కైలాససుఖం నా పాదాలను స్పృశిస్తోంది. మరి నా మార్గం పొడుగునా జైనశరీరాలు పరచివుంచితే, క్షణకాలం ఆ శరీరాల మీద నడచినంతమాత్రానే యీ భూమిమీద కైలాసం కనిపించి తీరుతుందనే విశ్వాసం నా కిప్పుడే దృఢమౌతోంది. ఆశ్చర్యంతో మైమరచి నీ విధిని మరచిపోయినట్లున్నావు. ఈ గురుపాదాలమీద కైవల్యసుఖాన్ని కన్నుల కద్దుకో.

పీఠాధిపతి పాదాలమీద వ్రాలబోయే జటాశంకరుని అతని భార్య పద్మావతి వారిస్తూ పలికింది.

పద్మా : వొద్దు పతీ!

జటా : యెందుకని?

పద్మా : కైలాసానికి మారు యీపాదాలక్రింద కాఠిన్యమే కనిపిస్తోంది. ...చూడు పతీ నా చెంత కూర్చొని! వొట్టి దుఃఖంమాత్రమే.

శివయోగి : దుఃఖమా! యీ జైన శరీరాలమీద తాండవింపగోరే గురుపాదాలలో...

పద్మా : దాక్షిణ్యంమాత్రమే గోచరిస్తోంది స్వామీ! నా పతి సహితం హింసమాత్రమే చూస్తున్నాడు.

జటా : అవును పద్మావతీ, హింసమాత్రమే.

పద్మా : తొందరపడకు పతీ, హింసతో కళంకితమైపోయే గురుపాదాలను క్రిందకు దించు. ఈ జైనులను లేవనెత్తు.

పీఠాధిపతి పాదాలక్రింద నలిగిపోయే జైనులను ఆ సతీపతులు లేవనెత్తబోతూవుంటే 'ప్రమాదం ప్రమాద'మని అరుస్తూ శివయోగి క్రిందకు దిగినాడు. భయంతో పరుగులెత్తే గురుపాదాలకు పద్మావతి ననుసరించి జటాశంకరుడు నమస్కరించబోయినాడు. కాని శివయోగి, వేదికమీద నిలిచేవరకూ అవి అందనేలేదు. వారు నమస్కరిస్తూ వుంటే శివయోగి ఆసీనుడై, ఆయాసపడుతూ పలికినాడు.

"ఈ గురుముఖాన శుష్క ఆశీస్సులు వినేందుకేనా జటాశంకరా, వొట్టి పాదాలకు నమస్కరిస్తున్నారు!"

పద్మా : ఒట్టి పాదాలుగాదు స్వామీ యివి, మా హృదయాలను మతభక్తితో పదిలపరిచే పవిత్రపాదాలు.

శివ : మీ హృదయాలలో మతభక్తి వున్నట్లైతే పరమతస్థుల నుద్ధరించేందుకు మీ చేతులు సిద్ధపడతాయా!

పద్మావతి మాట్లాడలేదు.

శివ : మాట్లాడవేం జటాశంకరా! ఈ మతపీఠం పతనమైపోయే ప్రమాదాన్ని సహితం మరిపించినంతటి జాలి, నా పాదాలక్రింద జైనుల లేవనెత్తేందుకు మీ శైవహస్తాల్లో యెట్లా నిండింది?

పద్మా : తమ పాదాలక్రింద ఆ పరమతస్థులు బాధపడుతున్నారు స్వామీ!

శివ : అది యీశ్వరాజ్ఞ! కొన్నేండ్లనాడు యీ జైనుల రాజ్యాలలో యీ భూమి అపవిత్రమైయుంది. పరమశివు డాగ్రహించి ఆ జైన

రాజ్యాలమీద ప్రళయతాండవం జేసినాడు. జైనమతం నిస్తేజమై పోయేటట్లు, పరమశివుని పాదాలు యీ నాటికీ ఆ మతంమీద నిలిచేవున్నాయి. ఈ పరమశివ సంకల్పాన్ని మన శైవులకు స్పష్ట పరచాలని, యీ రోజున యీ జైనుల శరీరాలను అద్దెకు తీసుకొన్నాను. నేను పీఠాధిపతిని. ఈ పరమతస్థులమీద నిలిచి యీ ధర్మాన్ని ప్రదర్శించేప్పుడే యీ పద్మావతి నా పాదాలడుగున జైనుల అధోగతికి తన హృదయాన్ని...

పద్మా : తమ పాదాలక్రింద జైనుల ఆత్మవ్యధ నా హృదయాన్ని కలవరపరిచింది దేవరా. జైనులుకూడా మానవులేగదా.

తా నేదో యోచనలో వున్నట్లు క్షణం కన్నులు మూసి తిరిగి పలికినాడు శివయోగి.

శివ : ఏ యోగంలోనుంచి చూచినప్పటికీ పరమతస్థులను మానవులుగా చూడటం ఆత్మమర్యాద అనిపించటంలేదు జటాశంకరా! బీజంలోనుంచి మొక్క బయలుదేరేప్పుడే తన ్రవేళ్ళనుకూడా మట్టిలోకి పాకిస్తుంది. భూమిలో ్రవేళ్ళు యెంతదూరం చొచ్చుకపోగలిగితే చెట్టు అంతగా వృద్ధిపొందుతుంది. అయితే మట్టిలో ఆ ్రవేళ్ళు పాలిపోతున్నాయనీ, చీకట్లో చివికిపోతున్నాయనీ, మన పిచ్చి పద్మావతి జాలిపడుతుందా...ఆ ్రవేళ్ళు పెకలించి రెమ్మలతో, ఆకులతో సమంగా యెండకీ గాలికీ అప్పగిస్తుందా.

జటా : లేదు దేవరా. ఆ విధంగా చేస్తే చెట్టు ్రబతకదు.

శివ : నిశ్చయం. తమోగుణమే జైనులకు ప్రధానమైనది. చీకట్లోనే వారు జీవించాలె. ఈ పరమతిస్థులను పాతాళంవరకూ తొక్కివేయగలిగినపుడే మన శైవులు వున్నతిలో ప్రకాశిస్తారు. ఇదే ఆత్మ సాంప్రదాయం. ఆచరణలో యే శైవులీ సాంప్రదాయాన్నే అనుష్టిస్తారో పరమ శివుని శుభాశీస్సులు వారి యింటనే ప్రభవిస్తాయి.

'మరి మా యింట్లోనో ప్రభూ, పరమ శివుని ఆశీస్సులో యింతటి ప్రళయం కుమ్మరిల్లిందేమి ?'

"పరమ శివుని ఆశీస్సులలో ప్రళయమా... ఎవరివి నీవు?"

"నేనే స్వామీ శంభుదాసు భార్యను."

ఒక దీనురాలు పీఠాధిపతి సమక్షంలోకి నడిచివచ్చింది. ఆమె భుజాలమీద ఒక పసిబిడ్డ మూలుగుతున్నాడు. ఆమె దైన్యస్థితి పద్మావతి నాశ్చర్యపరిచింది.

పద్మా: గౌరీ!

గౌరి: అవును పద్మావతీ, నేనే గౌరిని. శివదీక్షాపరురాలను. నా యింట నే నభిమానించే శివమతమే కొన్నాళ్లనుండీ ఆగ్రహాన్ని కక్కుతోంది. నా పతిని మతపీఠం బలితీసుకొంది.

శివ: నీ పతి పరమ శివభక్తుడు. వీర భిక్ష తీసుకొన్నాడు. జైనులతో పోరాడి వీరమరణం పొందినాడు. ఇప్పు డాతడు కైలాసంలో సుఖిస్తున్నాడు. ఇది పరమ శివుని అనుగ్రహం, నీకు ఆగ్రహంగా కనిపిస్తోందా?

గౌరి: అవును దేవరా, యింత ప్రచండంగా ఆ యాగ్రహాన్ని మున్ను జైనులుమాత్రమే చూసినా రేమో—నేను శైవస్త్రీని, పరమ శివభక్తుడైన పతిని సేవించినదానిని, నాకే కనిపిస్తోంది.

శివ: ఎక్కడ?

గౌరి: ఇక్కడ దేవరా, నా బిడ్డలో. ఆకలితో అల్లాడే నా కుమారునిలో. జంగా లీ బిడ్డలో ఆకలిచిచ్చు పెట్టేసినారు స్వామీ!

గౌరి వేదికమీద వొక జంగాన్ని చూసి పలికింది:

"మాట్లాడవేం శరభలింగం దేవరా. మా భూములను వశపర్చుకొని,—మాయింటి నాక్రమించి..."

శరభ: ఆక్రమించటం మీ రివ్వవలసిన అప్పుక్రింద.

గౌరి: చేసిన అప్పు నాలుగుతులాల బంగారం. మరి నాలుగువందల తులాలకు దానినే పెంచి...మా జీవితంమీద దర్రిద్రాన్ని పెంచి...

శరభ: అది నీభర్తచేసిన అపరాధం...నాలుగు తులాల బంగారం నీ భర్త అప్పు తీసుకొన్నాడు. దానిని తీర్చకముందే జైనులతో

పోరాడి మరణించినాడు. తీర్చి మరణించినట్లయితే, అతడు నేరస్థుడయ్యేవాడు గాదు. అది మఠపీఠానికి చెందిన ద్రవ్యం, గురుధనం. దాని నతడపహరించిపోయిన అపరాధియైనట్లే పండితులు తీర్మానించారు. కులపెద్ద లొప్పుకొన్నారు. కాబట్టే న్యాయాధికారి నాలుగువందల తులాల బంగారాన్ని అపరాధం విధించాడు! ఇది అన్యాయమని పీఠాధిపతులవారు అనబోరు.

గౌరి: అవునా దేవరా! నా పతి గురుధనం అపహరించిన అపరాధియని నిందించటం మీకు గూడా న్యాయమనిపిస్తోందా? ఈ యేడు మాకు గల ధాన్యాన్ని జైనమతస్థులు దోచుకపోయినారు. వచ్చేపంటలో తీర్చుకోవచ్చునని, ధాన్యం కొనేందుకు నాలుగుతులాల బంగారం అప్పు తీసుకొన్నాడేమో నా పతి. మా యింట జైనగ్రామాలను దోచితెచ్చిన ధనం...

'కాదు—పరమశివ ప్రసాదమని చెప్పు' అని శివయోగి బిగ్గరగా అరిచినాడు.

గౌరి: అవును స్వామీ, ఆ ప్రసాదంలో చిల్లిగవ్వైనా అపహరించేవాడు గాదే-అది మఠపీఠానికి చెందవలసిన ధనమని యెప్పటికప్పుడు జంగాలకు అప్పగించేవాడు గదా!

శివ: అవును; అతడు స్వార్థత్యాగి.

గౌరి: అలాంటి త్యాగధనుడు నాలుగుతులాల బంగారాన్ని అపహరించి, కైలాసంలో యింత పాపం మూటగట్టుకొని—

శివ: అక్కడే - అక్కడే నిలిచి పలుకుతోంది నా భక్తియోగం... శంభుదాసు గొప్ప శివభక్తుడు, అతడు వీరమరణం పొంది, తీర్చని గురు ఋణంతో కైలాసం చేరినాడు. అత డీ భూమిమీద చేసిన ఋణమంతా, యీ గురు ఋణంతో కొట్టబడుతోంది. అతడు నరకానపడే ప్రమాదం గ్రహించబడింది. నాలుగు తులాల ఋణాన్ని నాలుగువందల తులాలతో తీర్చవలసివచ్చింది. ఇప్పుడు కైలాసంలో శాశ్వత సుఖభోగియై...

గౌరి : తాను కైలాస సుఖాన్ని బోధిస్తూ యిక్కడ తన బిడ్డకు నరకం కల్పిస్తాడా స్వామీ. అత డీ కుమారునికి తండ్రి.

శివ : నీ సామాన్య సంసారదృష్టికి అత డొక సంసారిగా, నీ బిడ్డకు తండ్రిగామాత్రమే యీ లోకంలో కన్పిస్తాడుగాని, నా యోగ దృష్టికి అసామాన్య శివభక్తుడుగా యీ భూమిమీదనే పరిచయ మైనాడు. యేడాదినాడు నా మార్గంలో వొక ధాన్యరాశిప్రక్కన వొక పంటకళ్ళాంలో కనిపించాడు. వీరముష్టి నిమ్మని ఆజ్ఞా పించాను. ఆ ధాన్యరాశి సప్పగించేశాడు. తన భార్యబిడ్డల బ్రతికించు కోవాలనే కోరిక, అత డీ భూమిమీద బ్రతికి యున్నప్పుడే లేదు. ఇప్పుడు కైలాసంలో...

గౌరి : కైలాసంలో యీశ్వర సన్నిధిలో వున్నా, ఆయన యీబిడ్డనే చూస్తూ వుంటాడు స్వామీ. ఈ కుమారునిమీద అతని యనురాగం యెంతపెద్దదో స్వయంగా నే నెరుగుదును.

శివ : అబద్ధం. అతడు ధాన్య మప్పగించిననాడే తన హృదయాన్ని మతపీఠానికి అప్పగించేశాడు. అత డిచ్చిన ధాన్యం నన్ను సంతృప్తి పరచనందుకు అత డెంతో సిగ్గుపడ్డాడు. తన సాంసారిక జీవితంమీద ఉగ్రుడైపోయి పరమ శివ నామాన్ని నినదించాడు. ఆ వుగ్రధ్వనికి వొక జైనగ్రామం దగ్ధమైంది. మతపీఠం మహదైశ్వర్యంలో వోల లాడింది. నే నానందించాను. వెంటనే నా ఆశీస్సులో అతనికి వీర భిక్ష దొరికింది. నా యోగదృష్టికి అతడు మతవిషయంలో అను రాగి, సంసారవిషయంలో విరాగి. కాబట్టే అతడు నావాడైనాడు. అతని నంటిన పాపం తుడిచివేశాను.

గౌరి : తాము తుడిచిన పాపం యీ బిడ్డమీదే పడింది ప్రభూ. నా బిడ్డ ప్రాణాలు మింగుతోంది. అన్న భిక్ష పెట్టండి దేవరా.

శివ : అన్న భిక్షా ! ఆశ్చర్యం. ఒక జైనగురువు యెదుట, వొక జైన భిక్షుకురాలివలె అన్నమడుగుతున్నావు. నేను శైవ మత గురువును. వ్రత సంబంధమైన భిక్షలుమాత్రమే...

గౌరి : ఒక వ్రతాన్నే భిక్ష పెట్టండి దేవరా. నా బిడ్డకోసం యే కఠిన వ్రతమైనా స్వీకరిస్తాను.

శివ : అదుగో ఆ వృద్ధపండితు లొక వ్రతాన్ని సూచిస్తారు; విను.

వేదికమీద పండితుడు గౌరిని పరీక్షగా చూసి బిగ్గరగా పలికినాడు.

"శంభుదాసు పరమ శివార్చకుడు. తన భార్యసహితం గురుపాదాల నాశ్రయించి వుండాలని అతని కోరిక. గురుసమ్ముఖంలో యీమె దేవదాసీవ్రతం స్వీకరించాలె.

"దేవదాసీ వ్రతమా"—గౌరి భయంతో అరిచేసింది.

పద్మా : అవును గౌరీ. దేవదాసీ వ్రతం. పచ్చి భోగందానివై-గురు పాదాలదగ్గిర జీవించాలె. ఈ మఠపీఠానికి నీ భర్త ప్రాణం అర్పించాడు. ఇప్పుడు నీవు మానం...

గౌరి నేత్రాలు క్రోధంతో ఎఱ్ఱబడినాయి.

గౌరి : 'శివయోగీ! నీ స్వమతస్థుల ప్రాణానికీ, మానానికీ ఆపద దెచ్చేంతటి కాముకమైనదా నీ మతదృష్టి?' (కోపం మింగుతూ మళ్ళీ పలికింది) 'నీ విచ్చిన వీరభిక్ష నా పతి నొక బందిపోటు దొంగను జేసింది. ఇప్పుడు నాకు వ్యభిచారభిక్ష పెట్టి నన్ను అవినీతితో నిండింపజూస్తున్నావు...పిశాచీ! యీ బిడ్డమీద అన్న దరిద్రాన్ని కల్పించింది నీవు. జైనులను దోచి నీ మఠంలో ధనరాసులు కుమ్మరిస్తూనే, యీ బిడ్డతండ్రి జైనఖడ్గాలకు బలైపోయినాడు. తీసుకో యీ బిడ్డను బ్రతికించు.'

నేలమీద బిడ్డనుంచి చివాలున లేచింది. వేదిక దిగి కోపంతో నడిచి పోతూవుంటే, శివయోగి ఆశ్చర్యంతో చూస్తున్నాడు. కొంత దూరం నడిచి ఆమె వెనుదిరిగి నిలిచింది. బిడ్డను దలిచి హోరున విలపిస్తూ ఆమె కూలిపోయింది. ఇది చూసి పద్మావతి నిలవజాలక ఆమె పతిపాదాలకు నమస్కరిస్తూ పలికింది.

పద్మా : పతీ సెలవిచ్చి పంపించు నన్ను!

జటా : ఎక్కడికి ?

పద్మా : గౌరి నోదార్చటానికి. ఆమె మన చిన్ననాటి స్నేహితురాలు. ఇప్పు డొక పెద్ద వియోగదుఃఖంలో కొట్టుకుపోతోంది. ఆమెను చూస్తూ వూరుకొంటే యీశ్వరుడే క్షమించడు.

శివ : ఈశ్వరుడా ?

పద్మా : అవును దేవరా, యీశ్వరుడే క్షమించడు. ఆమె దుఃఖం దైవికమైనది గాదు. ధనతృష్ణా సంబంధమైనది. ఒక్కరి ధన తృష్ణ ఆమె పతిని బలిగొన్నది, కన్న బిడ్డనుసహితం కాజేయ బోతున్నది. ఈ వియోగ దుఃఖంలోనుంచే చూస్తే పరమశివుడే యీ యన్యాయం సహించేట్లు కనుపించటంలేదు. ఈ ధనాశా పిపాసమీద తన రుద్రనేత్రం తెరచినట్లు........చూడుపతీ, ఆమె యెట్లా దుమ్మెత్తిపోస్తోందో, అది పరమ శివుని ఆగ్రహం. ఈ లోక క్షేమంకోసం ఆమెను శాంతపరచాలె...త్వరగాపోవాలె.

పద్మావతి పరుగెత్తిపోతూవుంటే జటాశంకరుడు లేచి నించు న్నాడు.

శివ : జటాశంకరా! నీకూ ఆ వియోగదృష్టే వచ్చినట్లుంది...అవునా ?

జటాశంకరు డేదో చెప్పబోతూవుంటే, శివయోగి శ్రద్ధ- పద్మా వతి దిక్కునకు కదలిపోయే జనసమూహాలలో ఆకర్షింపబడింది.

శివ : సభను విడిచి యెక్కడికీ జనులు లేచిపోతున్నారు ? వియోగం లోకేనా ? ఇక్కడ జంగాలు లేరా తమ భక్తితో అరికట్టేందుకు ?

వేదికక్రింద నిలిచిన జంగమ శిష్యులు, జంగమ సేవకులు కదలి పోయ్యే జనప్రవాహాన్ని నిలిపేందుకు తొందరపడినారు. ఇంతలో శేషించిన సభికుల దృష్టి వేరొక దిక్కునకు సాగింది - 'అన్నయదేవుల వారు వస్తున్నారు. అరుగో అన్నయదేవులవారు.'

భూమి దద్దరిల్లేట్లు జయనినాదాలు జేస్తూ ప్రజలు లేచి నిలిచారు. బాణవేగంతో స్వారిజేసివచ్చే డెబ్బదియేండ్ల వృద్ధుడు,

అన్నయదేవుని ఆహ్వానించే కుతూహలంతో కొందరెదురేగుతున్నారు. ఈ యాహ్వానం శివయోగి నిర్వ్యాపరిచింది.

'నా భక్తియోగాన్ని చిన్నబుచ్చినారు. నా చుట్టూ నా శైవ ప్రజలు వియోగానికే విజయంగోరుతున్నారు.'

ఒక్క శైవులేగాక యింతవరకూ యెంతో దూరాన మూగి యున్న జైనులుసహితం వృద్ధ అన్నయదేవుని జేరుతున్నారు.

౨

అన్నయదేవుడు మేధానిధి; పరాక్రమవంతుడు. కాకతీయ సామ్రాజ్యాని కతడు సాధించియిచ్చిన విజయాలు రుద్రమదేవి మహారాజ్ఞి నెంతో ఆనందపరచి, అతడు రాజబంధువై యుండటం సామ్రాజ్యానికి మేలని ఆమె తలచింది. కాకతీయులు శూద్రులు, అన్నయదేవుడు బ్రాహ్మణుడు. ఆకాలంలో కులాంతరవివాహాలు నిషిద్ధమైనవి గాదు. రుద్రమదేవి మహారాజ్ఞికి వొక్కతే కుమార్తె, 'రుయ్యాంబ' తన పుత్రిక నిచ్చి అన్నయదేవునికి వివాహంజేసింది. లోకాన్ని సుఖపరిచే సామ్రాజ్యసేవలో అతడు తేజరిల్లినాడు. కాకతీయ సామ్రాజ్యానికి నే డాయన ప్రధానమంత్రి, ప్రధాన సేనాధిపతి. రాజభక్తుడు. ఈ యన్నింటినిమించి 'అతడు దైవభక్తుడు'. ఆకాలంలో సామ్రాజ్యప్రజలు భిన్నమతాలతో, కులాలతో చీలియున్నారు. కుల మత భేదాలకారణంగా మానవులమధ్య అనైక్యత, ద్వేషమూ, స్పర్థా నానాటికీ అశాంతిని వృద్ధిజేస్తోంది. అరాచకంతో జాతి బలహీన పడుతోంది. అన్నయదేవు డిది సహించలేక వొక ఆశ్రమాన్ని స్థాపించి నాడు. ఏకజాతీయత, శాంతి, సౌభ్రాతృత్వం - యీ ఆశ్రమ ధర్మాలు మూడూ తమలోకి ప్రభవిస్తూవుంటే, బదులుగా మానవులు తమ భక్త్యనురాగాలను ఆశ్రమంలోకి ప్రవహింపజేస్తూ వుంటారు. అన్నయదేవుడు రాజపదవులలోగాక, యీ భూమికి జెందని పరమపదంలో దర్శనమిస్తున్నట్లు లోకం విభ్రమపడుతూవుంటుంది.

వయస్సునకు వృద్ధుడైనప్పటికీ అన్నయదేవుడు దృఢకాయుడని లోకమెరిగిన సంగతి. ఒక యువకునివలె గుఱ్ఱంమీదనుంచి సులభంగా దూకి అత డెవ్వరినీ ఆశ్చర్య పరచలేదు. కాని, తనమీదికి తరలివచ్చే ప్రజానురాగతరంగాల కెదురీదలేని అశక్తతను చూపినప్పుడే లోకం

ఆశ్చర్యపడింది. ఈ యాహ్వానం శివయోగి నిర్ద్వపరచింది. తన అసూయ నతడు పైకి రానీయలేదు. ఏదో విచారంలో వున్నట్లు అతడు తలవొంచి కూర్చున్నాడు.

వేదిక సమీపించే అన్నయదేవుని గౌరవార్థం పెద్దలందరూ లేచి నిల్చినారు. శివయోగి పీఠాధిపతి, ఇతనికంటే వయస్సునకు పెద్ద వాడైనా అన్నయదేవుడు పీఠాధిపతికి నమస్కరించి పలికినాడు.

అన్న : తామేదో విచారంలో వున్నారు దేవరా!

శివ : అవును, అన్నయదేవా. నే డంతఃపురంలో అవసానదశయందున్న నీ ధర్మపత్నిని గూర్చి, ఆందోళనపడే నా మనసును వేరొక విచారం ఆశ్రయించింది — మన శైవులలో వియోగంమీద యింతటి మమతపెంచింది మన సామ్రాజ్యమని...

అన్న : వియోగంమీద మమతా స్వామీ. తమ మాటలు నాకు అర్థమవటం లేదు.

శివ : 'ఇటురా, యిక్కడ చూడు, యీ వేదికమీద యీ పసిబిడ్డను. ఈ బిడ్డతండ్రి శివభక్తుడు. జైనులతో పోరాడి కైలాసం జేసుకొన్నాడు. అతని భార్య యీ బాలుని యిక్కడ విడిచిపెట్టి అన్నది గదా—"ఎడబాటంటే నా పతికెంతో యిష్టంకాబట్టే తన భార్యాబిడ్డలనుండి వియోగమై పోయినాడు. నేను పతివ్రతను. నా భర్త ప్రీతికోసం వియోగాన్నే యిష్టపడితీరాలె. ఈ బిడ్డకిదూరమై పోతున్నాను"అని ఆ పిచ్చిది పారిపోయింది. జటాశంకరుని పిడిచి ఆమె వెనుక పద్మావతి పరుగులెత్తింది ... యెందు కాబిడ్డనే చూస్తూ కూర్చున్నావు అన్నయదేవా. రా యిటు యీ యాసనంలో కూర్చో' అన్నయ లేచిరాలేదు. ఆ బిడ్డనుతాకి నిట్టూర్చినాడు.

అన్న : ఈ బాలుడు చనిపోయినాడు దేవరా.

శివ : ఆశ్చర్యపడకు. తల్లి స్వీకరించిన వియోగవ్రతమే బిడ్డలో ఫలించింది. జీవించివుండగానే భార్యాభర్తలమధ్య యెడబాటు —

ఆయువుండగానే తల్లిబిడ్డలనడుమ యెడబాటు యింతవరకు జైనుల లోనే కన్పిస్తుంది. కారణం? జైనులరాజ్యం అస్తమించింది. వారి మతం హీనపడింది. ఈ భూమిమీద సంపదలకూ, సౌఖ్యాలకూ జైనులు ఎడమైనారు. మరింత యెడబాటుకోసమే ఆ నిర్జీవ మతంలోవుండే పరమశివ అనుగ్రహాన్ని కోరికోరి వియోగపడు తున్నారు. ఈ వియోగానికి తమ హృదయాలను శైవులు అప్పగిస్తే, మన శైవమతం కలుషితమైపోదా...యీ మాట పరమశివాగ్ర హంగా నా గుండెలమీద ప్రశ్నిస్తోంది. జైనుల కిష్టమైన వియో గమే నా జీవితంలోయెక్కడ తలెత్తి పరమశివుని యెక్కరిస్తోందో.

"తమ జీవితంలో వియోగమా! అవును. పరమశివునికి దూరంగా వొక జైన నాయకునిఆస్తి నన్ను నిలిపింది. తన ధర్మాన్ని అనుష్టించే విషయంలో వొకని ఆస్తి అతని కాధారం కావచ్చు. కాని ఆ యాస్తే నా భక్తిని భంగపరచకూడదు. నా భక్తి కే యన్యాయం జరిగిందో వొక్క మా శైవ మతస్థులకేగాక పరమతస్థులైన జైనులను సహితం హెచ్చరించ దలచాను. కాబట్టి, శైవులతోబాటు, జైనులు కూడా ఆహ్వానింపబడ్డారు. యిరుమతస్థులు కూడిన యీ సమావేశా నికి అన్నయదేవా, అధ్యక్షపీఠాన్ని నీవే అలంకరించు, ఇది నా కోరిక. ఏమనగా ఇది ఆస్తితెచ్చిన విషమ సమస్య. ఈ యాస్తి, యేనాడో వొక ప్రభుత్వం సృష్టిస్తే, యీనాటికీ మన రాజ్యం దాని ఉనికిని నిర్లక్ష్యం చేస్తోంది. దాని మనుగడే మా శివమతానికి వొక ఆఘాతమైంది. నీవు శ్రీ కాకతీయ శైవ సామ్రాజ్యానికి ప్రధాన మంత్రివి, ప్రధాన సేనాపతివి, తగిలిన దెబ్బను తుడిచేస్తానని యీ సభాపతి పీఠంమీదవుండి నీవే ప్రతిజ్ఞ చేస్తే యీశ్వరుడు శాంతిస్తాడు."

"ఈశ్వర శాంతికోసం జరిగే ప్రతి ప్రయత్నానికీ నా ప్రతిజ్ఞ విరోధంకాబోదు దేవరా. మీ భక్తి భంగపరచే ఆస్తి యెవరిది?"

'రామశరణు ఆస్తి.'

కృతాంజలుడై అరువదియేండ్ల వృద్ధుడు రామశరణు యేదో ప్రశ్నించబోయినాడు. అతనిని వారిస్తూ శివయోగి పలికినాడు.

శివ : 'రామశరణూ, ఇక్కడ జరిగే ఆరోపణ ఆస్తిమీదేగాని, నీ మీద గాదు. నా తాత తండ్రులు నీ తాత తండ్రులను జీవితాంతంవరకూ సహించగలిగినట్లు, నిన్ను నేను సహించి తీరాలె. కాని నీ యాస్తిని మాత్రమే నేనసహిస్తున్నాను. ఏమంటే, జైన మతస్తుడవు. నేను శివ మతస్తుడను. మన భిన్నమతాలు మన యిరువురినీ వేరుపరిచి యీ లోకానికి చూపిస్తూవుంటే, నీ యాస్తి మన యిరువురిని వొక్క చుట్టరికంలో, వొక్క కుదురులో చూపిస్తోంది. కారణం మన యిరువురి పూర్వులూ వొక్క వంశీయులు - ఏకగర్భ సంజాతులు.'

సభికు లాశ్చర్యపడడంచూస్తూ వొక్కక్షణమాగి శివయోగి తిరిగి పలికినాడు:

"అవును అన్నయదేవా! పూర్వులనగా మా తాతలు. ఒక తండ్రి బిడ్డలు. నూరు గ్రామాల విశాలభూమికి వారు నాయకులు. ఈ భూమిమీద శైవమతం విజృంభించి, జైన బౌద్ధరాజ్యాలను ధ్వంస పరిచేస్తుండు, మా తాతలలో వొకరు శివమతాన్ని స్వీకరించారు. ఆయన కుమారుడే నా తండ్రి, జంగమకుల భూషణుడు. నే నిప్పుడు పీఠాధిపతిని. కాగా మా పెదతాతగారు, ఆయన కుమారుడైన మా పెదతండ్రివలెనే జైన మతస్థులై యుండేవారు. రామశరణు వారి సంతతి వాడు. నేనూ, రామశరణూ వొక్క మతంలో వున్నట్లైతే, వొక్క వంశీయులమై వుండేవాళ్ళం. మతం భేదించింది. శివమతంలోకి చీలి పోగానే, మా స్మృతిపథంలో పూర్వపు జైనచుట్టరికం మాసితీరాలె. కాబట్టే క్రొత్తవంశాన్ని స్థాపించారు. ఈ వంశభేదాన్నెనా పాటించటంలేదు. రామశరణు ఆస్తి, యాభై గ్రామాల పెద్దభూమి. తన పూర్వాన్ని జ్ఞప్తిచేస్తూ— "నీవు రామశరణు తమ్ముడవని అంటోంది—" అన్న: 'ఆస్తే అంటోందా స్వామీ?'

శివ : 'అనటమే గాదు, తన వారసత్వంలో నన్ను చూపిస్తూ, ఆక్షే పిస్తోంది పరమశివుణ్ణి.'

అన్న : రామశరణుకి కూతురుందిగాదా దేవరా!

శివ : కూతు రేగాదు, నూరుమంది కొడుకులున్న యీ యాస్తికి వారసులు గాలేరు. అది పరమశివునికి చెందవలసినభూమి, పూర్వం ప్రమాదకరమైన వొక యుద్ధంలో, వొక జైనరాజను మా పూర్వులు గెల్పించారు. విజయోత్సవ సమయంలో ఆ రాజు నూరు గ్రామాలభూమిని కానుకగా యిచ్చి, వంశపారంపర్యపు హక్కులతో ఆ భూమిమీద వారిని నాయకులుగా జేశాడు. ఈ భూమిమీద వంశపారంపర్యపు హక్కులతో ఆ నాయకులపదవిలో మాపూర్వులు నూరేండ్లు నిండించారు... జైనరాజుల పరిపాలన యీ భూమిని నిస్పృహా నిరాశాంధకారంతో నిర్వీర్య పరిచేప్పుడు శివమతం ప్రకో పించింది. ఆ యగ్నిజ్వాలలో యీ భూమిమీద జైనరాజ్యా లాహుతి యైనాయి. ఒక రాజ్యం రూపుమాయగానే దానికి చెందిన పదవులూ, బిరుదులూ, ప్రదానాలూ ఆ రాజ్యంతోపాటే అంత రిస్తాయి. ఇది రాజకీయ సాంప్రదాయం. స్థాపితమైన శైవరాజ్యం అది. విస్తరించినమేరలో యీ సాంప్రదాయాన్ని వర్తింప జేసింది. జైన నాయకత్వాలనుతుడిచి కొన్ని సీమలమీద శైవ నాయ కత్వానికి స్థానమిచ్చింది. మరి చాలభూముల మీద యీ జైన నాయకత్వాన్ని ఉపేక్షించింది, యించుమించు సహించి ఊరుకొంది. కారణం?

జటా : ఇది మన శైవరాజ్య ఉదారత...

శివ : ఉదారత!... అల్పమైన మీ రాజకీయదృష్టిలో యీ చర్య ఉదారంగా కనిపిస్తోందేమో, మరి అనల్పమైన మా మతదృష్టిలో యీ భూమిమీద జైననాయకత్వం పెద్ద వుత్పాతంగానే కన్పి స్తోంది. ... పారంపర్యపు హక్కులతో వున్న వొకేవొక పెద్దఆస్తి, నూరుగ్రామాల భూమి, యిపుడు రన్నదమ్ములమధ్య రెండుగా

చీలింది. క్రొత్తగా పుదయించిన శివమతంలో వొకరు కలిసిపోయి, తనవంతు యాభై గ్రామాల భూమిని శైవమత పీఠానికి అర్పించి వేశాడు. శివమత ప్రకాశాని కాభూమి జీవగడ్డయి వెలసింది. రెండవభాగం జైన మతాంధకారానికి నిలయమయింది. అంధకారానికీ, ప్రకాశానికీమధ్యనున్న విరోధమే జైన, శైవ మతాలమధ్య నెలకొన్నది. వెలుగు ఉదయించటం చీకటిని మిగిలించుకోటానికి గాదు. వాటి నంతరింప జేయటానికి మాత్రమే. జైనమతాన్ని రూపుమాపేందుకే శైవమతం ఉద్భవించింది. జైననాయక పదవులు మాత్రమే యీ మతాన్ని నిలిపినాయి. ఈ సామ్రాజ్యంలో నూరింట యెనభైమంది ప్రజలు జైనులు. అనగా సామ్రాజ్యం విస్తరించిన మేరలో భూమి ఎనభైపాళ్లు జైన మతాధీనంలో వున్నది. రాహువునోట్లో యిరవై పాళ్లు మిగిలి, కనిపించే సూర్యబింబంవలె, తన కాంతితోబాటు గ్రహచ్ఛాయనుగూడా కుమ్మరిస్తూ శివమతం తన వున్నతిలో క్రాంతించవలసివస్తోంది. గ్రహచ్ఛాయ వొట్టి మట్టినిమాత్రమే మైలపరచి వూరుకోను. దానిమీద బ్రతికే జీవుల మీద సహితం తన దోషాన్ని అంటించితీరుతుంది. జైనమతం వొక దుష్టగ్రహంవంటిది. ఈ భూమిమీద దాని నాయకపదవులకు పారంపర్య హక్కు లున్నాయి; కాబట్టే నా జీవితంమీద దాని మలినచ్ఛాయ తన వారసత్వాన్ని ముద్రించుకొంది. నేను శైవ మత పీఠాధపతిని, కాకతీయసామ్రాజ్య అధికారమతమైన శైవ మతానికి పీఠాధిపతిని. నా జీవితాన్ని అనుసరించి సాగుతుంది శైవుల జీవితం!

అతడు క్షణం కన్నులు మూసినాడు. ఆ తరువాత సమూహ పడిన శైవులను చూస్తూ, అన్నయదేవుని సంబోధించి పల్కినాడు:

"మాట్లాడవేం అన్నయదేవా? సామ్రాజ్యం విస్తరించియున్న మేరలో యీ భూమిమీద శివమతం తనధర్మాన్ని ప్రకాశింపజేసే విధిలో వొకపరిమితిని వొప్పుకోదు. జైన నాయకపదవు లొక్కటే

యీ పరిమితిని గీసి చూపిస్తున్నాయి. బరిదాటి కాంక్షించవద్దని వంచన చేస్తున్నాయి. వొకహద్దులో, (ఆత్మ) వంచనలో, శివమతం చీకటిని తోడుజేసుకొని జీవించవలసి వస్తోంది. ఇది శివక్షేత్రం. ఈ పుణ్య భూమిలో భాగ్యాలుపండే శైవమతం, జైన దారిద్ర్యంలో చెలిమిజేసి సాగాల్సివస్తోంది. భాగ్యానికి దరిద్రమే అంటితే నిలుస్తుందా ధర్మం సుఖతరమైన ధర్మానుష్ఠానంలో వికసిస్తుందా! ఆత్మ వ్యధ నోంచు తుందా? జైన నాయకత్వం తన భూమిలో పండించి మా జీవితం మీంద ప్రయోగించేది యీ యాత్మ వ్యధమాత్రమే. ప్రజకులో యీ వ్యధ దుర్భరమై పోయింది. అది పరమశివుని మీద భక్తిని తామి నా మనసులో పాపం నింపించింది. చూడలేకపోతోంది శివుని, నా మనసు, శివ ధర్మానికి యెడబాటులో – నిస్తేజంలో, నిర్వీర్యంలో.. హోరున యేడ్చాను. నాలో యీ శూన్యానికి కారణ మేమని పరమ శివుని ప్రార్థించాను. నా హృదయాంతరాళ లో రుద్ర శంఖం రొద్రించింది. నేనోక నిశ్చయానికి వచ్చాను. స్వపరమతాల రెంటింటి వారసత్వాలనూ యీ భూమి భరించలేదు. రాజ్యాంగ చట్టంలో జైననాయక పదవులకు భద్రతలు కల్పించబడినాయి. న్యాయ స్థానం ద్వారా నా మతానికి న్యాయాన్ని సంపాదించలేను. కాబట్టి వొక్కసారి రామశరణు బంధువునై, అతనికి ఒక్క క్షణం తమ్ముడనై ..

అన్న: వొక్కక్షణమేనా దేవరా!

శివ: అవును వొక్కక్షణ ఆస్తిదగ్గిర తమ్ముడనై నిలిచి, అవి స్వాధీనం కాగానే మతం దగ్గిర శాశ్వతంగా విరోధినై నిలుస్తాను.

అన్న: నిలిచి యీ భూమికి సాధించి యిచ్చేది వైరమేగదా దేవరా. అది స్వదేశీయులైన పరమతస్థులనుండి సిద్ధించి మాత్రమే వూరుకోదు. విదేశీయుల నుండికూడా సిద్ధపడి తీరుతుంది. ఈ భూమిమీద జైనులూ, శైవులూ కలహించి కలహించి పోషించిన వైరమే రెండు సార్లు విదేశీయులతోటి యుద్ధాన్ని యీ రాజ్యానికి ప్రసాదించింది. భూమి గ్రహించగోరేది విరోధంగాదు, స్నేహం! ఇది ఈశ్వరుని

కర్మభూమి. ఈ పవిత్రక్షేత్రంలో ఆచరింపబడే సత్కర్మలకు స్నేహమే జీవం. మరియూ జీవనం సఖ్యతతో, స్నేహంతో వెలుగొందే కర్మజ్యోతియొక్క ప్రకాశమే ఆత్మవికాశానికి ఆధారమవుతోంది. వికాసం స్వపరభేదాన్ని పాటించదు. స్వపరభేద మూలంగా ప్రత్యక్ష మయ్యే అంతశ్శత్రువును అనగా అంతఃకలహాన్ని అది సహించదు. స్వదేశీయుడైన వొక చిన్న మతస్థుడికి స్నేహమివ్వటం ఈశ్వర మతానికి విరుద్ధం గాదు. మీరు రామశరణు భిన్నమతాల్లో వున్నప్పటికీ మీ యిరువురిలో ప్రవహించేది వొకే సోదర రక్తమని మీ పూర్వగాథ సాక్ష్యమిస్తోంది. అతని వశంలో వున్న భూమికోసం క్షణమాత్రం సోదరులై నిల్చేకంటే, యీ కర్మ క్షేత్రంలో నూరేండ్లూ పరమతానికి సోదరస్నేహమే అర్పించరాదా?

శివ: ఎవరు అర్పించవలసింది.

అన్న: గురుపీఠంలోవున్న మీరు, ధర్మానుష్ఠానం స్నేహమే మెలిగితే ఆ జ్యోతిని స్వమతస్థులేగాదు పరమతస్థులు సహితం కన్నులద్దు కొంటారు.

అన్న దేవునిపేరెత్తి జైనశైవులేకంగా జయధ్వనులు చేస్తూ వుంటే, శివయోగి ఉగ్రుడై జనులవైపు చూసినాడు. ఆ యావేశంలో యేమి మాట్లాడాలో అతనికి తెలియలేదు. అతడు వడిగా నడిచి పాలకీని సమీపించినాడు.

## 3

ఆరాత్రి రాజమందిరంలో రుయ్యాంబ స్పృహదప్పి శయ్య మీద పరుండివున్నది. ఆమె వృద్ధురాలు. సంభవించిన బలమైన వ్యాధిని జయించి, ఆమె జీవిస్తుందనే నమ్మకం యెవ్వరికీలేదు; తన కోసం జీవించి వుండాలనే కోరిక ప్రతాపరుద్ర చక్రవర్తిని వేధిస్తోంది. అపార మాతృభక్తే యిందుకు కారణం!

సింహాసన మధిష్టించే యర్హతలు స్త్రీలవిషయంలో సమ్మతించని దురాశాపరులున్నారని గణపతిదేవ చక్రవర్తి భయపడిపోయినాడు; కాబట్టి రుద్రమదేవి జన్మను రహస్యపరచి, తనకు కుమారుడుదయించినట్లు ప్రకటించినాడు. లోకం నమ్మకపోలేదు. రుద్రయ్య అను పేరుతో రుద్రమదేవి బాహ్యలోకానికి దర్శనమయ్యేది. తరువాతి సింహాసన మధిష్టించవలసిన యుక్తవయసు సమీపించింది. ముమ్మడమ్మ యను బ్రాహ్మణస్త్రీనిచ్చి రుద్రమ్మకు పెండ్లితంతు పూర్తిజేసి, పట్టాభిషేకం ముగించారు. అనంతరం, కాకతీయ సామ్రాజ్య సింహాసనంలో కూర్చున్నది స్త్రీయని అధికార ప్రకటన జరిగినవెంటనే ముమ్మడమ్మను తన కుమార్తెగా రుద్రమదేవీరాజ్ఞి ప్రకటించుకొన్నది. వేరొక సామంతరాజునకిచ్చి ఆమెకు పెండ్లిజేసింది. ముమ్మడమ్మ గర్భాన జన్మించినవాడే యీ రెండవ ప్రతాపరుద్రుడు.

రుద్రమదేవి వేరొక సామంత రాజును వివాహమాడింది. రుయ్యాంబ ఆమె కుమార్తె. కాకతీయ సామ్రాజ్యానికి వారసురాలు రుయ్యాంబ కాజాలదని అడ్డుజెప్పేవారు ఆ రాజ్యంలో లేనిమాట నిజమే. కాని రుయ్యాంబకు రాజ్యకాంక్షలేదు. ఆమె అన్నయదేవుని ధర్మపత్ని. మహాసాధ్వి. ఆమె రాజమందిరంలో సౌఖ్యాలు త్యజించి, వొక ఋషిపత్నివలె ఆశ్రమంలోనే జీవించేది.

ప్రతాపరుద్రుని ముప్పమాంబ కన్న దేగాని, అతనిని ప్రేమించి పెంచినది రుయ్యాంబ మాత్రమే; రుయ్యాంబ వొళ్ళోనుంచే ప్రతాప రుద్రు నెత్తుకొని, రుద్రమదేవి అతనిని కాకతీయ సామ్రాజ్య పీఠానికి అందించింది.

ప్రతాపచక్రవర్తి రుయ్యాంబకు ఋణపడియున్నమాట నిజమే. ఆశ్రమధర్మం అహర్నిశలూ ఆమె జీవితంలో జాగృతమై యుండే కారణాన తన రాజమందిరంలో ఆమెను సేవించే భాగ్యం మిక్కిలిగా చక్రవర్తికి కరువైంది. ఇప్పుడామె జీవితంలో అంతిమ గడియలు సమీపిస్తూ ఉన్నాయి. మాతృసేవలో తరించాలనే కోరికను అన్న దేవుడు తిరస్కరించలేకపోయినాడు. కాబట్టే నేడు రాజమందిరంలోకి ఆమెను తీసుకొని రాగలిగినాడు.

అర్ధరాత్రి నిద్రాహారాలు మరిచి ఆమెను బ్రతికించే యత్నంలో చికిత్స జేసే వైద్యులను రెప్పార్పక జూసే ప్రతాపరుద్రుని సమీపించి శివయోగి పలికినాడు.

శివ : కొంచెం విశ్రమించరాదా ప్రభూ! అట్లా చూస్తూ నిలిస్తే...

ప్రతా : శ్రద్ధగా పరిశీలించే వైద్యులమీద నుంచి నా చూపులు మరలటంలేదు స్వామీ! యేమంటే, వారి ముఖంలో వొకసారి నిట్టూర్పు విన వచ్చిందో, ఆ పైన యీ రాజముఖంలోనుంచి నాగే నిట్టూర్పు మన రాజ్యంలో ఆ కొనవరకూ వ్యాపించేంతటి దీర్ఘమై పోతుంది. ఈ దేశ ముఖాన్ని అది యెన్నాళ్లు విషణ్ణంగా వుంచు తుందో యెవరికి తెలుసు?

శివ : అవును ప్రభూ! వేలాది శైవులు...

ప్రతా : వొక్క శైవులేగాదు స్వామీ, మనరాజ్యంలో జైనులు సహితం, యీ పెనుదుఃఖంలో స్వధర్మ భేదాలను మరచి ధర్మభిక్షు కులై కూర్చుంటారు... నేను ముప్పమాంబ గర్భాన జన్మించాను, రుద్రమదేవి చేతుల్లో పెరిగినాను చిన్ననాటను చీ యీ రుయ్యాంబ వొళ్ళో నాకు మాతృస్నేహమే కరువైనట్లైతే, కాకతీయ సింహా

సనంలో నాతోబాటే వొకపెద్ద అరాచకానికి పట్టాభిషేకమై తీరేది...అయితే యీమె శివదీక్షాపరురాలు. సింహాసనంలో నేనే వున్నప్పటికీ, యీమె త్యాగానికే కిరీటం దక్కినట్లు నేను సంభ్రమిస్తూ వుంటాను.

రుయ్యాంబకు స్పృహ తెలిసింది.

రుయ్యాంబ : రుద్రుడూ.

చక్రవర్తి : అమ్మా; యిప్పుడే వచ్చాను.

రుయ్యాం : యెక్కడనుంచి ?

చక్రవర్తి : తమమత భేదాలను మరిచిపోయి, కూర్చున్న ప్రజలదగ్గిర నుంచి.

శివ : యేనో వొక కొత్తలోకాన్ని రుయ్యాంబతల్లికి చూపిస్తున్నారు.

ప్రతా : అవునమ్మా. నీనిగూఢభక్తి, నా చక్రవర్తిత్వాన్ని నాచేత మరిపించింది; ప్రజలచేత మతాన్ని మరిపించింది. నేను నీయెదుట నిలిచినట్లే, జైనులు శైవులు నీ సమక్షంలోనే వుండగోరుతున్నారు. నీస్థితికి ఆందోళన పడుతూ సింహద్వారంముందు సమూహమై పడి నారు.

రుయ్యాం : ఈ రాజమందిరంలోకి యెందుకు తీసుకవొచ్చావు రుద్రుడూ ?.. ఆ ప్రజలమధ్యే;

ప్రతాపు : వారు తమమధ్యలో యేర్పాటుతరబడి సేవించారుగదా అమ్మా నిన్ను. మాతృసేవలో వారికిగల హక్కు నాకులేదా ?

రుయ్యాం : ఉన్నది.

ప్రతా : కాబట్టే ఆ ప్రజలతో పోట్లాడి వచ్చాను.

రుయ్యాం : యేమని ?

ప్రతా : స్వస్థత గలిగేవరకూ నిన్ను నేనే సేవించుకొంటానని.

రుయ్యాం : రుద్రుడూ, చిన్ననాటినుంచీ నీ కిదే యలవాటు; నావాళ్ళే యింకొకరుంటే నీవు సహించేవాడివిగాదు. ఇప్పటికీ యీయల

వాటు పోలేదు నీకు. నీవైనా ప్రజలమధ్యే సేవించాలె రుద్రుడూ, లేదా నాకు సేవలే రుచించవు.

ప్రతా: క్షమించు తల్లీ. యీ మందిరంలో స్వేచ్ఛగా ప్రజలు నిన్ను దర్శించేందుకు మార్గాలు కల్పిస్తాను.

రుయ్యాం: మంచిది. అప్పుడు నేను చచ్చిపోయినా, దీనశరణ్యానికి తొందరిల్లే నాపతి పాదాలు దూరమైపోయినట్లనిపించదు..... పతీ, నాతలక్రింద మీ పాదాలేవి?

అన్నయదేవుడామె చెంతనే కూర్చుని యున్నాడు. తన పాదాలామె తలక్రింద జేర్చినాడు. ఓక్షుదప్పి శివయోగి కంఠం వినిపించింది.

శివ: జంగమ గురుపాదాలిక్కడ అవమానింప బడుతున్నాయి.

ప్రతా: స్వామీ తమరాగ్రహించి అన్నయదేవులవారిని భయపెడుతున్నారు.

శివ: పరమశివునీ, పరమశివమతాన్నీ, పరమశివ మతగురువునీ, రుయ్యాంబ మరిచిపోయింది. పరమశివభక్తులైన జంగాలీ నిర్లక్ష్యాన్ని సహించలేరేమో.

ప్రతా: తన పతినే దైవంగా ఆరాధించే చర్య.....

శివ: పరమశివుని ప్రతినిధిని. పీఠాధిపతిని, యిక్కడే వున్నానుగదా. ఈ యంత్య సమయంలో స్పృహదెలిసి నప్పుడైనా స్వమత గోష్ఠి, జంగమ గురుప్రసక్తి...

పదహారేండ్ల గంగ, ఆమె రుయ్యాంబ కుమార్తె, ప్రవేశించింది. ఈ యాశ్రమకన్య కట్టుచీర నెత్తురుతో తడిసిపోయింది. పచ్చని ముఖం మీద రక్తం స్రవిస్తోంది. నెత్తురుతో ఆమె చేతులు యెఱ్ఱబడినాయి. నెత్తురారని కత్తి ఆమెచేతిలో మెరుస్తూనేవుంది. చూసి అందరూ నివ్వెరపోయినారు. రుయ్యాంబ ఆందోళనతో లేవబోయింది. అన్నయదేవుడామెను వారించినాడు.

ప్రతా: నిన్నిట్లా గాయపరచిన దుర్మార్గుడెవడు చెల్లీ!

శివ: నీవు స్నానమాడిన రక్త మెవరిది గంగా?

ప్రతాపరుద్రుని భద్రహస్తాల్లో నిలిచి ఆమె పలికింది.

గంగ: వొక జంగానిది.

శివ: అతడు నా శిష్యుడు.

ప్రతా: భయంలేదు. జరిగిన కథేమో చెప్పు గంగా.

తన కన్నీట చక్రవర్తి వక్షాన్ని తడుపుతూ, గంగ పలికింది...

గంగ: ఆశ్రమంలో నేను ఆర్ఘ్యమిచ్చే వేళ...ఒక జంగం వచ్చినాడు.

శివ: రుయ్యాంబతల్లి నిన్ను కలవరించింది. చక్రవర్తి అనుమతించగా నేనే పంపించా నతనిని.

గంగ: తెలుసు. అతనితో నేను ప్రయాణమైనాను. దేవదాసీవ్రతం తీసుకోవలసినదని మార్గంలో అతడు బోధింపసాగినాడు. శివభక్తులైన నాతల్లిదండ్రులమాట జవదాటనని బదులు చెప్పినాను. అతడు దుష్కాముడు. నన్ను చెరబట్ట బోయినాడు.

చక్రవర్తి శివయోగిని చురచురాచూస్తూ పలికినాడు.

"మతభక్తి, జంగమ గురుప్రసక్తి యీ రక్తంలో ప్రకటితమైంది. శాంతించవచ్చు తమరు."

చక్రవర్తి హస్తాల్లో గంగ భద్రంగా నడిచి సమీపించగానే దుఃఖిస్తూ ఆమె రుయ్యాంబమీద వ్రాలి పోయింది. బాధతో రుయ్యాంబ కళ్లు మూసుకొంది. కనురెప్పల గప్పుకొన్న బాధ సుఖానిదో, దుఃఖానిదో, మోహానిదో, భయానిదో గ్రహించలేదు.

గంగ: చూడు అమ్మా నన్ను, నీ బిడ్డను, గంగను యీ కత్తిపోటు చూడు యీ ముఖంమీద.

రుయ్యాంబ రెప్పార్పక చూస్తూ పలికింది:

"చూస్తున్నాను బిడ్డా. ఇంతకుపూర్వం యెన్నోసార్లు గాయపడిన శరీరాలతో జైనులూ, శైవులూ నా మందిరంలోకే జేరుతూ వుండేవారు. నాచేత్తో ఆ గాయాలుమాన్పి జైనశైవలోకాల నోదార్చేదాన్ని. నీవు నా కన్నబిడ్డవు. నీ ముఖ మీద ధారగట్టిన రక్తాన్ని నా చేత్తో తుడిచినా ఆ నొప్పి తీరేదిగాదు. ఇది స్వప్రయోజనంతో

స్వామతస్థులు జేసిన గాయం. మన స్వమతం, శివమతం సువిశాల మైనది. గాయపడిన తావునుంచి ఆ విశాల లోకంలోకే సాగిపోక పోయినావా? బిడ్డా, లోకంకోసం నేను జన్మించాను. నీవు నా బిడ్డవు. నీవు గాయపడిన సంగతివిన్న క్షణంనుంచీ లోకం నీకోసమే యెదురు చూస్తూ వుంటుంది. తన ఆదర హస్తాలతో లోకం యీ నెత్తురు తుడిచి నప్పుడే, బ్రతికివున్నన్నాళ్లూ నీ మనస్సుకేగాక మరణించిన తరువాత నా యాత్మకుగూడా శాంతి లభించేది. ఎందుకు మరిచిపోయినావు బిడ్డా నన్ను. ఎందుకు పోలేదు ఆ లోకంలోకి? అటు గాయపడి యిటు పారిపోయి వచ్చావు. ఆ రక్తధార నీ పిరికితనాన్ని పాడి విని పిస్తోంది. నిజమే, సామాన్య ఆత్మరక్షణ కోసంగాక, అత్యుత్తమమైన రక్షణకోసంపొందిన గాయమది. దాన్ని ముద్దాడి, గర్వించి మరణిం చాలని తొందరపడుతున్నాను. ఆలస్యమైనాసరే, యీ గాయాన్ని లోకం తన హృదయాన ముద్రించుకొంటేచాలు గంగా – ...పో, ప్రయాణమైపో ఆ లోకంలోకి!

శివ : అక్కర్లేదుతల్లీ వెలుపలికి పోనక్కరలేదు. వెలుపలున్న లోకమే యిక్కడ విశాలపడి యుంది.

రుయ్యాం : ఎక్కడ?

శివ : ఇక్కడ, నాలో. నేను శివమత పీఠాధిపతిని. లక్షలాది శైవులకు మతగురువును, నన్ను జేసినవారు శైవలోకాన్ని జేసినట్లే కాబట్టి నీ బిడ్డ యిటే రావాలి. ఆజ్ఞాపించు నీ బిడ్డను తల్లీ!

రుయ్యాం : చెయ్యలేనాపని స్వామీ.

శివ : కారణం!

రుయ్యాం : నాబిడ్డకు కావలసిన క్షమాభిక్ష మీవద్ద లభించదు.

శివ : కారణం?

రుయ్యాం : నా గంగను గాయపరచినవారు జంగాలు. తమ శిష్యులు. వారిలోవున్న దౌర్జన్యాన్ని మాత్రమే ఆ గాయం స్పష్టపరుస్తోంది. దాన్నే మీరు సహించేప్పుడు...

శివ : అవును తల్లీ, దౌర్జన్యాన్ని క్షమించినప్పుడే నాలో క్షమకు స్థానం వుంటోంది. యేమంటారా, దేవదాసీవ్రతం తీసుకొన్నప్పటి మాత్రమే వొకరు దౌర్జన్యం చేశారు. మన శివమత ప్రచారంకోసం యీ వ్రతం అవసరమౌతోంది. మన సరిహద్దు రాజ్యమైన దేవఘుడును మన సులో వుంచుకొని మాట్లాడుతున్నాను. నేడా రాజ్యాన్ని యిస్లాం మతం పాలిస్తోంది. అది మన శత్రుమతం. కాబట్టే ఆ రాజ్యం మన రాజ్యంమీద పగబూనింది. అక్కడి పాలకుడు మన శివమతాన్నే స్వీకరిస్తే...

రుయ్యాం : అసంభవం.

శివ : కాదు తల్లీ. మన దేవదాసీల కోమలకంఠంలో శివమహిమ వినిపించినప్పుడు దేవఘుడ్ పాలకవర్గంలో కొందరు, శివమతంమీద మోహపడుతున్నారని నా కిప్పుడిప్పుడే తెలియవస్తోంది. గంగవంటి సౌందర్యవంతులు శివగానం వినిపించ సిద్ధపడితే అక్కడి పాలకుడు సహితం వొకనాటికి శివభక్తుడై...

రుయ్యాం : అయినంతమాత్రాన వారు మిత్రభావంతో వుండలేరు. తుఘలక్ సేనలాక్రమించడానికి పూర్వం దేవఘుడు రాజులు, యాదవులు, శివమతస్థులు. అయితేనేమి, మన కాకతీయ సామ్రాజ్యాన్ని విరోధంతో చూసేవారు. మా తల్లి రుద్రమదేవి పరిపాలనా కాలంలో వారి వోరుగల్లు దుర్గంమీద దండెత్తిన మాట మీరు మరచిపోయినారా? పరిపాలకులే మతస్థులైతేనేమి వారిలో రాజ్యాకాంక్ష దుస్సహమైపోయింది. దురాక్రమణకు వారి బుద్ధి తావిచ్చింది, సహనానికి వారిలో చోటెక్కడ స్వామీ? యీ కాకతీయ సామ్రాజ్యాన్ని చిదిపివేయాలని చూస్తూనే యాదవులు స్వయంగా చితికిపోయినారు. యెవరిలో సహనం శూన్యమో, శాంతికి వారే దూరమై యుంటారు. పూర్వమున్న దేవగిరి దుర్గమే నేడు దేవఘుడ్ అని పిలువబడుతోంది. ఒకప్పుడు యాదవరాజులున్నారు, వారి స్థానంలో నేడు తుఘలక్ వంశీయులు పాలకు

లైనారు. అసహన మొక్కలే వారి హృదయాలు నింపి కప్పేస్తోంది. దేవదాసీ కంఠంలో శివగానం వినగానే శైవులమీదా శైవ సంప దలమీదా, శైవ రాజ్యంమీదా మోహపడతారే గాని, పరమశివుని దర్జేశ్చ పరమసత్యంమీదమాత్రం వారు మోహపడరు. శత్రుత్వం వారితోనే మనకు దాపురించివుంది. సంగీతంగాదు మనలో విరిపించ వలసింది, పొరుగువారిమీద సహనం!

ఆమె పెద్దగా నిట్టూర్చి, మళ్ళీ పలికింది.

"క్షమాధర్మం మీలో లోపించింది స్వామీ."

"నాలోనా తల్లీ."

"అవును, కాబట్టే మీశిష్యుడు నా కుమారైను గాయపరచ గలిగాడు; గాయపడినాడు. నాబిడ్డ మీలోకి రాదు."

"మరి యెవరిలో చేరేను ? "

"యెవరిలో క్షమవున్నదో వారిలో,..! ఎవరిది. ఇట్లా నా మీదపడి యేడ్చేది?—వినయుడేనా!"

వినయజిని, ఇతడొక జైన యువకుడు. పసితనంలోనే చాల మతకలహం తల్లిదండ్రులను మింగేసింది. నడివీధిలో దిక్కుమాలి మీద, అన్నయదేవుడు జాలిపడి తరువాత ఆశ్రమంలో రుయ్యాం ఆమ్మున ప్రాకించినాడు. శివమరిస్తురా లైనప్పటికీ తన కనురెప్పలక్రింద యీ పాపను జైనమతంలోనే పెంచింది. ఇతర మతాలను ప్రేమించడం అతడామె వొళ్ళో నేర్చిన మొదటి విద్య. దేశంలో సంభవించే మత కలహాల నెనిరించి అతడు సాధించిన శాంతిగాధలు చక్రవర్తినే ఆశ్చర్య పరిచినాయి.

కాకతీయ సామ్రాజ్యంమీద తుఘలకు సేనల రెండవ దండ యాత్ర అపజయంపొంది యెంతోకాలం గాలేదు. కొన్నాళ్ళనుండీ రాజ్య సరిహద్దులలో శత్రుసంచలనం కన్పిస్తున్నట్లు వార్తలు! అయితే సంఘర్షణలు సేనల మధ్యగాదు విరిపించేది సరిహద్దు ప్రజల మధ్య. శత్రువు లొకసారి జైనవేషంలో వచ్చి, శైవులమీద దౌర్జన్యాన్ని

పురికొల్పుతున్నారు. కొందరొకొందరి శైవవేషంలో జైనులమీద హింసను ప్రేరేపిస్తున్నారు. మతకలహం పెచ్చాదిన కొలది సరిహద్దు దుర్గాలు శత్రుభయంతో కలవర పడుతున్నాయి. చక్రవర్తి నీ వార్త నాందోళన పరిచింది. మత కల్లోలాన్ని పరిష్కార్చే మంత్రం, ఆశ్రమ విద్యార్థులే యెరుగుదురు. విద్యార్థులలో వినయజిని మేటి. చక్రవర్తి యాజ్ఞాపించగానే యీ జైనయువకుడు తన సహచరులతో సరిహద్దుకు ప్రయాణమైనాడు. మొదటి నెలలోనే భిన్నమతాలమధ్య సహన భావాన్ని సృష్టించగలిగినాడు. ఆపైన సహకారం పెంపొంది స్నేహం స్రవించ నారంభించింది. ఆ స్రవంతి కెదురీదే శక్తి యిప్పుడు శత్రువులకు లేదు.

వినయజిని మాతృమందిరం విడచిపోయి యిప్పటికి నాలుగు నెలలయింది. రోగశయ్యలోవున్న రుద్రాంబ యీ జినకుమారుని కోసం ఎదురుచూస్తూ, రప్పించమని అన్నయదేవుని తొందరబెట్టింది. తక్షణమే బయలుదేరిరమ్మని చక్రవర్తి ఆజ్ఞాపించాడు. వొచ్చాడు...

"వినయజిని అమ్మా, వొచ్చాడు. అక్కడ ఈశ్వర సేవలో నుంచి యిక్కడ మాతృసేవలోకి — స్నేహామృతంలోకి."

"అవును రుద్రమ్మా, మరి యీ దుఃఖమెందుకు?... వినయా యెంత దుఃఖించినా, నేను మిగిలేది లేదు. మిగిలినన్నాళ్ళూ నీ కేమి యిచ్చానో, విడిచిపోయే క్షణంలో అదే యిస్తాను ... చూడూ, యీ గాయం, గంగముఖాన!"

తన చెంతనే కూర్చున్న గంగముఖం చూసి, భయపడినాడు.

"వినయా, ఒక మత కలహంలో నీ తల్లిదండ్రులు గాయపడిన తర్వాతే, నీవు నా వొళ్ళో వెలిసింది. అన్నయదేవుని సంసారంలో, నా చుట్టూ, యెక్కడో గాయపడిన భిన్నమత సంతాన సేవలోనే నిన్ను పెంచగలిగింది. కాబట్టే ఆ మూల గాయపడిన సరిహద్దులోకి నిన్ను నడిపించాను. ఇప్పుడు తిరిగివచ్చావు. గాయ మొక్కటే నాకు మిగిలిన సొత్తు... చూడూ, యిది స్వమత ఖడ్గంచేసిన గాయం. స్వమతస్తు

లలో వున్న అసహనానికి యిది చిహ్నం. తీసుకో యీ గాయాన్ని, యీ గంగను... నీ హృదయానికి భరించి, యీ లోకంలో ప్రదర్శించి, క్షమను బిచ్చమెత్తండి, లేదా చచ్చిపొండి.

గంగ చేతులు తీసుకొని వినయజిని హస్తాల్లో వుంచింది. శివ యోగి సహించలేక పోయినాడు. అడ్డుజెప్పే సాహసంతో అతడు రుయ్యాంబను సమీపించాడు.

"అమ్మా ?"

రుయ్యాంబ మాట్లాడలేదు. ఆమె మరణించింది. రాజమందిరం గొల్లుమన్నది. అన్నయదేవు డామెచెంతనే కూలిపోయినాడు. గంగ మూర్ఛిల్లింది. వినయజిని దుఃఖంలో నేలమీద అల్లాడుతున్నాడు. చక్రవర్తిముఖంలో కన్నీరు జలజల రాలింది. ఈ దుఃఖం శివయోగిలో లేదు. అతడు యోగంలో నిలిచాడు... క్షణమైంది. శివయోగి కంఠం గాండ్రించింది.

"తీసుకో ఖడ్గం చక్రవర్తీ."

"యెందుకు స్వామీ."

"ఈ జినభూతాన్ని చంపివెయ్యాలె."

వినయజినిని వ్రేలితో చూపించాడు.

చక్ర : కారణం?

శివ : జైనులు మాంత్రికులు. మంత్రించి రాజమాతను వినయజిని చంపివేశాడు, మాతృద్రోహి.

చక్ర : మీ రేఆధారంతో మాట్లాడుతున్నారు?

శివ : యీతని స్పర్శ లేనట్లయితే రాజమాత మరణించేది గాదు.

ప్రతా : రాజవైద్యులు పరీక్షించి మరణకారణం ప్రకటిస్తారు. వోపిక పట్టండి.

రాజవైద్యుడు క్షణకాలం పరీక్షించాడు.

వైద్యు: "పరమ శివుని ఆజ్ఞానుసారం రాజమాత లింగైక్యమైనారు. ఆమె మృతికి మంత్రాలు కారణం గావు."

చక్ర: యిప్పుడైనా కన్నీరు కార్చండి స్వామీ, రుయ్యాంబ ఆత్మ శాంతికోసం!

అతనిలో విషముంది, ముఖం బుస్సన వూర్చింది.

౪

ఓరుగల్లు దుర్గ సమీపాన, అరణ్యంలో రాతిగుట్టల నడుమ రోజుకొక వేయిమంది భక్తుల కాశ్రమిచ్చేంతటి పెద్ద శైవమఠం వుంది. ప్రథమ ప్రతాపరుద్రులవారి పరిపాలనా సమయంలో యిది నిర్మింపబడింది. త్రిలింగ సామ్రాజ్యాన్ని ప్రతిష్ఠించే వుద్యమంలో, అప్పటికీ దేశాన్ని నిరసపెట్టే జైన బౌద్ధ రాజ్యాలను ఊడ్చివేశేప్పుడు, ఆయా రాజ్యాలమీద విరోధాన్ని శైవమతం చూపించినమాట నిజమే. అయితే, ఆ తాత్కాలిక ద్వేషాన్నే యెల్లప్పటికీ పాటించాలని యీ శైవమఠం నిర్మింపబడలేదు పున్నిర్మాణానికి పూనుకొన్నప్పుడు, పరమత సహిష్ణుత యీ మఠంలోనే వెలిసింది.

సామ్రాజ్యం స్థిరపడి తరాలు గడచికొలదీ, మతగురువులు స్వాప్నపరులైనారు. సహ్యత రూపుచెడి, మతపీఠం శివయోగిని వరించింది. విద్వేష మొక్కటే యీ మఠంలో సాధన చేయబడుతోంది.

ద్వేషానికి మూలం దురాశ. దుశ్చర్యలే దాని ఫలితం. అది జైనులను సహించలేనట్లే, శైవులలో అమాయకులను సహితం జేరనీయదు. ఎవరో మాయకులు మాత్రమే, ధనబలంతో యీ మఠంలో ప్రవేశిస్తారు. శివయోగి పాదాల నాశ్రయించి రాజ్యపదవులను భిక్షమడుగుతూ వుంటారు. ఆ కాలంలో ప్రభుత్వంమీద మతపీఠాలకు గల పలుకుబడి తక్కువైనదిగాదు.

మఠలో పులిచర్మంమీద ఆసీనుడైనాడు శివయోగి, ధ్యానంలో వున్నాడు. అతనిముందు పళ్ళెంలో, ధనం కుమ్మరించి వుంది. యెదురుగా కూర్చున్నాడు వొక ధనికుడు. శివయోగి కళ్ళు తెరిస్తే వొలుకుతుంది వొక వరం. కాసేపటికి కళ్ళు తెరచి అన్నాడు.

శివ : ఎంత యీడబ్బు?

ధనికుడు : రెండువేల వరహాలు దేవరా!

శివ : చాలదు.

ధని : అంతకుమించి లేదు దేవరా.

శివ : కాబట్టే లేకపోతోంది శివుని అనుగ్రహం నీకోరికమీద

ధని : పరమశివ సన్నిధిని చేరగోరినాను స్వామీ. పరమపదానికి మంత్రిపదవి వాకిటే చేరువగా వుంటుందని తమరు సెలవిచ్చినారు. నేను వ్యాపారిని కాబట్టే వాణిజ్యశాఖా మంత్రి పదవిని నేను కోరింది.

శివ : నిజమే ఆమాట. నీవలెనే ప్రతి శైవుడూ తన జన్మవృత్తిలోనే శివదర్శనం చేసుకోజూస్తున్నాడు. కాని ఆవృత్తుల్లోకి పరమశివుని చేరనీయటంలేదు.

ధని : యెవరు దేవరా?

శివ : జాతీయత. ప్రతాపరుద్రుని జాతీయత. వినలేదేమో. రాజకొలువులో సగం మంత్రిపదవులు, జైనుల కిచ్చేయత్నం జరుగుతోంది. నీబోటి సమస్థులకు చాలినన్ని పదవులు లేవు.

ధని : తమరు తీవ్రంగా శపించి నట్లైతే...

శివ : ఎవరిని?

ధని : జైనుల్ని.

శివ : వ్యర్థం. జైనమతాన్ని పరమశివుడు యేనాడో శపించాడు, కాబట్టే వారు పారతంత్ర్యంలో బ్రతుకుతున్నారు. వారి మీద నాశాపం వ్యర్థమౌతుంది. ఈ పరమతస్థుల స్వాతంత్ర్యం కోరే కొందరు శైవులున్నారు. వారిలో చక్రవర్తి మొదటివాడు. అతడు అన్నయదేవుని కళ్లతో చూస్తాడు. అతని కాళ్లతో నడుస్తాడు. అన్నయదేవుడు జాతీయువాది. పరమతస్థులమీద ఆధారపడి జీవించమంటాడు. విమతస్థుల చేతులందుకొని-వారు నడిస్తే నడిచి, లేదా వారు కూలినచోటే కుంగిపొమ్మంటాడు. ఈ యదైతన్యమే

శాసన రూపంలో శైవలోకానికి అందించాలని తపస్సుచేస్తున్నాడు. వారి మీాగే నా కోపం. ఆకోపమే నీలోవుంటే...

ధని : వున్నది స్వామీ.

శివ : వున్నదానిని నలుగురికీ పంచు. శైవలోకంలో నీబోటి వ్యాపారస్తులు చాలా మంది వున్నారు, మీాలో ఆకోపమేవుంటే, నా తపస్సు ఫలించి తీరుతుంది.

ధని : యెంత త్వరలో స్వామీ ?

శివ : మీారు క్రోధించినంత త్వరలో...నేడే శైవభూమి క్రోధించి తీరాలె. శివుడు తన క్రోధాన్ని నాలో గుప్పిచాడు ... నేను నీలో...లే...పో...!

ఉగ్రుడై అరిచాడు శివయోగి. వ్యాపారిభయంతో గడపదాటినాడు. జటా శంకరుడు ప్రవేశించాడు.

జటా : శాంతించు దేవరా !

శివ : శపించ కూర్చున్నాను మూర్ఖుడా ! శాంతిభిక్ష కోరకు. నిన్నటి సభలో భూమిమీాద జైనుల యాజమాన్యం అంగీకరించావో లేదో, రాత్రి శైవ కన్యాత్వంమీాద ఒకజైనుడు ప్రభువై కూర్చున్నాడు.

జటా : యెక్కడ స్వామీ ?

శివ : చక్రవర్తి సమీాపంలో, రాజమందిరంలో, రుయ్యాంబ వొళ్ళో, గంగ జీవితంమీాద వినయజిని...పరమశివా, పరమశివా.

అవమానంతో దుఃఖితుడై పోయినాడు. బంగారు శివలింగాన్ని కౌగలించి శివయోగి పలికినాడు.

శివ : శైవ జీవితంలో పూర్తిగా నిండిపోయింది పరమశివా నీ యాగ్రహం ! యిక శైవులకు భూములుండవు, వృత్తులుండవు, కన్యలుండవు.

జటా : అవమానం.

శివ : కాబట్టే క్రోధంతో దహించుకపోతోంది నా హృదయం. భరించలేను. శాంతి, జినమత వినాశనంలో శాంతి.

జటా: నాకు భాగమివ్వండి స్వామీ.
శివ: తొందరపడకు. అదుగో, ఆతలుపు తెరు.

యెదురుగా వొక గదివుంది. తలుపులు తెరవగానే అందెల చప్పుడు వినిపించింది. యిరవైయేండ్ల యువతి, ద్వారంలో నిలిచింది.

జటా: యీమె రామశరణు కూతురుగాదా దేవరా?

శివ: జైనమతంలో నాచుట్టరికం నేటితో మాసిపోయేందుకు, జంగాలీపిల్ల నెత్తుకవచ్చారు. అట్లా తెల్లబోయి చూస్తావేం. యిక్కడీ పిల్లలో శివదీక్ష నిండినట్లు తెలిస్తే, జైనమతంలో రామశరణు వుండలేడు. కన్న ఆపేక్ష యిక్కడికి కట్టితెస్తుంది...ఓసీ, జిన దయమ్మా, యిప్పటికీ ఆ చీకట్లోనే వుండదలచావా, ఆయజ్ఞానంలో

యువ: యెక్కువగావుంది దేవరా, నేను భరించలేను.

శివ: అయితే నన్ను శాంతిపరుచు, యీ వెలుగులో నిలిచి.

యువ: నీవు కోరేశాంతి, నాలోలేదు.

శివ: వుంది ఆ కాలియందెలో. ఈ శివలింగంముందు నృత్యమాడి ప్రణయం తొలకించు.

యువ: అరూగణుడు మా యిష్టదైవం. అతని మెప్పుపొందే నా నృత్యము అన్నయదేవుని ఆశ్రమశివు డొక్కడు మాత్రమే హర్షిస్తాడు.

శివ: యీమతంలో నా శివుడో? సరిగా చూసిచెప్పు. యీ బంగారు శివలింగంలో...

యువ: వొట్టి దౌర్జన్యం మాత్రమే అగుపిస్తోంది. నా కాలి యందెలో దౌర్జన్యభయం మాత్రమే...

శివ: చాలు. అభయమే కలిగిస్తుంది భక్తి, శివభక్తి నీ హృదయంలో.

యువతి: ఆనీచ భక్తికి అప్పగించలేను నాహృదయాన్ని.

శివ: అయితే జీవితమే వప్పగించు...పట్టుకో జటాశంకరా దీన్ని— యెత్తుకపో ఆచీకట్లోకి—చెరచి కూర్చోబెట్టు నాముందు, శీలంచెడి, మతంచెడి...ఎందుకట్లా నివ్వెరపడి చూస్తున్నావు జటాశంకరా,

శీలంచెడగానే మతం పోతుంది, వొట్టి మనిషైవుంటుంది. మళ్లీ శివ దీక్ష నిస్తేచాలు...మోహించు దాన్ని !

జటా : మోహించలేను దేవరా, యీామె మీాయన్నకూతురు, మీా కూతురు.

శివ : కూతురు, గురుద్రోహి, వొక జైనస్త్రీని నాయాత్మకంటించి, నామతాన్ని మైలపకుస్తున్నావు. మత భ్రష్టుడా, నిన్ను శపిస్తా. నీమీాద ఆంక్ష పెడతా, జైనమతంలో కుక్కుతా, బాసిసను చేస్తా... పద, మోహించు, పట్టుకో......!.

ఆంక్ష అనే అరుపువిని జటాశంకరుడు అదిరి పడ్డాడు. ఆమెను పట్టుకోబోయినాడు. ప్రాణంతో మాత్రం ఆమెపట్టుబడలేదు. తన గోళ్లలో విషం దాచుకొంది. వ్రేళ్లు నోట్లో వుంచుకోగానే, చచ్చి శవమై దొరికింది. భద్రంగా ఆమెను నేలమీాద పడుకోబెడుతూ, అన్నాడు.

జటా : చచ్చిపోయింది దేవరా యీామె.

పిశాచానందంతో శివయోగి సమీాపించాడు. ఆమె ముఖంలో ముఖముంచి అన్నాడు;

"శివలింగంముందు మరణించింది. లింగైక్యమైంది. నా వంశ వృక్షానికి జైనశాఖ యీామెతోనే విరిగిపోయింది. ఇప్పటినుంచీ నేను జైనులకు తండ్రినీగాను, తమ్ముణ్ణీగాను, పవిత్రుణ్ణి, యెంతోపవిత్రుణ్ణి!"

వికటాట్టహాసంతో విలయతాండవ మాడుతున్నాడు శియోగి. జటా శంకరుడు భయపడి అతనిని కౌగలించాడు.

జటా : భయమేస్తోంది దేవరా.

శివ : భయమెందుకు ?

జటాశంకరుని తోసివేసి శవాన్ని శివలింగందగ్గిర కీడ్చాడు. ఆ శవంమీాద కాలుమోపి, పానుపట్టంమీాద కెగిరి కూర్చున్నాడు. శివలింగాన్ని గట్టిగా కౌగలించాడు.

"ఓహో, పరమశివా, నీ ప్రకాశం నాలో నిండింది. కన్పిస్తుందా జటాశంకరా నీకు ?"

అతని కేమీ కన్పించిన ట్లనిపించ లేదు.

"పోనీ చూడు అటు. నా యాత్మానందానికి బాహ్యరూపం... యెక్కడి దీవెనగు ?"

ఇరవైయేండ్ల పడుచు, ముస్లిం వేషంలో వుంది. తలమీద పెద్ద బంగారుపళ్ళెంలో నవరత్నాలు మెరుస్తున్నాయి. ఒక జంగం ఆమెకు మార్గం చూపిస్తున్నాడు. అత డ తదూరంనుంచే శివయోగికి పరిచయంజేస్తూ పలికినాడు.

జంగం : ఇస్లాం మతపీఠం దేవఘుడునుంచి తన రాయబారిని పంపించింది. శత్రుభయంతో అతడు జంగమవేషం ధరించాడు. వెలుపల ద్వారంలో తమ దర్శనంకోసం వేచియున్నాడు. అతడు పంపిన కానుకలే యివి. స్వీకరించండి.

శివ : తరించాను జటాశంకరా. ఈనాటికి పరమ శివుడు శత్రు హృదయంలోనే తొంగిచూశాడు. ఆ కానుకలో శత్రుత్వం కనుపించటంలేదు; పరమశివ కాంతి కనిపిస్తోంది...రా, యువతీ యిటురా, అందించు శివ భాగ్యం. ప్రతిగా తీసుకో యీ హారం, ముత్యాల హారం !

స్త్రీ శవం కంఠంమీద కాలుంచి, చేతులతో మెళ్లో నగలు గుంజి, తెంచి ఆమెకు చూపిస్తున్నాడు. ఆ స్త్రీ భయపడి పోయింది. కెవ్వున అరిచి స్పృహతప్పిపడిపోతూవుంటే, తలమీద పళ్లెంమాత్రం అందుకున్నాడు. మూర్ఛిల్లిన స్త్రీ పక్కనే కూర్చుండి జటాశంకరు ఆమెను జాలితో చూస్తున్నాడు. పానుపట్టంమీద కూర్చొని వాళ్లో పళ్లెంలో రాళ్లు మెచ్చుకొంటున్నాడు, క్రింద వ్రేళ్లాడే కాళ్లు శవముఖంమీద ఆడిస్తూ !

శివ : మూర్ఛిల్లిన ఆ యువతి ప్రక్కనే జాలితో నీవుగూడా తెలివి దప్పుతున్నావేమో జటాశంకరా !

జటా : అవును దేవరా !

శివ : అపరాధంసుమా !

జటా : అవును దేవరా.

శివ : తరువాత కళ్లు తెరచినా, యీ యువతి ప్రక్కన పరమపదం కనిపించదు.

జటా : అవును దేవరా.

శివ : నీవు గంగ ప్రక్కన మూర్ఛిల్లు పోయి. అక్కడ కనిపిస్తుంది దివ్య పదవి, సర్వసేనాధిపత్యం...గ్రహించలేదా నా మాట.

జటా : లేదు దేవరా.

శివ : అన్నయదేవునికి నీవు అల్లుడవైతే...!

జటా : అసంభవం దేవరా !

శివ : గంగను ప్రేమించు, సంభవమౌతుంది.

జటా : ఆమె నన్ను ప్రేమించదుగా దేవరా.

శివ : నిన్ను ప్రేమించమంటున్నాను.

జటా : చిత్తం దేవరా.

శివ : అది ఆదేశిస్తోంది పీఠం !

జటా : చిత్తం దేవరా !

౨౩

తెల్లవారబోతోంది. గూళ్ళల్లో పక్షుల కలరవాలు మానవులను జీవన కర్మలలోకి మేల్కొల్పుతున్నాయి. కాని ఓరుగల్లు రాజవీధిలో ఒక దుష్కర్మ విద్వేషాన్నీ, వినాశనాన్నీ నినదిస్తోంది. కోటద్వారానికెదురుగా ఒక రావిచెట్టుకు రామశరణు కుమార్తె మృతశరీరం కట్టబడివుంది. జైనలోకం దుఃఖంతో నల్లబడింది. ఆవేశంతో జైనులా శవందగ్గిర గుంపులు గడుతున్నారు. అక్కడక్కడ జంగాలు పోగై, శంఖాలూంది యీ దుఃఖాన్ని అవహేళన జేస్తున్నారు.

రామశరణు కుమార్తెకు వివాహమై మూడు నెలలైనా గాలేదు. ఆమెను దుండగులు చంపివేశారు, నగలన్నీ అపహరించారు. మెళ్లో మంగళసూత్రమైనా వుంచలేదు. ఇది దురాశను మించిన దుండగం. సహించలేకపోయినారు జైనులు. శైవులమీదికి దండెత్తినారు.

"జైనులు పరతంత్రులు. ఈ శైవరాజ్యాన్ని వారు సహించలేరు. కాబట్టే యీ స్త్రీ శవాన్ని మన కోట కెదురుగా కట్టివేశారు. చక్రవర్తి నవమానించారు"—ఓర్పు దప్పినారు శైవులు. జైనులమీదికి సాగారు.

పోరు ప్రారంభమైంది. శూలాలతో యెక్కడ పొడవబడిన జైనుడు అక్కడే కూలుతున్నాడు. యెక్కడ దెబ్బతిన్న శైవుడు అక్కడే కూలిపోడు. జైనులతని నీడ్చుకపోయి ఆ శవం పాదాలమీద బలియిస్తున్నారు. శవాలు కుప్పలుబడుతున్నాయి. తీరనివ్వటం లేదు కక్ష. ఒకవంక జైన సన్యాసులు, మరోవైపున జంగాలు, తమ తమ జనుల నుద్రేకపరుస్తున్నారు.

"జైనుల ప్రాణాలు నష్టపరచటమే శైవుల కోరిక. మన ప్రాణాలెన్ని నష్టపరుస్తారో శైవులకు ఒకటికి నూరు నష్టాలు కలిగిస్తేనే,

యీ భూమిమీద మనం నిలవగలిగేది. నీలో అరూగణుడున్నాడు, నీ యాయుధాన్ని దించకు."

క్రోధించిన జైనమూకలను చూపించి జంగాలు శైవులను భయపెడుతున్నారు — "జైనమూక తరలి వస్తుంది. శైవ స్త్రీలు నెత్తుకపోతారు. శైవులబిడ్డ దోస్తారు"—శైవవ్యాపారులు నడివీధిలో వొక ప్రక్కన ఆయుధాలు, మరొక ప్రక్కన డబ్బు కుప్పబెట్టినారు — "అందుకో యీ డబ్బు. తీసుకో యీ యాయుధం. తలకు నూరు రూపాయలు. రక్షించు నీ శైవాత్మను, సంపదను."

శైవుల కడుపులోవుండి శివుడు శంఖాలు మోగించాడు. జైనుల గుండెల్లో కూర్చొని అరూగణుడు కొమ్ము వూదినాడు. జైనులు దూసిన కత్తులమీదికి శైవులు దూకుతున్నారు. శైవులెత్తిన శూలాలమీదికి జైనులు లంఘిస్తున్నారు. జైనులఖడ్గం గుండెల్లోకి దూసుకొని శైవుడు, శైవుల శూలం డొక్కలో గుచ్చుకొని జైనుడు కూలిపోతున్నారు. శివభక్తుడైన అన్నయదేవుడు ప్రత్యక్షమైనాడు. ఇరుమతస్థులూ వొకరినొకరు పొడుచుకొంటున్నట్లు ఆయనకు కనిపించటం లేదు. ఒక మతస్థుడింకో మతస్థుని ఆయుధంతో తనకు తానే పొడుచుకొంటున్నట్లు కనిపిస్తున్నాడు. భిన్నమతస్థుల నడుమ యీ పోరులో ఆత్మరక్షణ గోచరించటంలేదు. ఆత్మహత్యమాత్రమే స్పష్టపడుతోంది.

హరహరాయని గర్జిస్తూ శైవుడు తన కంఠాన్ని జైన ఖడ్గానికందిస్తున్నాడు; అరూగణాయని నినదిస్తూ జైనుడు శైవశూలాల యెదుట ఱొమ్ము విరుస్తున్నాడు. చావబోయేముందుమాత్రమే హరుడూ, అరూగణుడూ కంఠానబుట్టి గాలిలో కలిసిపోతున్నారు. చచ్చేముందు శైవుడైనా, జైనుడైనా నేలబడి, గిలగిలలాడుతున్నారు. అమ్మా అమ్మాయని బాధతో దొర్లాడుతున్నారు, మాతృస్మరణ జేస్తున్నారు. ఇప్పు డిది శైవభూమి గాదు, లేదా మరియొక మతభూమి గాదు, మాతృభూమి. మాతృ జపం చేస్తూ, వింటూ శైవుల చెంతనే జైనులు ప్రాణం విడుస్తున్నారు.

ఈ యాత్మహత్యలు చూసి వాణికిపోతూ, అన్నయదేవుడు, గుఱ్ఱంమీదనుంచి, ఈ యన్నదమ్ముల నెత్తురు మడుగులోకి దిగినాడు. చేతులు జోడించి నిలిచినాడు. మఱి నినాదాలు సన్నగిలినాయి. పోరు నిలిచిపోయింది. అతుల బలాఢ్యుడైన అన్నయదేవుడు నేడేమోబలహీనుడైనాడు. ఈ నెత్తురు బురదలో కాలుజారి పడతాడేమోనని పద్మావతీ. మరి యాతనితో వచ్చిన ఆశ్రమవాసులూ భయపడిపోయినారు. వాణికే కాళ్లతో హాహారవాల మధ్య నడుస్తూ, చెట్టుక్రిందకు జేరాడు. అమ్మనే వింటూ 'అమ్మా' యని శోకించి స్త్రీ శవంముందు వారిగిపోయినాడు. కట్టుత్రాళ్లు విప్పి ఆశ్రమవాసులు ఆ మృత శరీరాన్ని అన్నయదేవుని ముందు వుంచారు.

పద్మా ; లేచి కూర్చో బాబూ దుఃఖించకు.

అన్న : కూర్చోలేను పద్మావతీ, నా శరీరం యీమె ప్రేమోల గిలగిలలాడ నియ్యి. చూస్తాను, యెంతసేపు నా బాధను వుపేక్షిస్తుందో. ఈమె నా శిష్యురాలు. నా ఆశ్రమ ధర్మంలో పెరిగింది. ఆశ్రమంలో తన చుట్టూ మూగే దీనులబాధలను వోదార్చే జాలి యిప్పుడు తన హస్తాల్లో చూపించదేమీ. ఎట్లా సహిస్తుం దీ రక్తపాతాన్ని ? ఈ హింసను సహించే క్రౌర్యానికి తనలో యెట్లా స్థానమిచ్చింది ?

పద్మా : వ్యర్థంగా ఆమెను నిందించవద్దు బాబూ! ఈమె హింసకే వొడిగడితే, యీపె రూపం వికృతమై, వొట్టి రాక్షసుల మధ్యే కనిపించేది. ఈమెలో ఆ రాక్షసత్వం లేనేలేదు. బ్రతికి యే దీనుల మధ్య కనిపించేదో, యిప్పుడు చచ్చి ఆ దీనులమధ్యే కనిపిస్తోంది. ఆశ్రమధర్మంలో వుండి, పదిమందిచేత 'అమ్మా' యని పించుకొన్నట్లే నేడు మరణించి మరి నూరుమందిచేత అమ్మాయని పిలిపించుకొంటోంది. మాతృత్వ మొక్కటే ఈమె పొందదలచిన లక్ష్యసిద్ధి. చివరి కదే సిద్ధించింది.

అన్న : చచ్చి ఆమె నూరుమందిలోమాత్రమే యెందుకు వెలిగింది, బ్రతికి మరి వేయిమందిలో దీపించక.

పద్మా : ఆమెలో మాతృత్వాన్ని ప్రదర్శించిన శక్తి శీలానిది. ఈ భూమిమీద వొక్కరి స్వామ్యాన్ని చూడగోరే మూర్ఖులు, స్వార్థపరులు, యీామె జీవితంమీద స్వాములై కూర్చోబోయినారు. ఈమె వొప్పుకోలేదు. ఈమెలో శీలాన్ని చంపి, యీామెను శివమతానికి మిగిలించుకోన యత్నించారు. ఆమె ఆగ్రహించింది. వారి చెరలో తానే చచ్చిపోయి, యీా భూమిమీద తన శీలాన్ని మిగిలించింది. తనలో శీలం చెడింతరువాత, జీవించగోరినా వొక కులటయైనమాత్రమేగాదా, యీామె శివమతానికి దక్కేది.

అన్న : నిజమే పద్మావతీ, ఆమె కులటయై చేరి, నా శివమతాన్ని కళంకపరిచే కోరిక ఆమెలో లేనేలేదు. నా శివమతాన్నెంత యెక్కువగా ప్రేమించిందో చూడు? అరూగణమతానికి ఆమె మిగలకపోయినా, మరణించి, నా శివమత మర్యాదను నిల్పింది. శీలానికి గొప్ప విజయమిచ్చింది.

అన్నయ దేవుడు విజయ గర్వంతో తలయెత్తి చూసినాడు. క్షణక్షణానికీ, తన యెదుట జనసమూహం పెద్దదౌతోంది. జనుల నుద్దేశించి పలికినాడు:

"శివుడూ, అరూగణుడూ యేకకాలంలో అవతరించలేదు. ఇరువురిమధ్య కాలభేదం చాలావుంది. ఈ భూమిమీద శీలాన్ని నిలిపేందుకే, ఒకసారి అరూగణుడూ ప్రత్యక్షమైనాడు. మరియొకసారి శివుడు తన మతాన్ని ప్రసాదించాడు. మానవంతులీ శీలాన్నే రక్షిస్తారు. శీలం తనలో చెడినవాడే యితరులలో చెరచబోయేది. అది కులటల లక్షణం. మిక్కిలిగా దాస్యంలోనే కులటలు కనిపించేవి. మీరు దాస్యాన్నే కోరుతున్నారా? దేవఘడునుంచి శత్రుసైన్యాలు విష్ణుపురంమీద దండెత్తి ప్రయాణమైనట్లు యీా రాత్రే చక్రవర్తికి వార్తచేరింది. విష్ణుపురం మన సరిహద్దులోవున్న వైష్ణవ రాజ్యం. ఆ రాజ్య మాక్రమించి, త్వరలో యీాభూమికి దాస్యమివ్వాలని ఆశిస్తున్నాడు. మీరు కులటలై జీవించగోరుతారో, ఆ దాస్యమే ప్రాప్తి

స్తుంది. నేను శివభక్తుడను. ఈ లోకంలో నాకు ప్రియమైనది స్వతంత్ర మొక్కటే. కాబట్టే నా భుజాలమీద యీ శీలాన్ని వాడవాడలా వూరేగించబోతున్నాను. మీకు యిష్టంగాదో నన్ను చంపివెయ్యండి. ఆ తరువాతే మీకు విదేశీయుల దాస్యం లభించేది."

విజయనాదాలు వినిపించాయి. నగరంలోవున్న స్త్రీలూ, పురుషులూ సౌశీల్యానికి విజయోత్సవం జేసేందుకు సిద్ధమైనారు. స్త్రీశవం పసుపు కుంకాలతో మునిగిపోయింది. రామశరణు ప్రవేశించాడు. మరణించిన తన కుమార్తెనుచూసి విలపించబోయినాడు. కాని చుట్టూ అశేష జనులలో ధ్వనించే విజయకోలాహలం అతనిని గర్వపెట్టింది. పుష్పవృష్టి ఆరంభమైంది. జైన శైవుల భుజాలమీద ఆ స్త్రీశవం స్మశానం చేరింది.

౬

ఓరుగల్లు దుర్గానికి దక్షిణంగా కొండలచాటున అరణ్యం వుంది. దాని మధ్యలో సరస్సును బోలి వొక తటాకం వుంది. దాని తీరంమీద అన్నయదేవులవారి ఆశ్రమం నిర్మింపబడివుంది. తటాకపు పశ్చిమతీరంలో వలయంగా పంక్తిదీరిన అడవికొండల వెనుక సూర్యుడస్తమించబోతున్నాడు. తనకు వినిపించే వందనగీతంగా, ఆశ్రమంలోని వివిధ పరిశ్రమలూ జీవన కళారవాన్ని తుదిసారి ధ్వనించే ఆగిపోయినాయి. అడవి బీళ్లనుండి మరలివచ్చే ఆలమందల ప్రవేశానికి, ప్రాకార ద్వారాన్ని తెరిచేందుకు గంగ పరుగునవచ్చింది. అస్తమయ శోభనాన్నందించే ఆమె దృష్టిని వొక రౌతు అల్లరిపరచినాడు. అతడొక అధికారి, సైనిక దుస్తులలో వున్నాడు. త్రోవపొడుగునా దుమ్ములు రేపుతూ, గుర్రం మీద వేగంగా వస్తున్నాడు. ప్రొద్దంతా యజమానుల యిటుక బట్టీల కోసం అడవిలో గడ్డికోసి యిండ్లకుపోయే జనులు భయంతో త్రోవ చెదరి పారిపోతున్నారు. గూళ్లకు చేరే పిట్టలు ఆ యల్లరికి బెదరి, చెట్ల మీద వ్రాలకముందే ఆకాశానికి యెగిరిపోయినాయి. ఆశ్వికుడు తన వేగంలో యెవ్వరి భయాన్నీ చూడడం లేదు. ఈఆశ్రమ సమీపంలో యీయశాంతి, గంగను కుపితను జేసింది. ఈరీతిగా లోకాన్ని భయపెట్టే ఆ యధికారివైపు, ఆమె యెంతో తీవ్రంగా చూస్తూ నిలిచిపోయింది. రెప్పపాటులో గుర్రం ఆమె యెదుట నిలిచింది. గుర్రంమీదనుంచి అధికారి దిగీదిగకుండానే అన్నాడు:

"విష్ణుపురంమీద దండెత్తే శత్రువులను జయించివచ్చేందుకు ప్రతాపరుద్రులవారు నన్ను సేనాపతిగా నియోగించారు.

గంగ: కాబట్టే నీ ప్రతాపం యింత అసహ్యంగా కనిపించింది.

అతడు : యెందు కీ కోపం గంగా నీకు? యీ సైనిక వేషంలో గుర్తించ లేదే మోనన్ను. నేను వినయజినిని.

గంగ : నీ పేరు వినయజిని కావచ్చు. ఇక్కడీ యీ యాశ్రమంలో నీకేం పని?

వినయ : నే నీ యాశ్రమంలోనే పెరిగినాను. ఆశ్రమ విద్యార్థిని.

గంగ : అబద్ధం. ఆశ్రమ విద్యార్థి వినయజిని యొక్క గంభీరాకృతి అధో గతి జాతిలో ధైర్యాన్ని నింపిస్తుంది. మరి నీవో—భూతం వంటి నీ యధికార వేషం చూసి, క్రోధపాడుగునా యెందరు దీనులు నీదరి జేరేందుకు భయపడి పారిపోయినారో—అంచు చూడు. నిన్ను సేవాధర్మమే విడిచి దూరమైపోయింది.

వినయ : యీ యధికార దుస్తులలోనుంచి యీ లోకాన్ని చుక్కన జేసి చూస్తున్నానని నీకెందుకూ భయం. నాయనగారు సర్వసేనాధి పతులు. ఇంతకన్న విలువైన దుస్తులే ధరిస్తారు.

గంగ : వారు, రాజసభల్లోనూ, రణరంగాల్లోనూమాత్రమే సేనాపతి అన్నయదేవ్రలు. ఈ ఆశ్రమంలోమాత్రం 'మహర్షి' అన్నయ దేవులు.

వినయ : మహర్షి అన్నయదేవులు నిర్బంధించినందువల్లే-సేవాభావంతో యీ సైనిక పదని నేను స్వీకరించాను. ఇప్పుడీ దుస్తులే వారి నెటూ అవమానిస్తాయి!

గంగ : నీవు జైనుడవు. దేవాలయంలో అరూగణుని యీ యధికార దుస్తులు ధరించే ఆరాధిస్తావా ?

విన : కాదు మడిధోవతులు.

గంగ : యీ యాశ్రమంలో నీరికావి దోవతులు ధరించి మాత్రమే ప్రవేశించాలె. నాయనగారిని దర్శించాలె. సామ్రాజ్యం వ్యాపించి యున్నమేరలో వొక్క యీ యాశ్రమ పరిసరప్రాంతం మాత్రమే యీశ్వరుని కర్మభూమియై వర్ధిల్లుతోంది. జీవన పరిశ్రమల రూపంలో యీశ్వరుడు డీ క్షేత్రంలోనే తాండవిస్తూ వుంటాడు. ఆ

తాండవంలో లభించే ఆనందాన్ని, శాంతినీ—వొక్క గుణ్ణంమీద నీ యధికార దుస్తుల నాడించి భంగపరిచావు. దీనుల్ని భయ పెట్టావు. పాపివి నీవు—పో—పో!

గంగ నెట్టేస్తోంటే, అతనికి కష్టమనిపించ లేదు. వినయుడు సత్య ప్రియుడు. ఆశ్రమ ధర్మంలో ఆమె విశ్వాసంమీద అతడు సమ్మోహితుడైనాడు. తలమీది శిరస్త్రాణాన్ని తొలగించాడు. ఆమె నేత్రాలు సుఖపడేట్లు అంగీని విడిచివేస్తూ పలికినాడు.

విన : చిన్ననాటనుంచీ మన మాడిన యాటలు చాలా వున్నాయి. ఇప్పుడాడిన ధర్మక్రీడలో పరమాత్ముడు సహితం పాల్గొన్నట్లు నా మనసు సంభ్రమిస్తోంది. చాలా సాహసంతో ఆరంభించావీ క్రీడను.

గంగ : అవును వినయా. చక్రవర్తి కోపిస్తారేమో చాలా దుస్సాహసించానని.

విన : దుస్సాహసమా.

గంగ : అనిపిస్తుందేమో చక్రవర్తికి. ఇవి స్వయంగా వారిచ్చిన దుస్తులు. ఇక్కడ వాటని తిరస్కరించాను.

విన : చక్రవర్తి ధర్మజ్ఞులు. నీప్రేమ సామ్రాజ్యం యేవిధంగా శాసిస్తూ వుంటుందో వారెరుగుదురు.

గంగ : మంచి ధైర్యమే కలిగించావు. పద వినయా. యింట్లో, ఉతికిన ధోవతులున్నాయి.

విన : అవి ధరించి మరి ఈ యాశ్రమంనుంచి పోవద్దని కోరుతున్నావా? నేను సైన్యంలో పనిచేయటం నీకిష్టం లేదా?

గంగ : యెందుకీ యనుమానం నీకు. నిన్నటివరకూ శైవుల ఆధిపత్యంలో మాత్రమే జైనసైనికులు నడిచేవారు. నీవుగూడా శైవిస సైన్యమాత్రమే నేడు పోరాడబోతున్నట్లయితే నిన్నీ యాశ్రమంలోనే నాయనగారు నిలిపివుంచేవారు. మన సైనిక శాఖలోని దాస్య

నిర్మూలనం రేపటి యుద్ధంతో ఆరంభమౌతోంది, సర్వస్వతంత్రులై జైనవీరులు పోరాడబోతున్నారని నాయనగారు చెప్పినప్పుడు మా సంతోషానికి మేరలేదు.

విన : అయితే యిప్పుడు ధోవతులతో పనిలేదు. యీ కాస్త పేలికా చుట్టుకొని నాయనగారిని దర్శిస్తా!

ఆమె వీపుమీద వ్రేలాడే చీర చెరగు సగం చించుకొని, చుట్టుకోబోతున్నాడు. ఆ చర్య ఆమె నాశ్చర్యపరచలేదు.

విన : నా తొందరేమో గ్రహించే నవ్వుతున్నావా గంగా. నాయన గారి దర్శనం...

గంగ : అవును. యీ తొందరలో నీ యున్మాదాన్ని నాయనగారికి చూపించాలని నేను వేగిరపడుతున్నాను. కాని వారాశ్రమంలో లేరు.

విన : ఎక్కడికి వెళ్ళారు.

గంగ : శివపురం.

విన : త్వరగా శివపురమే వెళ్ళాలె నేను. దేవఘుడు రాయబారి నగరంలో ప్రవేశించినాడు. నాయునగారితో సంభాషించాలని చక్రవర్తి తొందరపడుతున్నారు.

గంగ : సంధ్యావందన సమయానికే యిక్కడికి వస్తామన్నారు. వేళైంది. అంతవరకూ యిక్కడేవుండు. నీ విప్పుడు స్వతంత్ర సేనాపతివి గాదా, నిన్ను చూడాలని ఆశ్రమవాసులు కలవరిస్తున్నారు: నా చీర చించుకొన్న యోద్ధత నీ మూర్తికి మరింత శోభ నిస్తోంది.

ఇంతలో వెలుపల శంఖాలు వినిపించినాయి. ప్రాకారద్వారంలో శివయోగి పాలకీలోనుంచి దిగుతున్నాడు. తన శిష్య గణంతో సమీపించగానే గంగా వినయులు భక్తితో అతని పాదాలమీద వంగినారు. అతని పెదవి కదలలేదు. మారుగా నమస్కరిస్తూన్న గంగ మెడక్రింద అతని చేతులు బంగారు ఆభరణాన్ని మెరిపిస్తోంది. భయపడిపోయింది గంగ, ఆమె వినయుని చాటున నిలిచింది. శివయోగి ప్రవర్తనలో

లోకానికి కనిపించే లేకితనం అతని యాశ్ర్యంలో మాత్రం కనిపించదు. శాంతంగా గంభీరంగా వరాలిచ్చి రక్షించే ప్రత్యక్షదైవం వలె కనుపిస్తున్నాడు. ఆభరణాన్ని గంగకు చూపిస్తూ ఆదరంగా పలికినాడు.

శివ : యిదే మా యాశీస్సు గంగా, అందుకో.

గంగ, మరింత ఆశ్చర్యపడింది.

శివ : గ్రహించలేదా, మా ఆశీస్సులు మాటల్లోగాక, ఇట్లా సువర్ణ రూపంలో ప్రసాదించమని పరమశివాజ్ఞ...తీసుకో...

గంగ : యింత దయ తమ కెందుకు నామీద దేవరా.

శివ : అంతకోపం నీకెందుకు శివమతంమీద కంఠంవరకూ, చాలీచాలని పవిటకొంగు మెళ్లో ముడిబెట్టుకొని...

గంగ : అది స్వమతంమీద క్రోధంగాదు దేవరా.

శివ : పరమతంమీద ప్రేమచిహ్నం కావచ్చు. జైనులు దరిద్రులు. ఆ స్త్రీల మెళ్ళో మాత్రమే చింకిపేలికలు వ్రేలాడుతూవుంటాయి. నీవు శైవ బాలికవు. శివభక్తితో నీతనువు సుకుమారమైవుంటుంది. అందుకే సువర్ణాభరణంతో అది శోభించి తీరాలె...అందుకో.

తీరని అనుమానమేదో, ఆయాభరణంలో మెరుస్తోంది. అది కాసులపేరు. కాసుల మధ్యలో వొక మాంగళ్యం మెరుస్తోంది. యేవో కొన్ని సంఘటనలు. ఆమె జ్ఞప్తి చేసుకొంది. మారాడకుండా ఆమె దోసిలిబట్టింది.

శివ : ఇదె పరమ శివానురాగం, మోహం, ప్రసాదమైంది నీ దోసిట్లో దివ్యభిక్ష కన్నుల కద్దుకో.

గంగ కనులు మూసింది. ఆమె యేదో ప్రార్థించబోయింది. ఆమె యెదుట వొక శైవ భిక్షుకురాలు నిలిచి, చెరగు జాచింది.... "భిక్షపెట్టుతల్లీ. దీనురాలిని."

శివ : ఎవరివి నీవు ? దూరంగా వుండు.

భిక్ష : శివమతస్తురాలిని దేవరా. భిక్షకోసం జేరాను...పరమ శివానురాగం ప్రసాదించుతల్లీ, యీ దీనురాలికి.

శివ : వొద్దు గంగా, నీ భాగ్యాన్ని వొక దైన్యానికి అప్పగించకు.
భిక్షు : ఎందుకని దేవరా?
శివ : నీవు దైన్యంలోనే వుండాలె, యిది పరమశివుని శాపం. కాదని నీచేతికి పరమభాగ్యమే అందించినా, అది పెద్ద దైన్యంగానే మారుతుంది.
భిక్షు : మారటమే నా కోరిక. ఇప్పుడున్న దీనస్థితి, అది నావరకే కనిపిస్తోంది. అది పెద్దదైతే, మీలోకేగాదా వ్యాపించేది. కాబట్టే యివ్వమంటున్నాను భిక్షు 'పరమ శివ అనురాగం!'

గంగ ఆ కాసుల దండను ఆ పేదరాలిమీద పడవేసింది. తన చెరగులో ఆ దండ చూసుకొంటూ ఆమె మెచ్చింది—"ఆహా, పరమ శివక్రోధం యెంత బాగుంది, యీ దండలో"-

ఆమె కళ్ళ నద్దుకొంటూ పరుగిడిపోయింది. శివయోగి క్రుద్ధుడై చూస్తూ పలికినాడు.

శివ : ఆ యాభరణం నీ మెళ్ళో లేకుండా నీకు శాంతి యెక్కడిది? పరమ శివాను రాగాన్నే భిక్షమిచ్చేశావు.
గంగ : అవును దేవరా. సాటి శివమతస్థురాలు.
శివ : కాబట్టే మా శాపాని కెదురుచూడు.

వొక్కసారి గంగావినయులను కోపంతో చూసినాడు. అతడు పాలకీలో చేరగానే జంగమ శిష్యులు శంఖాలు పూరించారు. పాలకీలో శివయోగి ప్రయాణమైనాడు.

గంగ : చూడువినయా, శివయోగిని, వొక మృత్యువులాగే పోతున్నాడు.
వినయ : శివయోగి కోపం నే నెరుగనిది కాదు. కాని ఆ పేదరాలే నన్నాశ్చర్యపరుస్తోంది. ఆమె పోకడలో వొక పెద్ద ఆవేశం నన్ను నివ్వెరపరుస్తూంది.

ఇంతలో విపత్తును సూచిస్తూ వెలుపలనుంచి శంఖు వినిపించింది. వినయుడని పరుగిడి పోయినాడు. గంగ అతని ననుసరించింది. కోనేటి

ద్యోఢ్డున నిలిచి పేదరాలు తన శంఖాన్ని శక్తికొలదీ పూరిస్తోంది. నానాదిక్కులనుండీ గృహోన్ముఖులై పోయే కార్మికులు, మరి యితరులు తమ శ్రోవలు విడిచి యీ ఆమె దగ్గిరికి పరుగిడి వస్తున్నారు. ఆపె ముఖంలో శంఖులాగి వినయంతిని ప్రశ్నించాడు.

విన ; ప్రమాదం ?

గౌరి : శివయోగే వొక ప్రమాదం. ఈ రాజ్యానికీ, లోకానికీ అతని మతపీఠమే వొక కాలసర్పం! రామశరణు కుమార్తెను మింగే శాడు. చూడు యీ నగ. ఇందులో మంగళసూత్రం వుంది. ఇది రామశరణు కూతురు మెళ్ళోది. నాశళ్ళ యెదుట తెంచు కొన్నాడు తన మఠంలో.

గౌరిని వోదారుస్తూ పద్మావతి తన యింటికి తీసుకపోయింది. రహస్యంగా యిస్లాంమత గురువు తన ప్రతినిధిని పంపిస్తున్న వార్త ఆశ్రమంలో వినిపించగానే పద్మావతి దాసీరూపం ధరించింది. అతడు వోరుగల్లు జేరకముందే అతనిని వొక చిన్న గ్రామంలో కలుసుకొంది. ఆ ప్రతినిధి యీ మత లో కొన్ని కుట్రలు జరిపేందుకు వస్తున్నాడు. ఇవి శత్రురాజ్యం జరిపించే కుట్రలు. వాటిని గ్రహించే అవసరం యీ శైవరాజ్యానికి చాలావుంది. అతడు జంగమరూపంలో వున్నాడు సరి హద్దు ప్రాంతీయులైన దేవదాసీ లియుపురు అతనికి తోడ్పడుతున్నారు. పద్మావతి అతనితో యీ విధంగా జెప్పింది. "నేను దేవదాసీని. శివ యోగులవారు నన్ను పంపించినారు మా దేవరలంపిన దాసీలను యిస్లాంమతం మెచ్చినవార్త విని సంతోషించారు. మారుగా మీరు మీ మత దాసీలను పంపించటం మీ యాచారం. మీరు సమర్పించే కానుకలు మీ దాసీలచేత్తో అందినప్పుడే దేవరలు సంతోషిస్తారు. లేదా వారిదర్శనంకూడా మీకు లభించదు."

ఈ యాచారం పాటించటం మంచిదని ఆ ప్రతినిధికి తోచింది. ఇప్పుడెంతో దూరం సాగివచ్చాడు. ఇప్పుడు దేవఘుడునుంచి ముస్లిం వనితలను రప్పించటం ఆలస్యమౌతుంది. ఇక్కడే వొక దాసీచేత

యిస్లాం మతవేషం వేయిస్తే తీరిపోతుంది. గౌరి అందమయిన పడుచు. తగిన విధంగా రూపం మార్చుకొని, ఆ ప్రతినిధిని అనుసరిస్తే, మఠంలో కుట్రలు గ్రహించగలుగుతుంది. శివయోగిమీద పగను గొంతులో రెచ్చగొట్టగానే, ఆమె తన దుఃఖాన్ని మరిచింది. పద్మావతి ఆమెకు ముస్లిం దాసీ వేషం వేసింది.

గంగ : మఠంలో నీవు మూర్ఛిల్లిన సంగతి పద్మావతిగారితో చెప్పింది. యీ మాంగళ్యంకోసం ఆమెమాత్రమే గాదు, చక్రవర్తి సహితం యెదురు చూస్తున్నారు.

గౌరి : అక్కర్లేదు. ఈ భూమిమీద జనులున్నారు. వారికి చూపిస్తే చాలు, శివయోగిని చంపేస్తారు. అతని మఠం తగులబెట్టి.

విన : నీవు మఠం జోలికిపోయి, మతకలహాన్నే చూస్తావు.

గౌరి : అదే నాకు కావలసింది.

విన : అబద్ధం. శత్రురాజ్యానికి అది కావలసింది. ఈ రాజ్యంలో పెద్ద అంతః కలహంకోసం యెదురు చూస్తోంది దేవఘడ్ - కాబట్టే బ్రతిమాలుతున్నాను, యీ మంగళ్యాన్ని చక్రవర్తికి పంపించు... గౌరీ, నీవు దుఃఖంలో వున్నావు నీ దుఃఖానికి మూలం శివయోగిగారు, అతని స్వార్థం. ఆ స్వార్థానికి లోకవిశాలమతం వజ్రకవచమై కూర్చుంది. నీ కున్న కోపమే యీ లోకానికి కలగనియ్యి. అంతవరకూ నీ దుఃఖాన్ని నీవే సహించు.

గౌరి సహించింది.

## ౨

ఉదయమైంది. నిన్నటివరకూ భిన్నమత విరోధంతో అల్లరి పడిన వోరుగల్లు నేడు యుద్ధవార్తలతో అల్లరిపడుతోంది. యింతకు పూర్వం యుద్ధాలలో వోడిపోయిన తుఘలక్ - ఖుస్రూ దేవఘుడు నుండి తన రాయబారిని పంపించాడు. అతడు యుద్ధోన్మాది. ఇప్పటి రాయబారం తిరిగి యుద్ధాన్నే స్పష్టపరుస్తూంది. రాయబారి కొలువులో ప్రవేశించినవార్త వినిపించి ప్రజలు రాజకొలువు వెలుపల సమూహపడినారు. కొలువు నిర్ణయమేదో త్వరగా వినిపిస్తే బాగుండును. ఇంతవరకు చక్రవర్తి కొలువు జేరినవార్త చెవినిబడలేదు. కారణం!

తన అలంకార మందిరంలో రాజదుస్తులు ధరించనున్నాడు. రామశరణు కూతురు మెళ్ళో మాంగళ్యం యీ రాజహస్తాలలో ప్రకాశిస్తోంది. చక్రవర్తి ముఖంలో నిట్టూర్పులు వింటూ యెదురుగా వీర సోముడు నిలచివున్నాడు. వీరసోముడు వొక యోధుడు. శివమతస్థుడు, వినయజినికి ప్రాణమిత్రుడు.

వీర : ఈ మంగళసూత్రం చూపించి తమను దుఃఖపెట్టినాను ప్రభూ, క్షమించండి.

ప్రతా : ఈ సూత్రం చూపించటమే నీ దోషమైనట్లయితే అది నన్నే భయపెట్టేది; అయితే నేను చక్రవర్తినిగదా నా గుండెల నెముకూ దుముకు తెక్కిస్తోంది! చాటి చెప్పిందిగాబోలు జైనులకు; మన శివమత వీర దురాగతాన్ని, దేశభక్తుడైన వినయజిని ముఖంలో అశాంతిని రగిలించింది గాబోలు.

వీర : లేదు ప్రభూ, అతడు శాంతిప్రియుడు. జైనమతాన్ని తగుల బెట్టేందుకు సిద్ధపడిన గౌరిని అతడు పట్టి నిల్పినాడు. గుణశీల పద్మావతి సఖ్యంలో ఆమె యిప్పుడు శాంతించింది.

ప్రతా : పోస్తిది. స్వమతంలో నైతిక పతనాన్నిచూసి క్షోభపడే గౌరి యింతలోనే శాంతిస్తుందా? బహుశా యీ రాజ్య దుర్గతిని శాసించే క్రోధాన్ని యీ జైన మాంగళ్యంలో గుప్పించి పద్మావతి చేతుల్లో పదిలపరచిందేమో! చెప్పు వీరసోమూ, పద్మావతి యేమని శపించిందో నన్ను!

వీర : ఈ మాంగళ్యాన్ని తమకు నివేదించమన్నది. ఈ శుభసూత్రాన్ని తమ సింహాసనం ఆదరించనంత వరకూ, యీ లోకానికి వోదార్పు లేదన్నది.

ప్రతా : నిజం. ఈ మాంగళ్యాన్నియే సింహాసనం గౌరవించదో, అది శుభాలకే దూరమైపోతుంది. లోకంయొక్క సహనాన్నే నష్టపడి పోతుంది.

ద్వారంలో పాదుకల చప్పుడు వినిపించింది. పీఠాధిపతి శివయోగి ప్రవేశించాడు. చక్రవర్తి చేతులు జోడించాడు. చేతి వ్రేళ్ళల్లో మెరుస్తూ వ్రేలాడే మాంగళ్యం చూసి శివయోగి త్రుళ్ళిపడినాడు.

ప్రతా : తమరేవిధంగా నిశ్చేష్టులై పోయినారో. యీ మంగళ సూత్రం చూస్తే అదేరీతిగా లోకం స్తంభించి పోతుందేమో దేవరా! యెందుకో తెలుసునా రామశరణు కూతురు మెళ్ళోనుంచి మాత్రం యిది అంత తేలికగా తెగిరాలేదు. మన సామ్రాజ్య పునాదిశక్తులను తనలోకి గుంజుకొన్న తరువాతే, దూరమైంది వారి స్త్రీ మెడకి. మన రాజ్యానికి మాంగళ్యంపాడే అ మంగళగీతం తమకేమైనా వినిపిస్తోందా ?

శివ : ఇది జైనస్త్రీలు ధరించే మంగళ సూత్రం గాదా ప్రభూ; మన శైవరాజ్యానికి అమంగళమే పాడుతుంది.

ప్రతా : కాబట్టే తమ రీతాళిని తిరిగి శైవబాలిక మెళ్ళో ముడివేసి, మంగళగీతం పాడించుదామనుకొన్నారు.

శివ : నేనా ?

ప్రతా: అవును. కాని మా చెల్లెలు గంగ, మీ స్త్రీ హత్యాపాపాన్ని మెడకు చుట్టుకొని సుఖించలేనన్నది. శైవుల శుభంకోసం, యీ మాంగళ్యాన్ని దేవసన్నిధిలో పూజించమని నాకు పంపించింది. దయచేయండి.

అడుగులో అడుగు గలిపి చక్రవర్తి ననుసరిస్తున్నాడు వీరసోముడు. కాని శివయోగి నడవలేక పరుగెడుతూ అన్నాడు.

శివ: యెక్కడికి ప్రభూ?

ప్రతా: నా పూజామందిరంలోకి మతగురువులు చేసే మహాపాపం యీ స్త్రీ మాంగళ్యాన్ని ఆవేశపరచింది. మమ్మల్ని మా సింహాసనాన్ని - మిమ్మల్ని మీ పీఠాన్ని, తన ఆగ్రహంతో, అశాంతిలో కూల్చేస్తానంటోంది. స్వయంభూ సన్నిధిలో దీన్ని పూజించాలె.

శివ: స్వయంభూ సన్నిధిలోనా?

ప్రతా: అవును. మీ మతంలో శివలింగం మ్రోల తెంచుకొన్న తాళిగాదా యిది.

శివ: మీరు వృధా భయపడుతున్నారు ప్రభూ. మనకు అపార సైన్యముంది.

ప్రతా: మన సామ్రాజ్యశక్తి సైనికబలగంలో లేదు. ప్రజానైతిక బలంలో గుప్తపడివుంది. దాన్ని మీరు శిథిలంజేశారు.

శివ: కాస్త మీ ముఖాన విభూతిపెట్టనివ్వండి. ఎందుకో మీరు భయపడుతున్నారు.

ప్రతా: నా సింహాసనంతోసహా నేనేమో పాతాళంలోకి పడిపోతున్నట్లనిపిస్తోంది. ఈ బూడిద నన్ను రక్షించలేదు.

రాజ ప్రాసాదాల మధ్యలో పూజామందిరం కనిపిస్తోంది. ప్రతాపుడు ఆలయంలో ప్రవేశించాడు. అందులో పాలరాతి శివలింగ మొకటి తళతళలాడుతోంది. దాని శిరోభాగంమీద రత్నాలు పొదిగిన బంగారు కిరీటాన్ని భద్రంగా రెండు చేతులతో తొలగించి వొకప్రక్కన

పెట్టినాడు. దాని స్థానంలో తాళికట్టడం చూసి శివయోగి భయ పడినాడు.

శివ : ప్రభూ, పరమశివుని తమరు స్త్రైలపరుస్తున్నారు.

ప్రతాపుడు వినిపించుకోలేదు. భక్తితో చేతులు మోడ్చి ప్రార్థించాడు.

ప్రతా : పరమశివా, సతీ ధర్మాన్ని రక్షించే ధర్మ కిరీటంవలె యీ మాంగళ్యం నీ ముఖాని కెంత శోభనిచ్చింది. కామ తృప్తికోసం అర్ధనారీశ్వరుడ వైనావనీ, ఆపలేని మోహముతో గంగాధరుడ వైనావనీ లోకం నిన్ను గుడ్డిచూపు చూపింది. సతీ మానభంగంతో నిన్ను ఆనంద పరచాలనే మూఢ ఆచారం నీ భక్తగణంలో స్థిరపడి పోయింది. నీ రూపం, నీ మతం. పరమత వైషమ్యంతో అకళంక మైపోయిది. నీరాజ్యం అరాచక మైపోయింది. పరమశివా, ధర్మాన్ని రక్షించు.

వీరప్రతాపులవారు సాష్టాంగ పడినారు. వీరసోముడు వారి ననుసరించినాడు. శివయోగికి మాత్రం యీ తాళీ మహాత్యం తట్ట లేదు. అతనికీ ప్రతాపుని భక్తి పిచ్చిగా తోచింది. ప్రతాపుడు లేచి నిలిచి అన్నాడు.

ప్రతా : నమస్కరించండి దేవరా, మంగళసూత్ర ధారుడైన పర మేశ్వరునికి.

శివ : నమస్కరించలేను ప్రభూ, అది మా పీఠానికి అగౌరవం.

ప్రతా : మీ పీఠానికిదే అగౌరవమని భావిస్తే, నేటి కొలువులో యీ మంగళ్యాన్ని ప్రదర్శిస్తా, స్త్రీలను హత్యజేసే......!

శివయోగి భయపడి పోయినాడు. "హరహార మహాదేవ"యని సాష్టాంగ పడినాడు.

శివ : స్త్రీలను రక్షించు దేవరా!

ప్రతా : మీరు కోరితే తప్పకుండా రక్షిస్తాడు.

ముఖంలో తన సిగ్గుకు, తన పెద్దరికాన్ని చాటుకేసి శివయోగి పూరించాడు. చక్రవర్తి నానుకే సాగిపోయినాడు.

కొలువులో జేరగానే సభికులు నిలిచి చక్రవర్తిని గౌరవించారు. సింహాసన మలంకరించగానే ఆయన గర్జించాడు.

ప్రతా : రాయబారి మా సమక్షంలోనిలిచి మాటాడగలడు.

ఇరువురు భటులమధ్య నడుస్తూ, సలాములుజేస్తూ రాయబారి చక్రవర్తిని సమీపించాడు. అతనిపేరు రహీం.

రహీం: శ్రీ శైవ సామ్రాజ్య చక్రవర్తి, శ్రీ కాకతీయ వీర ప్రతాపరుద్రదేవ...!

ప్రతా : ఆగు రాయబారీ. దీర్ఘలేఖను చదివి కాలహరణం చేసే కంటే, మా ప్రశ్నకు రెండు మాటల్లో సమాధానమిస్తేచాలు. మీ యువరాజు ఖుస్రూ మా దుర్గంమీద యెందుకు దండెత్తి వస్తానన్నాడు?

రహీం : తమ రాజ్యంలో జైనులూ, శైవులూ కలహిస్తున్నారు. ఈ యశాంతివల్ల మక్కాలో మా ఖుదాయొక్క సుఖశాంతులు భంగపడుతున్నాయి. కాబట్టే తమరు మా సుల్తానుకు సామంతులై మా మత సాంప్రదాయాన్ననుసరించి రాజ్యపాలన చెయ్యాలె.

అన్నయ : మేము సామంతులమై యెంత కప్పంచెల్లిస్తే, మీ ఖుదా శాంతిస్తాడు.

రహీం : యేడాదికి పది బారువుల బంగారం.

అన్న : పదిబారువుల బంగారంకోసం అల్లా సుఖించటంలేదా, లేక మీ సుల్తానా?

కొలువు నవ్వింది. మారుమాటలేక రాయబారి తల వొంచుకొన్నాడు.

అన్న : ఢిల్లీలో మీ సుల్తాన్ ప్రభుత్వం యిప్పుడున్నది. ఉత్తర దేశంలో హిందూ మహమ్మదీయ కలహాలు మీ ఖుదాకు శాంతి

నిస్తున్నాయా. ఇక్కడ దేవఘుడులో హిందూ మహమ్మదీయ ద్వేషాలను మీ ఖుదా ప్రీతి చేస్తున్నాడా?

ప్రతా: రాయబారీ! బంగారంమీద పేరాశతో పవిత్రమైన ఖుదా పేరు నుపయోగించుకొని, ఖుదాకే ద్రోహంచేస్తున్నారు. మంచిది. సభికులు తమ అభిప్రాయం తెలియజేస్తారు. విను.

జటా: దేశ శాంతే కోరితే, మీ ఖుదా కైలాసానికిపోయి మాపరమ శివునితో సంప్రదిస్తాడు. లేక బంగారం కోరితే, మీ సుల్తాన్ యుద్ధంచేస్తాడు.

సభలో కరతాళ ధ్వనులు.

ప్రతా: రాయబారీ, మీ సుల్తానుకు మా సందేశం వినిపించు. గడచిన యుద్ధాలలో సుల్తాను సేనలు మీ రాజ్యకాంక్షకు బలైపోయినాయి మా దుర్గంముందు. ఖుదామీద భక్తివుంటే ఇప్పటి వరకూ త్రాగిన మానవరక్తంతోనే సుల్తాన్ తృప్తిపడటం మంచిది.

భటు లచ్చటనుంచి రాయబారిని తీసుకపోయినారు. ఖిన్నవదనుడై ప్రతాపరుద్రుడు సభికులను చూసి పలికినాడు.

ప్రతా: మనరాజ్యంలో మతకలహాలు పరమశివునికి మాత్రం శాంతి నిస్తున్నాయా?

శివ: లేదు ప్రభూ. కాని జైనశైవులమధ్య మత విరోధం తప్పనిసరి.

ప్రతా: కారణం.

శివ: జైన శైవ మతాలమధ్య సాంప్రదాయ భేదంవుంది. జైనసాంప్రదాయం దాస్యానికి దారితీస్తుంది. శైవులు స్వతంత్రులు.

ప్రతా: అవును. నేడు శైవ సాంప్రదాయాలను సహితం దాస్యంలోకే మరలిస్తున్నారేమో?

శివ: ఎవరు ప్రభూ?

ప్రతా: మతగురువులు. తమ మఠంలో దేవఘుడ్ యిస్లాం మత ప్రతినిధికి ప్రవేశమిచ్చి...!

శివ: ప్రభూ అతడు మన సాంప్రదాయంలోవున్న స్వతంత్రతను మెచ్చి...!

ప్రతా: స్వతంత్రతనా? పరమతస్త్రీల ప్రాణాన్నీ, మానాన్నీ అపహరించే 'స్వతంత్రత'— దానినే గాదా అతడు మెచ్చింది? అక్కడ మీ మతముఖంలో పొగిడి, యిక్కడ ఈ రాజముఖంలో అపహసించాడు.

శివ: అతడేనా?

ప్రతా: అవును అతనిని పంపించిన రాజ్యం, దేవఘడ్ యిస్లాం మత రాజ్యం. అక్కడ జైన దాస్యానికి మార్గం తీయమని మీకు కానుక లిచ్చింది. యిక్కడ కప్పం చెల్లించ మన్నది. తన క్రింద దాస్యాన్ని అంగీకరిస్తూ ఈ కొలువులో యిక్కడమేము తిరస్కరిస్తామని తెలుసు. కాబట్టే అక్కడనుంచి త్రోవచూసుకో బోతున్నాడు ఖుస్రూ మన రాజ్యంలోకి.

శివ: ఎక్కడనుంచి?

ప్రతా: విష్ణుపురంలోనుంచి. ఆ పైన మీలోనుంచి...!

శివ: ఆశ్చర్యం.

ప్రతా: ఇక్కడి కొలువుమాత్రం ఆశ్చర్యపడదు దేవరా. వైష్ణవ రాజూ అతని మతపీఠమూ మన వున్నతిని ద్వేషిస్తారు. మన సామ్రాజ్యమూ, మన మతమూ పరాధీనమైపోవాలని కోరుతున్నారు. వైష్ణవరాజ్యం చిన్నది. మనతో పోరి వారు నెగ్గలేరు. కాబట్టే బలమైన శత్రువును తమ రాజ్యంలోకి కోరి ఆహ్వానిస్తున్నారు. పరుల దాస్యం చూసేందుకు స్వయంగా తామే దాస్యాన్నంగీకరిస్తూన్నారు, ఆ మనస్తత్వం మీలోకూడా వున్నదా?

శివ: లేదు ప్రభూ.

ప్రతా: లేనట్లైతే యీ భూమిమీద మనకు శత్రువేలేదు. రాయిటు వినయజనీ!

కొలువులో వొకమూలనుంచి వచ్చి వినయజిని సమీపించాడు తిరిగి కొలువును చూస్తూ అన్నాడు.

ప్రతా: వైష్ణవ ప్రజలుమాత్రం యీ శత్రుత్వాన్ని ఆహ్వానించ టంలేదు. వారు శాంతిప్రియులు. వారి స్వాతంత్ర్యాన్ని మనము రక్షించినపుడే మన స్వాతంత్ర్యానికి రక్షణవుంటుంది. ఇక్కడ సమానత్వం గౌరవించినపుడే, అక్కడి స్వాతంత్ర్యాన్ని ప్రేమించేయ గలుగుతాం. ఇప్పుడీ కొలువు ఒక చిన్న జైనసేనకు స్వాతంత్రతను ప్రకటిస్తోంది. అది వైష్ణవ రాజ్యంలో శత్రువుల నెదిరిస్తుంది. శత్రుత్వానికి స్థావరం లేకుండా చేస్తుంది. అందుకో వినయజినీ యీ ఖడ్గం!

వినయజినికి ఖడ్గమందిస్తూ ఆయన పలికినాడు.

ప్రతా: వినయజిని మా సేనాధిపతి. అతని అధికారంలో జైనసేన స్వతంత్రంగా పోరాడబోతోంది.

శివ: నాకేమో మైకంగమ్మింది. నేను చూడలేకపోతున్నాను. వినలేక పోతున్నాను. మూర్ఛ వస్తోంది. పట్టుకో చక్రవర్తీ నన్ను!

మూర్ఛ నటించిన శివయోగిని ప్రతాప చక్రవర్తి పట్టు కొన్నాడు. స్వతంత్ర జైన సేనకు శివయోగి ఆశీస్సుమాత్రమే లభ్య పడలేదు.

## ౮

మాసిపోయిన వెలుగుతో పశ్చిమాకాశ స్థితి అయోమయమైపోయింది. నిండు చీకటీ గాదు, నిండు వెలుగూ గాదు. అటువంటి 'చింతా, చీకులో' పుట్టబట్టే గాబోలు, తనలో చల్లని వెలుగు లేలేక విదియనాటి చంద్ర రేఖకు, వంటపచ్చని యీ లోకంలో నూలుపోగులే గతియైనాయి. పగలంతా పచ్చరంగుతోను, పిట్ట పాటతోను సొంపెక్కిన అడవి చెట్లన్నీ ఇప్పుడు భూతాలవలె నల్లబడి చీకట్లు కక్కుతున్నాయి. ఆ యడవిలో ఆపుబయట పయనమాపి, తురక సేనలు అన్నం వండుకొంటున్నారు. ప్రకోపించిన యుద్ధజ్వాలలమధ్య జాలిగొలిపే నిరాశా జీవితాలవలెనే, భగ్గునమండే పొయ్యిమంటల నడుమ వంటపాత్రలు నల్లబడిపోయినాయి. ఆ సైనికుల నడుమ నాలుగు చిన్న గుడారాలమధ్య ఒక పెద్ద డేరామీద రంగుచిత్రాలు కాగడాల వెలుగులోనైనా తమ విలువను నిలుపుకొనలేక మాసికమాసికలుగా కన్పిస్తున్నాయి. అడవిప్రక్కన చేనునుంచి బడలికతో బలహీనపడిన స్త్రీకంఠంలోనుంచి బయలుదేరిన పాట తియ్యగా ఉన్నా, అక్కడి చెవులు జొరనీయలేదేమో ఆ చీకట్లో, చెట్టుతొర్రలు వెతుక్కొంటూ పోతోంది. యువరాజు అలూఫ్‌ఖాన్ డేరాలో తివాసీమీద కూర్చుండి యేమో ఆలోచిస్తున్నాడు. ఓరుగల్లులో రాయబారపు సంగతులన్నీ వినిపించిన రహీమును కూర్చోమని చెప్పటమే మరచిపోయినాడు. వెలుపల నక్కలు ఊలపెట్టుతూన్నట్లే అతనిలో ప్రలోభం కూతవేస్తోంది.

అలూఫ్ : రహీం, ఖుదాకోసంగాదు, మతంకోసం గాదు– అయితే యీ యుద్ధం యెందుకోస మన్నాడు ప్రతాపుడు?

రహీం : పది బారువుల బంగారంకోస మన్నాడు. అది యివ్వకపోతే రాజ్యంకోసం అన్నాడు.

అలూాఫ్: అయితే వత మెందుకూ ?

రహీం: రాజ్యంకోసమే.

అలూాఫ్: రాజ్య మెందుకూ ?

రహీం: బంగారంకోసం ?

ఇద్దరికీ ఒక్కమాటే నవ్వు వచ్చింది.

అలూాఫ్: కూర్చో కథ చెప్తాను ... పుట్టుకలో ఖుస్రూ వొక హిందువుడు. సుల్తాన్ ముబారిక్ స్నేహంవల్ల అతడు మహమ్మదీయుడైనాడు. తరువాత ఖుస్రూ ముబారెక్కను చంపి ఢిల్లీ సింహాసన మెక్కాడు. అంతేనా ?

రహీం: అంతే...

అలూాఫ్: అప్పుడు హిందూ దేవతావిగ్రహాలను మసీదులలో పెట్టించి, మహమ్మదు మతాన్ని కాఫర్ ఖుస్రూ తల్లక్రిందులు చేశాడు. అంతేనా ?

రహీం: అవును.

అలూాఫ్: అప్పుడు పంజాబులో నా తండ్రి సుబేదారు పదవిలో ఉన్నాడు. కలలో నా తండ్రికి ఖుదాకన్పించి తన పరాభవం చెప్పుకొన్నాడు. దీని అర్థం ?

రహీం: మానవునికంటే దేవుడెంతో బలహీనుడని !

అలూాఫ్: అప్పుడు నా తండ్రి ఖుస్రూను చంపి, ఖుదా పేరుతో సింహాసన మెక్కినాడు. మసీదులలో హిందూ విగ్రహాలను తుడిపించాడు. మహమ్మదు మతాన్ని రక్షించాడు.

రహీం: కాబట్టి రాజ్య మేవిధంగా మారితే మసీదులు, దేవుళ్ళూ ఆ విధంగా మారుతారని తెలిసిపోతోంది.

అలూాఫ్: ఎట్లా ?

రహీం: ఢిల్లీ సింహాసనంలో ఖుస్రూఉంటే రాజ్యంలో మసీదులన్నీ హిందూ విగ్రహారాధనకు చోటిచ్చినాయి. ఆ సింహాసనంలో మీా

తండ్రి కూర్చుంటే తిరిగి ఆ మసీదులే, ఆ విగ్రహాలను కోసివేసినాయి. కాబట్టి దేవుడిని, మతాన్ని నిలబెట్టేది రాజ్యమేనంది.

అల్లూఫ్‌ఖాన్ ఆలోచిస్తూ మాట్లాడలేదు.

రహీం : చరిత్ర యిలాగే ఋజువుచేసేప్పుడు, దేవుడు, మతము, భక్తి యీ పెద్దపెద్ద పేర్లన్నీ స్వార్థం కప్పిపెట్టే పవిత్రనామాలని ప్రతాపుడు నవ్వితే పాపమా?

అల్లూఫ్ : అయితే ప్రతాపుడు యుద్ధాలుజేసి రాజ్యాలు గెలిచింది కూడా బంగారంకోసమేనా?

రహీం : కాదు, మతంకోసం!

అల్లూఫ్ : అబ్బే, మళ్ళీ మాటమార్చావు. మతమంటే ప్రతాపుడు బంగారమనుకోడూ?

రహీం : కాదు. సత్యమూ, శాంతి! దేశంలో చిన్న చిన్న రాజులు భోగకాంక్షతో ప్రజలను పీడిస్తున్నారు. ఒకే రాజ్యసూత్రంద్వారా దేశంలో శాంతిని స్థాపించేందుకు యుద్ధంచేశాడు. ఆయన చేసి ది ధర్మయుద్ధం, శాంతియుద్ధం, మతయుద్ధం!

అల్లూఫ్ : అయితే హిందూరాజు లందరూ తిరిగి అదేస్థితిలో ఉన్నారు గాదా. హిందూస్థానంలో మన మతం, మన రాజ్యం...

రహీం : దోచుకొని తినేందుకు.

అల్లూఫ్ : మహమ్మదుమతంమీాద విశ్వాసమూ, భక్తి - ఇదంతా మోసమనీ, దోపిడీ అనీ.. ఛీఛీ, యిదేనా నీ నీతి.

రహీం : కాదు. అరేబియా, ఆఫ్ఘన్ దేశాలలో మహమ్మదు మతం శాంతికోసం, సత్యంకోసం స్థాపనమైంది. అక్కడ యెంతమంది మతప్రవక్తలు పుట్టినా, యెన్ని మతాలు మారినా, ఇంకెన్ని మతాలు సృష్టించినా శాంతికోసమే జరుగుతుంది. కాని మహమ్మదు ప్రవక్త అనంతరం మన మీా హిందూస్థానంలోకి మత కోసం రాలేదు.

అల్లూఫ్ : అబద్ధం, గజ్నీమహమ్మదుకు స్వమతాభిమానం లేకపోతే సోమనాథ దేవాలయం యెందుకు తగులబెట్టాడు?

రహీం : స్వార్థంకోసం తగులబెట్టాడు. మతంకోసం గాదు. సోమనాథ దేవాలయంలో అతడికి లభించిన బంగారం కాస్తాకూస్తా గాదు. ఆ బంగారమే లేకపోతే అతని మతద్వేషానికి అది గురిఅయ్యేదిగాదు.

ఆశతో పెద్దపెట్టున నవ్వుతూ లేచి

అలూఫ్ : అయితే ఆఫ్ఘన్‌లో మహమ్మదీయుడు మతంకోసం పుట్టి, హిందూస్థానంలో బంగారంకోసం అడుగుబెట్టుతాడు. బ్రతుకుతాడు, చస్తాడు. అంతేనా ?

రహీం : అంతేకాదు. హిందూస్థానంలో యే హిందువుడైనా బంగారం కోసం మహమ్మదీయుడౌతాడు. భక్తికోసంమాత్రం కాదు.

అలూఫ్ : అహహహ...బంగారం, రాజ్యం, భక్తి, మతం, ఖుదా —ఖుదా, మతం, భక్తి, రాజ్యం, బంగారం...అరే రహీం... హిందూస్థానంలో ఆఫ్ఘనుడు బంగారంకోసమే యుద్ధం చెయ్యాలె!

రహీం : అవును.

అలూఫ్ : ఇంకెన్నిరోజులలో విష్ణుపురం చేరుతాం.

రహీం : ఐదురోజుల్లో.

అలూఫ్ : కాదు, మూడురోజుల్లో ముట్టడి జరగాలె. సైన్యాలతో వెంటనే ప్రయాణం కట్టించు.

రహీం : ఇది రాత్రి.

అలూఫ్ : పగటికోసం నేను కూర్చోను. ప్రయాణం చేస్తూంటే, ఎక్కడో అక్కడ పగలే నా పాదాలకు తగులుతుంది. ఇంక విశ్రాంతి లేదు. ఖుదా, మతం, భక్తి, రాజ్యం, బంగారం—

అలూఫ్ పిచ్చి సంతోషంతో వాకిట్లోకి నడిచాడు. ఎదురుగా రజియాయనే యువతి నెత్తిమీద పచ్చి జొన్నమోపు పట్టుకొని ప్రవేశించింది.

అలూఫ్ : ఈ మోపు లెక్కడనుంచి ?

రజి : ఈ ప్రక్కనే జొన్నచేనుంది. అందులో కోసుకొచ్చాను.

అలూఫ్ : నీకీ పల్లెటూరి పిచ్చి యింకా వదలలేదు. ఇన్ని పరుపు లుంటే, ఈ చెత్త యెందుకు?

రజి : ఇది చెత్తా? చూడు యెంత మెత్తగా ఉందో, యెంత సువాసనో! అలూఫ్, యీ రాత్రి దీనిమీదే నిద్రపోవాలి!

అలూఫ్ : నిద్ర లేదు, తిండి లేదు, సుఖం లేదు - ఖుదా, మతం, భక్తి, రాజ్యం, బంగారం, బంగారం.

స్మరణచేస్తూ ఆమె తలమీద మోపు క్రిందకునెట్టి పోతుంటే, రజియా నవ్వుతూ...

రజి : వొట్టి పిచ్చివాడివేం!

౯

లింగపురం చిన్న గ్రామం. వీరసోము డా గ్రామస్థుడే. అతడు శైవుడు. అతని తండ్రి చనిపోయేముందే ఆస్తిపాస్తులన్నీ అప్పులక్రింద చెల్లిపోయినాయి. అతని తల్లి చిన్నపూరిపాకలో కాలం గడుపుతోంది. భర్త చనిపోయింది మొదలు యెవరికైనా పిండి విసిరిపెట్టి, ఆ వచ్చిన కొద్దిడబ్బుతోనే వీరసోముని పెంచింది. అన్నయదేవుని జాతీయాశ్రమంలో వీరసోముడు విద్య నభ్యసించాడు. చదువులు పూర్తి చేసినా అతడుఉద్యోగం చేయనని భీష్మించాడు. అతడు పేరొందిన దేశసేవకుడు!

ఆ వూళ్ళోనే అతని మేనమామ ఉన్నాడు. పేరు లింగరాజు, లక్షాధికారి, శివభక్తుడు, శివయోగి శిష్యుడు. అతనికి ధనమే ప్రధానం. మానవులకి, అతనికి మధ్యనున్న చుట్టరికమంతా డబ్బు చుట్టరికమే తప్పితే, వేరొక సాంఘిక ధర్మంఅతడు పాటించడు. వొట్టి లోభి. అతని కొక కూతురుంది. పేరు పార్వతి. డబ్బు ఖర్చులేకుండా పార్వతిని జాతీయాశ్రమంలోనే చదివించాడు. యుక్తవయస్సు వచ్చింతరువాత చదువు మాన్పించి ఇంట్లోనే ఉంచుతున్నాడు. ఒక ధనవంతున కిచ్చి పెండ్లి చెయ్యాలని లింగరాజు ఆశపడుతున్నాడు. కాని పార్వతికి వీరసోముడంటే చిన్ననాటినుంచి తగని ప్రేమ. తన మామ కూతురుని వీరసోముడు ప్రాణంకంటె అధికంగా ప్రేమిస్తాడు. ఆశ్రమంయొక్క పవిత్ర వాతావరణం ఆ ప్రేమను మరింత గాఢంచేసింది. అయితే ధనమదాంధుడైన లింగరాజుకి తన కూతురీ దరిద్రుని ప్రేమించటం యిష్టం లేదు. ఆ పీనాసి దృష్టిలో వీరసోముడు తన మేనల్లుడు గాడు– దరిద్రుడు, నీచుడు! వీరసోముని తండ్రి బ్రతికివున్న రోజుల్లో, తన పార్వతిని వీరసోముని కిచ్చి పెండ్లిచేస్తాననేవాడు. వాళ్ళకాభాగ్యం పోయింతర్వాత

అవి గాలిమాటలైపోయినాయి. ఆ పీనాసి దృష్టిలో వీరసోముడిప్పుడు మేనల్లుడు గాడు, అతడు దరిద్రుడు, నీచుడు.

మహమ్మదీయులమీద యుద్ధానికి జైనసేనతో గలిసి, వీరసోముడు విష్ణుపురం వెళ్ళేందుకు చక్రవర్తి అనుజ్ఞయిచ్చాడు. యుద్ధానికి పోయేముందు, తల్లిని దర్శించేందుకు స్వగ్రామం చేరాడు. అతడిక్కడే వీరపెండ్లికొడుకౌతాడు. జయించిరమ్మని ఆశీర్వదించి, తన తల్లి పాదధూళిని నొసట నుంచుతుంది. ఈ యాశీర్వాదం అతనికి తేలికగానే లభిస్తుందిగాని, పార్వతి అనుజ్ఞమాత్రం అతనికి లభించేట్లు లేదు. మేనమామ తన నింట్లోకి జేరనీయడు. రహస్యంగానే ఆమెను కలుసుకొని తీరాలె. వీరసోము డెంతో విరహపడినాడు. మామ 'ఛీ పొమ్మం' టాడని తెలిసికూడా, ఆ మేడముందు అభిమానం విడిచి రెండుమార్లు తిరిగాడు. పార్వతి కనుపించలేదు. వాకిట్లో ఒక కొయ్యకుర్చీలో కూర్చుని లింగరాజు ఎంతుకో కావలి గాస్తున్నాడు. చూసికూడా వీరసోముని పలుకరించలేదు. ధనరాసులు నడిచే ఆ వాకిలి, ఈ దరిద్రుని ప్రేమకు ప్రవేశమీయదని వీరసోముడు గ్రహించాడు. అందుకని అతడు దొడ్డిగుమ్మాన లోపలికిపోయినాడు. వేళ గనిపెట్టే చేరాడు. పెరట్లో ఒక చిన్న దుర్గగుడి ఉంది. ప్రతి శుక్రవారం పార్వతి కుంకంపూజచేసి దుర్గమీద భక్తి చూపిస్తుంది. పూజ పూర్తిచేసేసమయానికి వీరసోముడు గుళ్ళో ప్రవేశించాడు.

పార్వతి పదిహేనేండ్ల చిన్నది. ధ్యానం ముగిసి కళ్లు తెరిచింది. వీరసోము డెదుట ప్రత్యక్షమైనాడు. త్రుళ్లిపడి లేచి నిల్చింది. ఏడాది నుంచి వాళ్ళకు చూపులు లేవు. అవయవసౌష్టవంలో యింత మార్పు వచ్చింతరువాత ఆమె అతని యెదుటకు వచ్చి యెరుగదు. ఆ సిగ్గే గాబోలు, పార్వతి తలవంచి మాట్లాడలేదు.

వీర : మీ గడపచుట్టూ ఎన్నిమార్లు తిరిగినా నీవు కనిపించలేదు. వినయాసితో నేను విష్ణుపుర యుద్ధానికి వెళ్లుతానని తెలిసిందా నీకు?

పార్వ : తెలు...

ఆఖరి అక్షరం గొంతులో గాలిగుటక మింగేసింది.

వీర : తెలిస్తే మా యింటికి కెందుకు రాలేదు. నిన్ను మీ నాన్న కసురుకొన్నాడా?

పార్వతి పలుకలేదు. ఆమె యెంతో సిగ్గుతో భయంతో కోక చెంగు మెలిపెట్టుకొంటూ నిల్చింది. ఆలస్యమైతే యెవరన్నా వస్తారేమోఅని భయం. అతడు విసుగుతో ఆమె చెయ్యి పట్టుకొని గద్దించి పలికాడు.

వీర : నేను మేనల్లుడనైనా, ధనగర్వంతో మీ నాన్న నన్ను పలకరించనేలేదు. ఈ అతిశయమే నీకూ ఉందా? చెప్పు వెళ్ళిపోతా...

పార్వతి పలుకలేదు. కాని ఆమె వ్రేళ్ళసందున అతని వ్రేళ్ళు నొక్కుకొనిపోయినాయి. వీరసోముడు శాంతించాడు.

వీర : నా దగ్గరకు పారిపోయి రావటం ఎట్లా మరిచిపోయినావు పార్వతీ! అందుకే దొంగతనంగా వచ్చాను... నన్ను యుద్ధంలో బ్రతికించమని రోజూ పరమశివుని పూజిస్తావా?

వీరసోముడికి తన ప్రాణమంటే లెక్కలేదు. కాని తన ప్రాణమంటే ఆమె కిష్టమని తనకు తెలిస్తేచాలు. ఆమె ముఖంలో రక్తం చిందింది. కాని పొంగివచ్చే సంతోషాన్ని అణిచివేసింది.

వీర : ఎందుకూ సిగ్గుపడతావు, ఆలస్యంలేదు. వెళ్ళి కాళీపూజ చెయ్యాలె...ఇల్లా రా యిక్కడ కూర్చుని చెప్పుకుందాం!

- అని రెక్కపుచ్చుకొని లాగుతోంటే, పార్వతికి ఒళ్ళు పులకరించింది. ఆమె నెమ్మదిగా ముందడుగు వేస్తూనే ఇష్టంలేకపోయినా పెనుగులాడుతూనే...

పార్వ : ఎవరన్నా వస్తారేమో!

వీర : వచ్చి యేవ రేం చేస్తారు? నిన్నుగూడా నాతో గెంటుతారు యుద్ధంలోకి. అప్పుడు కుడిచేత్తో నిన్ను నా రొమ్మున గట్టుకొని యెడంచేత్తో యుద్ధంచేస్తా!

దేవిపాదాలముందు కూర్చోబెట్టి, ఆమె ప్రక్కనే వీరసోముడు కూర్చున్నాడు. గుడితలుపు ఒక రెక్క మూశాడు.

పార్వ : నైవేద్యం పెట్టేందుకు మా నాన్న వస్తాడేమో.

వీర : పూజలైంతరువాత ఓరుగల్లు సాగనంపుతారు నన్ను ... మళ్ళీ యెప్పుడు మాట్లాడుకొంటాం? చప్పున చెప్పు- నాకోసం పూజలు చేస్తావా ?

ఓరతెరచిన తలుపుచాటునుంచి వెలుపలికి తొంగిచూసింది. ఎదురుగా గడ్డివాము ఉంది. ఆవుదూడొకటి గడ్డిమేస్తోంది. చెయ్యిజాచి వేలితో చూపిస్తూ:

పార్వ : అనుగో... ఆ కోడిదూడ లేదూ, దాన్ని అచ్చుపోసి ఆంబోతు నిస్తానన్నా పరమశివునికి.

వీర : నిజంగా నేనా — నిజంగా — నిజంగా నాకోసమే.

ఎంతో ఆశతో వీరసోముడు చెయ్యిజాచాడు. పార్వతి చేతిలో చెయ్యివేసి.

పార్వ : ఒట్టు బావా, నిజంగా శివుడికి మొక్కుకొన్నా.

ఆపేక్షనంతా ఒక్కమాటే చూపించేందుకు ఆమె కళ్లు యెంతో పెద్దవైనాయి. అప్పుడామె యెంతో అందంగా కనుపిస్తోంది. ఆమె సిగ్గుతో మళ్ళీ తలవంచింది. భుజాలుబట్టి వెనుకకు వంచి ఆమెను తన రొమ్ముమీదకు వొంచుకొన్నాడు.

వీర : మఱి అల్లావున్నావేం విచారంతో... ఇవ్వాళ అలంకారం చేసుకొని అందంగా కనుపించవూ ?...ఎందుకూ అట్లా ఏడుస్తావు ? యుద్ధంలోకిపోతున్నాననేనా...బెంగ.

పార్వ : 'అబ్బే, తప్పు — యేడవకూడదు — అనుకొంటా ! యెందుకో పొర్లివస్తోంది దుఃఖం !

ఉత్తరీయంతో ఆమె కన్నీళ్ళు తుడిచి

వీర : భయంలేదు పార్వతీ...ఒక్క కత్తిపోటైనా తినకుండా జయించి వస్తా.

పార్వ : నా కెట్లా ధైర్యం బావా? యుద్ధంలో డాలుగూడా వొదిలేసి రెండుచేతులా రెండుకత్తులూ పుచ్చుకొంటావుటగా? అంత ఆవేశంలో నీమీద దూకే ప్రమాదం నీకేం తెలుస్తుంది?... ఎట్లా వొస్తావో భద్రంగా.

వీర : నా ముఖాన వీరకుంకం పెడితే సుఖంగా తిరిగివస్తా... పెళ్లాడుదాం అప్పుడు!

అమ్మవారి పాదాలు పూజించిన కుంకం చిటికబట్టి సిగ్గుతో ఊరుకొంది.

వీర : మళ్ళీ యెందుకు సిగ్గు...ఊఁ, పెట్టు.

ఆమె కుంకపు వ్రేలిని తన ముఖందగ్గరకు తీసుకొన్నాడు. ఆ చిన్నవయస్సులో ఆ లేత యవ్వనానికి ఈ యమాయికపు కోర్కెల లోనే గాని, తమ ప్రేమను గంభీరభావాల్లో, పెద్దభాషతో యిమిడించి చెప్పటం ఎట్లా తెలుస్తుంది. కుడిచేత్తో కుంకం బట్టింది, తన యెడమ అరచేతిలో అతని చెక్కిలి నొక్కిబట్టి ముఖమెత్తింది. వీరసోముడు కుదురుగా కూర్చున్నాడు. హృదయంలో రగుల్కొన్న ప్రేమాగ్ని జ్వాలనే అతని ముఖంమీద దిద్దిందిగాబోలు పొడుగ్గా 'గోవిందంపెట్టి' కుదిరిందో లేదోనని రెప్పార్పక చూస్తోంటే, లోకమంగళంకోసం ఆ బొట్టు రాలిపోకుండా మంత్రిస్తోందా అనిపించింది. సంతోషంతో పొంగి పోతూ, అతడామెను దగ్గరకు లాక్కొన్నాడు. ఆ మోహానికి అంతు లేదు. ఆ ప్రేమకుపరిధిలేదు. మాటలు కూర్చుకొనే అవకాశమీయ కుండానే యెన్నో కోరికలు—వాటి నన్నిటిని చెప్పలేక, చివర కేమీ పలుకలేక ఆమె ముఖంమీద ముఖంవాల్చాడు.

"పార్వతీ!"

"వీరా!"

మరి పలుకలేదు. ఒక పెద్దదుఃఖతరంగం ఉబ్బెత్తుగా వచ్చి ఆమె ముఖాన్ని అతని భుజంమీదకు తోసివేసింది. కన్నీళ్ళతో యిరువురి భుజాలు తడిసిపోతున్నాయి. కౌగిళ్ళు వొదిలించుకోలేరు. అయినా

యుద్ధం వాళ్ళను వొదులుతుందా? రాజదుర్గంలో యుద్ధభేరి మోగే మోత - ఎదురుగా మృత్యుముఖంలో వికృత హాసంగా ప్రతిధ్వనించి పార్వతిని భయపెట్టిందేమో? తన ప్రియుడికి అదే చివరి గడియ యని భీతిల్లి, మృత్యుముఖంలో పడిపోయే ప్రియుని కంఠాన్ని యీవలకు లాగుతూన్నట్లే తన రెండుచేతులూ మెంతగట్టిగా చుట్టిపెట్టింది? ఆమె వొదలలేదు. అతడు వొదిలించుకోలేదు. ఆ విధంగా కాలం మెంతదీర్ఘంగా గడిచిపోతున్నా అక్కడమాత్రం క్షణాకంటే పెద్దదిమాత్రం కాలేకపోయింది. ఆ క్షణంలోనే విఘ్నం! లింగరాజు ప్రవేశించాడు. ఇద్దరూ త్రుళ్ళిపడ్డారు. స్వర్గంలో కాలుజారి నరకంలో పడిపోయినారు. ఇరువురు సిగ్గుతో తలవంచారు. భయంతో పార్వతి వొణికిపోతోంది.

లింగ : ఈ బుద్ధు లెన్నాళ్ళనుంచి నేర్చావే నువు?

ఇద్దరూ తలెత్తలేదు. మాట్లాడలేదు.

లింగ : దేవుడు గుళ్ళో యీ దొంగేడుపులు... అవ...

నోరు నొక్కుకొన్నాడు, వీరసోమునికి వొళ్ళుమండింది.

వీర : మేమేమీ తప్పు చెయ్యలేదు. దాన్నేమీ అనకు మామా?

లింగ : నే నెవరికిరా మామను?

వీర : నాకే, మా యమ్మ తమ్ముడివి గాదూ.

లింగ : కూటికిలేని దరిద్రుడికిగూడా మామనేనా?

వీర : న న్నేమన్నా ఊరుకొంటూ... పార్వతినన్నావా ఊరుకోను... పార్వతీ, వెళ్ళొస్తా! మళ్ళీయుద్ధంతరువాత.

వీరసోముడు తలవొంచుకొని నడిచిపోతున్నాడు. పార్వతికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి.

పార్వ : ఈ పూలు తీసుకపో, బావా?

లింగ : ఎవడే, బావ?

వీర : నేనే.

ఇంత మొరటుగా సమాధాన మిస్తేనే లింగరాజు జడుస్తాడు. లేకపోతే అతడు మనిషిగాడు. వీరసోముడు మళ్ళీ వచ్చి ఆమె ప్రసాదించిన పూజా పుష్పాలు అందుకొన్నాడు. కళ్ళ కద్దుకుని యింటికి జేరాడు. కాళీపూజ చేశాడు. అతని తల్లి యిష్టదేవత కెందరికో మొక్కింది తనయుని రక్షింపమని. పాదధూళి తనయుని నొసటనుంచింది. వీరసోముడు తల్లిపాదాలు కన్నీళ్ళతో తడిపాడు. ఇదే విధంగా యుద్ధంలోజేరే యువకులందరూ అన్నిచోట్లా తమ కన్నీళ్ళతో తల్లుల పాదాలు తడిపి, ప్రియురాండ్ర కన్నీళ్ళతో పాదాలు కడిగించు కొంటున్నారు.

## ౧౦

రాత్రి గంగకు కంటిమీద కునుకులేదు. ఒక చిన్న బొమ్మరిల్లు వంటి పర్ణకుటీరంలో అలికి ముగ్గులుపెట్టింది. పీఠల చిత్రపటాలతో అలంకరించింది. పూజాద్రవ్యాలన్నీ సిద్ధపరిచింది. తెల్లవార్లూ దీపం దగ్గిర కూర్చుని పెద్దపూలదండ గుచ్చింది. తాను పూలతో అలంకరించుకొంది. ఈ యలంకారం వినయునికి నచ్చుతుందా — మాటిమాటికీ తన అందాన్ని అద్దంలో చూసుకొని మురిసిపోతోంది. ఇంకా వినయుడు రాలేదు. సూర్యోదయమైంది. ఆశ్రమంలోనుంచి విద్యార్థులంతా యుద్ధప్రచారం చేసేందుకు గ్రామాలవైపుకు తరలిపోతున్నారు. యుద్ధంముగిసేవరకు ఈ యాశ్రమానికి తిరిగి రారు. అన్నయదేవుడుగూడా తన అధికారబాధ్యతను నిర్వహించేందుకు బయలుదేరినాడు. ఉదయంనుంచీ గంగ కనుపించలేదు. ఆమెను చూసే కుతూహలంతో.

అన్న : అమ్మాయీ - గంగా.

గంగ : ఆఁ! నాయనగారూ-

ఆ మూలనుంచి పలుకుతూ, ఎక్కడ చూసినా పూలగుత్తులతో నవ్వుతూ పరిమళిస్తోంది ఆమె శరీరం. వనదేవివలె వచ్చి నిల్చింది. తండ్రిపాదాలకు నమస్కరించింది.

అన్న : ఇవ్వాళ యీ పిచ్చిఅలంకారాలన్నీ యెందుకే తల్లీ నీకు— ఎన్నడు లేనిది?

గంగ : మీకు బాగుండలేదేమోగాని, యీ యలంకారమంటే వినయుని కెంతో యిష్టం!

వినయునిమీద గంగకు గల అపార ప్రేమను స్పష్టపరచిన యీ యమాయకపు మాటలు అన్నయదేవునిలో అంతులేని ఆనందం

కలిగించినాయి. కాని యెందుకో ఆ సంతోషాన్ని వెలువరచక, సంశ యిస్తూ పలికినాడు.

అన్న : అయితే వినయజునికోసమే అలంకరించుకొన్నావా ?

గంగ : అవును నాయనగారు. వినయజుని రేపు విష్ణుపుర యుద్ధానికి వెళ్లుతాడుగదా ! అతనికి నేను వీరపూజ చేస్తాను. అతనికి తల్లీ, తండ్రీ యెవరూ లేరు. మనమే అతని ఉత్సాహపెట్టాలె. ఏకాం తంగా వినయుడు చదువుకొనే ఆ పర్ణ కుటీరం లేదూ, యెంత అందంగా అలంకరించానో చూపిస్తా రండి !

తండ్రి చేతిని గ్రహించింది. ఆమెలో చెలరేగిన తుపాను వేరు. అన్నయదేవుని పీడించే భయం వేరు. గంగ విచారపడేట్లు ఎంతో విచారంతో నిట్టూర్పు విడిచి,

అన్న : ఇంతవరకు చాలు...నే నది చూసి ఆనందించను.

గంగ : ఎందుకని నాయనగారూ?

అన్న : దేశాన్ని దృష్టిలో ఉంచుకొనే యీ విధంగా సాహసించావా?

గంగ : ఇందులో దోషమేముంది ?

అన్న : నీకూ, వినయునికి మధ్య మతభేదం ఉంది. అంతకంటే వేరే దోష మేముంది తల్లీ !

గంగ : మా యమ్మ ఎన్నోమారులు నాచేత వీరకుంకం పెట్టించింది వినయజుని ముఖాన.

అన్న : నాకు తెలుసు. కాని ఆరోజులు మారిపోయినాయి. ఇప్పుడు నీవు పెద్దదానివైనావు.

గంగ : నాయనగారూ, మా యమ్మను మీరు మరచిపోయినారు.

అన్న : లేను తల్లీ, నేనూ, ప్రతాపుడూ ఆమెను మరిచిపోలేము కాబట్టే బానిసగావున్న వినయజుని, సర్వస్వతంత్రుడైన సేనాపతిగా నియో గింపబడినాడు.

గంగ : మీరు సేనాపతిగా చేసిన వినయజునికి, నేను వీరారాధన చేస్తే...

అన్న : అంతఃకలహం కలుగుతుంది.

గంగ : నావల్ల అంతః కలహమూ ?

అన్న : ఆశ్చర్య మెందుకూ ? మత ద్వేషంతో జంగాలు ఊరుకోరు.

గంగకు కళ్ళు తిరిగినాయి. తల బరువెక్కింది. అది రొమ్ము మీద వ్రాలింది. అన్నయ దేవుడెంతో కష్టంతో మళ్ళీ పలికాడు.

అన్న : మీకు మీ దేశంమీద అభిమానమే ఉంటే, యీ యుద్ధం ముగిసేంతవరకు మీ ప్రేమకలాపాన్ని కట్టిబెట్టండి గంగా ... నా మాట లిష్టమేనా ?

గంగ : మీ మాట కెదురాడను నాయనగారూ.

తండ్రి అంత కఠినంగా కన్నీళ్ళు తుడుచుకొంటూనే మాట్లాడిన సంగతి గంగ చూడలేదు తండ్రి సమక్షంలోనుంచి దుఃఖభారంతో నెమ్మదిగా కదిలి వెళ్ళిపోతోంది. మళ్ళీఅన్నయ దేవుడు పలికినాడు.

అన్న : గంగా, మతం ఒక ధర్మఛత్రంవంటిది. శైవులందరితోబాటు ఆ గొడుగునీడనే నీవు నిలిచిఉండాలె! నీవు పాలిపోయినావ రే ! ఆ నీడలు దాటితే ప్రమాదంసుమా !

తల వంచుకుని లోపలికిపోయింది. అలంకారాలన్నీ తీసివేసింది. ఎంతో నిరుత్సాహం; యెంతో విచారం.

ఇంతలో గురుదేవుని దర్శించేందుకు వీరసోముడు వచ్చాడు. అక్కడ ఆయన దర్శనం కాలేదు. గంగ వీరసోముని వీరమర్యాద చేసింది. గంగలో ఉన్న పరిభవదుఃఖం అతడు గుర్తించలేకపోయినాడు. తనకు తన పూర్వులకు జరిగిన వైభవాలన్నీ కథలు చెప్పి, గంగకు వినిపించేందుకు ఉత్సాహపడినాడు. చివరకు పార్వతి జరిపిన రహస్యవ్యవహారంకూడా బయటపెట్టాడు. మధ్యమధ్య సిగ్గుపడుతూ, మళ్లీ ఉత్సాహపడుతూ ఆ రహస్యం వినిపించేప్పుడు, గంగ యెంతో ఉల్లాసంతో అతని శరీరానికి వీరగంధం అద్దుకొంది.

వీర : నా రొమ్ములో తలదూర్చి యెంతోసేపు యేడ్చింది. ఎంత ఓదార్చినా ఊరుకోదు. పసిపిల్లకంటే అన్యాయం మన పార్వతి గంగా!

గంగ : పాపం, పార్వతికెంత ఆపేక్ష నీమీద యెన్నాళ్ల నుంచో!

వీర : నాకు మాత్రం యేం తెలుసు గంగా ! ఆమె యెప్పుడైనా ఇట్లా యేడిస్తేనేగా, తెలిసేందుకు. ఇదివరకే యిట్లా యేడుస్తు దంటే వూరుకొనేవాడనా ? అప్పుడే పెళ్ళాడేవాడిని.

ఆ మాటలెంతో బడాయిగా పలికాడు. గంగ పెద్దగా నవ్వింది. ఆమె పలువరుసమీద ఉదయ కిరణాలు జిగాలున మెరిసినాయి.

వీర : ఎందుకూ నవ్వుతావు ? అయితే నేను చెప్పనుపో !

గంగ : చెప్పు, చెప్పు బాగుంది కథ.

వీర : నీవు నవ్వుతావు, చెప్పను.

గంగ : నవ్వనుగా చెప్పు...యేం ధైర్యాం చెప్పావు ?

వీర : నా ముఖాన వీరకుంకం పెట్టితే యీ యుద్ధంలో బ్రతికివస్తానని చెప్పాను.

గంగ : మంచి ధైర్యమే...కుంకం పెట్టిందా ?

వీర : ఆ...యింకోమాటు బ్రతిమాలించుకొని—అప్పుడు ! అప్పుడు, యిల్లా చేత్తో నా ముఖం యెత్తిపట్టి బొట్టుపెట్టింది... అప్పటికీ సిగ్గు పడుతూనే...అబ్బా, అప్పుడెంత బాగుంది గంగా మన పార్వతి.

కిలకిల నవ్వుతూ గంగ అతని మెళ్లో పూలదండ వేసింది.

గంగ : మఱి వొదిలిపెట్టి యెల్లా రాగలిగావు ?

వీర : ఇంతలో మా మామ వచ్చాడు, దయ్యంలాగు ! పార్వతిని విడిచి పారిపోయాను.

గంగ : పోనీ యుద్ధం మానుకోరాదూ ?

వీర : పెండ్లికోసం దేశాన్ని వొదులుకొంటానా యుద్ధం చెయ్యకుండా?

ఆ దేశభక్తిచూస్తే వినయుడు జ్ఞప్తికివచ్చాడు. ఆమె మనస్సు ఉడికింది. లోలోపల క్షణం బాధపడి.

గంగ : మంచిదే వీరా, ముఖం యిట్లా తిప్పు. బొట్టుపెడతా ?

తన ముఖం గంగవైపుకు కుదురుగా తిప్పాడు. గంగ గోవిందం పెడుతూంటే మళ్లీ నెమ్మదిగా పలికాడు.

వీర : గంగా, నన్ను రక్షిస్తే తన కోడెదూడను కానుకిస్తానని మొక్కిందట పరమశివునకు మన పార్వతి.

అతని ముఖం అట్లాగే ఎత్తిపట్టి అతని కళ్ళవంక చూసింది.

వీర : నిజమే గంగా, చేతిలో చెయ్యేసి మరీ చెప్పింది నా తో పార్వతి, నీవుకూడా మొక్కవూ వినయుడికోసం!

ఆ మాటతో ఆమె ముఖం నల్లబడింది. ఎంత ప్రయత్నించినా ఆమె ముఖంలో నవ్వులు వినిపించవు ఆమె తిరిగి బొట్టుదిద్దుతూ.

గంగ : వినయుని రక్షించమని మన శైవులుకోంతే, మన పరమశివుడు సంతోషించడు వీరా! ఒకవేళ కోరినా నా ప్రార్థన లాయనకు వినిపించవు. వినయుడు జైనుడుకాడా.

వీర : అయితే, వినయునికి వీరకుంకం పెట్టవూ - గంధం పుయ్యవూ.

గంగ మళ్ళీ అతనిముఖంవంక చూసింది. ఆమె గొంతులో గుటకలు చప్పుడైనాయి. ఆమె దుఃఖం మింగుకోంది.

గంగ : నీవు కలగంటున్నావు వీరా! నే నాతని చెల్లెలనని చెప్పుకొనే దుకైనా మన మతం ఒప్పుకోదు. నేను వినయునికి వీర మర్యాద చెయ్యటమే మన మతాల కిష్టమైనట్లైతే లోకంలో యీ కలహాలు, యీ యుద్ధాలు ఉండనే ఉండవుగాదా?

వీర : నీవు వినయునికి శుభంకోరటం లోకాని కిష్టమే.

గంగ : లోకాని కేంతెలుసు, వట్టిమూర్ఖం! సర్వజ్ఞులైన మత గురువు లున్నారు. వాళ్ళ శాసనా లున్నాయి. నేను వినయునికి శుభంకోరిన క్షణంలోనే మతగురువులు మా కమంగళం తల పెట్టుతారు.

కన్నీళ్లు గిఱ్ఱునతిరిగినాయి గంగకు. వీరసోముడు జాలిపడుతూ—

వీర : అయితే వినయుని తనవాడని కలుపుకొనేవా ళ్లెవరున్నారు లోకంలో?

గంగ : ఈ భూదేవితప్ప యింకెవరున్నారు? ఈ మట్టిలో కలిసి పోవలసిందే.

అక్కడవుండలేక దుఃఖంతో తూలుతూ, తూలుతూ నడిచి పోయింది. దుర్గాదేవి గుళ్లో ప్రవేశించింది. దేవి పాదాలమీద బోర్ల పడి వెక్కి వెక్కి యేడ్చింది. కడుపుమంటతో 'అమ్మా అమ్మా' యని అరుస్తూ ఆ పాదాలమీద దొర్లాడింది. వీరసోముడు ప్రక్కనే నిలుచుండి ఆ దుఃఖం చూడలేకపోయినాడు. ఆమె సిప్పుడు వినయుడే ఓదార్చాలె. లేకపోతే ఊరటలేదు. ఆలయప్రాకారం యెదుట తా నెక్కివచ్చిన గుఱ్ఱం గరిగమేస్తోంది. పరుగిడిపోయి దానిమీద వ్రాలాడు.

ఆ వొడ్డునా, యీ వొడ్డునా వెదురుపొదలు, ఆ సన్నని కొండ వాగు పారినంత పొడుగునా దానిపైన పందిరి అల్లుతూనే ఉంటాయి. ఏవో నానారకమైన అడవితీగలు ఆ గడలకు పాకి అన్ని ఋతువుల్లోనూ పుష్పిస్తూనే ఉంటాయి. దుర్గానికిపోయే మార్గసమీపంలో, మరీ ఒక చోట ఆ వెదురు పొదలు చిక్కగా అల్లుకొన్నాయి. దాని క్రింద అక్కడి కక్కడే వొంపులు తిరిగిన వాగులో, ఆ భాగాన్నే అచ్చటి నీరాన్నే తన కాంతి కిరణాలతో స్పృశించి, ఆనందించాలని పగలంతా సూర్యుడెంతో ప్రయత్నిస్తాడు. ఎంతో ఆరాటపడతాడు. ఇటు తూర్పునుంచి తొంగి చూస్తాడు, వీలుండదు. అటు ఆకాశమధ్యంలో నిలిచి, తన సహస్ర కిరణాలతో నలువైపులాబట్టి, ఆ పొదరింటిని పెరుకచూస్తాడు. అది కదలనే కదలదు. మళ్లీ పశ్చిమానికి తిరిగి పారజూస్తాడు, ప్రయోజనం ఉండదు. ఇల్లా చీకటి పడిందాకా పాపం యత్నిస్తూనే ఉంటాడు, సూర్యుడు! అటువంటి పొదరిల్లు. అంతిచక్కని వాగు, విసుగెత్తినా, మనస్సుకు బాధతోచినా, దుఃఖంకలిగినా వినయుడా చల్లనిచోట యేకాకియై వుంటాడు. వీరసోము డచ్చటికి చేరగానే మార్గంలోవున్న వినయుని గుఱ్ఱం తన మిత్రునిచూసి సకిలించింది. వీరసోముడు గుఱ్ఱందిగి వేగంగాపరుగిడి చేరినాడు. వినయుడా పొదరింట్లో కళ్లుమూసుకొని పడుకొన్నాడు. అది నిద్రగాదు, యేదో యోచన. వీరసోముడు మేల్కొల్పినాడు. ఒళ్లువిరుచుకొంటూ.

విన : వీరా, అమ్మా, పార్వతి, అంతా కుశలమేనా?

వీర : అంతా కుశలమే, కాని గంగమాత్రం ఏడుస్తోంది.

విన : ఎందుకూ?

వీర : నాకు తెలీదు. పోయి, ఆమెనే యడుగు.

వినయునిముఖం మరింత వివర్ణమైంది. నిట్టూర్పు విడిచి గుండె బరువు తీర్చుకొన్నాడు. మళ్ళీ ఏమీ మాటాడక తల వాంచుకొన్నాడు. వీరసోమునికి ఓర్పు దప్పి కోపంతో.

వీర : పోతావా, పోవా!

విన : క్షమించు వీరా. మా యక్క పద్మావతి నన్నాహ్వానించింది. నే నక్కడికి వెళ్ళాలె.

వీర : గంగ యివ్వని ఆహ్వానం నీ కెందుకు? పద పోయి గంగను ఓదార్చు పద!

వీరసోముడు తన్ని లేపాడు వినయుని. లోకమంతా యిల్లాతం తే బాగుండు ననిపించింది!

## ౧౧

ఒక చిన్న పూజామందిరం. దాని మధ్యలో పసుపు పూసిన పీట. ఆ పీటమీద అరూగణ విగ్రహాన్ని, శివలింగాన్ని జతజేసినిల్పింది పద్మావతి. ఆ యిరువురి దేవుళ్ళను యేకకాలంలో పూజించేందుకు పరికరాలన్నీ స్థిరపరిచింది. తన భర్త జటాశంకరుని ప్రీతికోసం ఆ పరమశివుడు-తన తమ్ముడు వినయజిని సంతృప్తికోసం అరూగణుడు. ఏ యధికార శైవుని ఐశ్వర్యభవనంలోనూ అరూగణునికి ప్రవేశంలేదు. నేడు పద్మావతి మాత్రమే సాహసించింది.

పద్మావతి వినయజిని పెదతండ్రి కుమార్తె. ఆమె చిన్నతనం ఆశ్రమంలోనే విద్యలు నేరుస్తూ గడిచింది. జటాశంకరు డాశ్రమ విద్యార్థిగావుండే రోజుల్లో సౌందర్యవతియైన పద్మను ప్రేమించాడు. పద్మావతి జైనకన్య. జటాశంకరుడు శైవుడు. శైవస్త్రీగాని, పురుషుడుగాని జైనమతంలోకి సంస్కరింపబడితే అధికార శైవమతానికి అవమానంతో తల నేలబడుతుందిగాని, ఇతర మతస్తులు తమ మతంలో జేరితే శైవమతం అభ్యంతరం చెప్పదు. పద్మావతి శివదీక్ష పొందింది. జటాశంకరు డామెను వివాహ మాడినాడు. తానొక అధికార మతంలో అడుగుపెట్టినా, సేనాపతిని భర్తగా పొందినా, అనుభవించేందుకు ఐశ్వర్యమున్నా పద్మావతి ఆశ్రమజీవితాన్ని మాత్రం మరిచిపోలేదు. ఆమె తన యింట్లో శివలింగం పూజించి వెలుపల పతిత జైనకోటిని ఉద్ధరిస్తూ ఉంటుంది. ఆమె యెప్పుడూ అన్నయదేవుని అడుగుజాడలలో మాతృభూమికి గొప్పసేవజేసి గొప్పభక్తురాలని కీర్తిపొందింది. తురుష్కుల రెండవదాడిలో జటాశంకరునితో బాటు సేనలనునడిపి శత్రువుల నోడించిన ఆమె శౌర్యంగూర్చి లోకం వీరకథలు పాడింది. ఆ వీరవనిత దేశరక్షణకోసం జాతీయధర్మంస్థాపించేందుకు బహిరంగంగా దేవుళ్ళ

నిద్దరిని ఏకంచేసింది. అయితే జటాశంకరుడు మత దురభిమాన పరుడు. అతడు జాతీయవాదిగాదు. పదవీవ్యామోహం క్రింద అతని స్వమత ధర్మమే అణిగిపోయింది. ఇప్పు డీ భార్యమాత్రం అతని పాదాల క్రింద నలిగిపోదా? భార్యనుంచి పిలుపురాగానే అతడు సైనిక కార్యాలయంలో నుంచి పరుగిడి వచ్చాడు. సహజమైన పత్నీ ప్రేమతో

జటా : పద్మావతీ

పద్మ : ఆ, పతి, యిల్లారండి.

జటా : ఎందుకూ కబురంపావు.

గది గడపలో చేరాడు. పద్మావతి యెదురువచ్చింది.

పద్మా : అదేమిటి అల్లా నలిగిపోయినారు. ఇంకా సైనికులను పరీక్షించటం కాలేదా ?

జటా : పరీక్షించే పనిలేదు పద్మా. ఈ కొత్త సైనికులు జైనులైనా మంచి పరాక్రమవంతులు. ఆ బానిసలు ప్రదర్శించే ధనుర్విద్యచూస్తే కాస్సేపు వాళ్లతో పోరాడబుద్ధేస్తుంది.

పద్మా : రాత్రింబగళ్లు నిద్రలేనుగాబోలు అలిసిపోయి కనుపిస్తున్నారు.

జటా : నిజమేనా!

అద్దంలో తురాయిసర్దుతూ, తన ఠీవిని చూసుకొన్నాడు. అతడు మురిసిపోతూ ఒకమాటు ఒరలోంచి కత్తిలాగి మళ్లీటక్కుమని లోపలికి నొక్కాడు. వెనుకనుంచి పద్మావతి నవ్వింది.

జటా : ఇప్పుడు నన్ను యుద్ధానికిపంపిస్తే యెంత బాగుంటుంది.

పద్మా : ఎందుకు విచారం. మన దేశానికి యుద్ధాలు కరువైపోలేదు.

జటా : సరే, యెందుకుపిలిచావో చెప్పు.

పద్మా : వీర పెండ్లికొడుకయ్యేందుకు వినయుడిక్కడికి వస్తాడు. నే నతనికి వీరగంధం యిచ్చేప్పుడు మీరు దగ్గరవుండాలె.

జటా : నే నెందుకు ? ఆ శివలింగంప్రక్కన ఆ విగ్రహ మేమిటి ?

పద్మా : అరూగణవిగ్రహం. యుద్ధంలో వినయుడికి జయమీయమని అరూగణుని పూజిస్తున్నాను.

జటా: పరమశివుని ప్రక్కన నీచ అరూగణుడా?

ముందుకుదూకి ఒక్క తన్నుతన్నాడు. నేలదొర్లే అరూగణ విగ్రహాన్నియెత్తి పద్మావతి కన్నులకద్దుకొంది.

పద్మా: శాంతించు పతి.

జటా: పరమశివుడు శాంతిస్తాడనేనా, శైవునియింట్లో జినదేవుని పూజలు.

పద్మా: ఈ విశాలప్రపంచంలో యిన్ని జైనదేవాలయాలు, యిన్ని మసీదులుచూసి సహిస్తున్నాడే, మీ ఒక్కరియింట్లో అరూగణుని చూసి సహించలేడూ, పరమశివుడు?

జటా: నీ మూర్ఖానికేనా సమాధానం?

కోపంతో ఆమె కంఠంనొక్కి నేలమీదకు తోసినాడు. అంతటితో తీరక ఆమెను కాలితో తన్నినాడు. పతివ్రత పద్మావతి ఆ తన్నిన పాదం కళ్ళకద్దుకొని,

పద్మా: ఎన్నాళ్ళకు దయవచ్చింది నా భర్త పాదానికి.

జటా: ఇప్పుడు నా భర్తకుకూడా వస్తుంది దయ, ఆ బొమ్మను అవతల పారవెయ్యకపో!

ఆ బొమ్మనట్లాగే యెత్తుకొని నెమ్మదిగా లేచి నిలిచింది.

పద్మా: అరూగణ విగ్రహంమీద మీకుంటే ద్వేషం ఉంటుంది. నేను మాత్రం పరమశివుని నమ్మినట్లే అరూగణునీ నమ్ముతాను.

జటా: ఆ నమ్మకం పెళ్లితోనే వొదిలిపోయింది నీకు.

పద్మా: అయితే నా పూర్వజన్మ మరచిపోలేదన్నమాట. నేను జైన మతంలో పుట్టి పెరిగానుగదా, పెళ్లికిముందు నాలో శివభక్తి, నా మెళ్లో లింగకాయచూసే ప్రేమించారా?

జటా: నీకు శివదీక్ష యిచ్చింతరువాతే, నిన్నీయింట్లోకి తీసుకొని వచ్చాను.

పద్మా: మీ యింట్లో మీ చరణదాసి నయ్యేముందు నే నరూగణునే పూజించేదాన్ని. అరూగణుని పూజిస్తేనే మీరు నాకు భర్తలైనారు.

జటా : నేను పరమశివునికి మ్రొక్కితేనే నీవు నాకు భార్యవైనావు. ఇద్దరికీ ఒక్కమాటే నవ్వువచ్చింది.

పద్మా : అవును సందేహంలేదు. లోకంలో మానవుల పరస్పర ప్రేమను పరమాత్ముడు శివుడైగాని, లేక అహగణుడైగాని, లేక ఖుదాయై గాని శిథిలం చేయడు. శివుడైనా, ఖుదాయైనా ఆ ప్రేమను వృద్ధి చేస్తారు. మన దాంపత్యంలోవున్న రహస్యమే యిది.

జటా : అయితే యింత గొప్ప సంపద, యీ వున్న తాధికారం నాకీ శివదీక్షే ప్రసాదించింది. జైనులు బానిసలు. మఱి నేనో—సేనాపతిని.

పద్మా : శైవమతమంటే సైన్యాధిపత్యమా? అయితే లోకంలో యెన్ని మతాలు లేవు. ఎన్ని మతాలపేర్లతో యెన్ని రాజ్యాలు లేవు. ఎంతమంది సేనాపతులు లేరు?

జటా : నీతో నేను వాదించలేను, చెప్పదలచిందేమో చెప్పు.

పద్మా : కోపంవద్దు. మతానికి దీక్షకు ఐశ్వర్యాధికారాలేనని అర్థం కల్పించి, పరమశివుని పక్షపాత బుద్ధితో, అసత్యభావంతో కళంక మూర్తిని చేస్తున్నారు.

జటా : ఏం చెయ్యమంటావు? జైనపూజారినై నా కొంపలో దరిద్రం పెట్టుకోమంటావా?

పద్మా : నే నావమాట చెప్పను. వినయజినికి మనమీద ద్వేషంలేదు. అతనికి ఆతిథ్యమీయటం తప్పుగాదు.

జటా : అంతా అబద్ధం.

పద్మా : జ్ఞప్తి తెచ్చుకోండి. మీ చరణదాసి నయ్యేందుకు నే నరూగణ పాదాలమీదపడి బోరున నేడుస్తూంటే ఆ రోజుల్లో వినయజిని మిమ్మల్ని తీసుకొనిరాలేదూ.

జటా : అవునవును, నిన్ను వోదార్చమని వాడు బ్రతిమలాడి నన్ను తీసుకొనిపోయినాడు.

పద్మా : అప్పుడు నన్ను లేవదీసి యేమని శపథం చేశావు?

జటా : చెప్పు చెప్పు. ఆ కథ బాగుంటుంది.

పద్మా : మీరు నా కన్నీళ్ళు తుడిచి ఏడవకు పద్మా, జంగాలకు జడిసి నీ ప్రేమను తిరస్కరించటం నా మతం కాదన్నారు. ఎల్లా మరిచి పోయినారు ఆ కథంతా ?

జటా : ఎప్పో మరిచిపోలేదు. అప్పుడేగాదా నిన్ను కౌగలించుకొన్నాను.

పద్మా : అవును. మన ప్రేమ మన కేవిధంగా, జీవసర్వస్వమై, ముక్తి దాయకమై, సుఖదాయకమైందో, అదేవిధంగా వినయుడికి కూడా ఆనందపెట్టింది.

జటా : అవును. వినయుడిని మన పెండ్లికి యెంత ప్రయత్నించాడు? మనమంటే అతని కెంతో ప్రాణం.

పద్మా : ఆ వినయుడిని నా పినతండ్రి కొడుకు. నా తమ్ముడు. మీ మరిది. ఈ మతదీక్ష నిచ్చిన పీఠాధిపతులు క్రోధించి మన యింట్లో దరిద్రం కుప్పలు పెట్టనివ్వండి, అందుకు జడిసి మనం ద్వేషిస్తామా? ప్రతీ ద్వేషాన్వితమైన సంపదకు మారు, ప్రేమాన్వితమైన పరమాత్మనే పొందుదాం. వినయుని ప్రేమిద్దాం !!

జటాశంకరుడు మారుమాట చెప్పలేదు. ఆ ఉపదేశం నచ్చింది గాని, అది శివయోగికి అంగీకారమో కాదో. ఆయన అనుజ్ఞ తీసుకొని తీరాలె. ఆయన ద్వేషించమంటే వినయుడిని ద్వేషిస్తాడు, లేక ప్రేమించమంటే ప్రేమిస్తాడు. అడుగుజవదాటితే, మునుముందు తా నాసించే సర్వసేనాపతి గాలేదు. ఇప్పటి చిన్న సైన్యాధిపత్యం పోతుందేమో ? ఆ భయంతో అక్కడినుంచి లేచిపోయినాడు. 'మనం వినయుని ప్రేమించుదాం' అని హితబోధచేస్తూనే జటాశంకరుని వీథి లోకి సాగనంపింది. కాని సమ్మతిగాని, అసమ్మతిగాని అతడు తెలుప లేదు. ఆమె స్మరించినట్లే, గంగకూడా గుళ్ళో దేవిపాదాల మీదపడి స్మరించి, 'నేను వినయుని ప్రేమిస్తున్నాను భవానీ అమ్మా' అని గంగ ఎంతోసేపు రోదనచేసింది. గడియలతరబడి బోర్లబడి ఎంతో దుఃఖిం చింది. చివరికేదో అస్పష్టమైన ఆవేశం తెప్పలు తెప్పలుగా శరీరంమీద పొర్లిపోయింది. దేవియాజ్ఞ అయిందా? తటాలున లేచి వడివడిగా

వెలుపలికి నడిచింది. ఆమెలో ఒక సంకల్పం లేదు, ఒక నిశ్చయం లేదు. లోకంమీద విరక్తీ లేదు, అనురక్తీ లేదు. ఏంచూస్తోందో, ఏంచేస్తోందో, ఎక్కడికి పోతోందో ఆమెకే తెలీదు. గంగ పిచ్చిదైపోయింది. ఆలయ ప్రాకారద్వారం సమీపించగానే 'భం, భం' అని శంఖాలువూదుతూ అల్లంతదూరాన జంగాలు విరగబాటుతో నడుస్తున్నారు. వారివెంట చాలమంది మనుష్యులున్నారు. సైనికులుగా జేరేందుకు ప్రబోధింపబడినేనా కార్యాలయానికి జంగాలవెంట పోతున్నారు. ఈ బడాయి గంగ చూడాలనే జంగాలు శంఖాలు వూదినారు.

గంగ : సైన్యంలోకి పోకుండా, ఆ వెనుక పరిగెత్తే జనమంతా ఆ జంగాలమీద దూకితే వాళ్ళను చంపేస్తే...

అని గొణిగింది. ఎదుట దగ్గిరలో ఒక ముసలిది పుల్లలేరుతూ -

ముస : ఏమిటి తల్లీ ?

గంగ : ఏమీ లేదు...ఎవరు నీవు ?

ముస : బానిసలం.

గంగ : జైనమతమా !

ముస : అవును.

గంగ : నీ వేం పనిచేస్తావు?

ముస : దొరికితే అడవిలో గడ్డికోస్తా, బట్టీలలో ఇటుకపని చేస్తా... ఇవ్వాళ పనిలేదు.

గంగ : శైవులెవరైనా మీతో కలిసి కూలిచేస్తారా ?

ముస : ఎందుకు చెయ్యరూ.

గంగ : కూలిపనిలో శైవులు నిన్నంటుకొంటారా ?

ముస : అవును. మాచేత బలువెత్తించుకొంటారు, మాకు బలువు లెత్తుతారు. కలిసి మెలిసే ఉంటాము.

" పేదలైన శైవులు, జైనులు కలిసి కూలిపనులలో బలువులు తగ్గించుకొన్నట్లే, వినాయునికి నేనీ భారం యెందుకు తగ్గించకూడదు ?" అని తర్కించుకొంటూ మళ్ళీ వెనుదిరిగి నడిచింది. ఆలయ సమీపంలో

రావిచెట్టుక్రింద రాతిబండ ఉంది. దానిమీద కూర్చుంది. ' వినయుని కీభారం యెందుకు తగ్గించకూడదు ? వినయునిని గూర్చి యెన్నో కలలు గంది. ఆతని కౌగిటిలో కాస్సేపు యిరుక్కొనిపోయింది. చేతులనిండా గంధం తీసుకొని అతని శరీరంమీద అద్దుతూ ముచ్చట తీర్చుకొంది. అతని రొమ్ముమీద గంధంతో తన అరచేతిని అచ్చుగుద్ది ఆనందిస్తూన్నంతలో-పెద్దజంగం తొంగిచూసినట్లు, గుర్తుపిమినట్లు ఆ కల అంతటితో ఆగిపోయింది. ఆవైపుకు క్రోధంతో చూసింది. అక్కడ యెవ్వరూ లేరు. మళ్లీ నిట్టూర్పు, మళ్లీకల, వినయుని మెళ్లో పూలమాల సర్దింది. ఆ దండలోనే తన తలగూడా దూర్చింది. పైకెగ జిమ్మిన పూలు తమ చుట్టూ వానముసురులాగు కురుస్తూంటే, ఆ ముసుకులో యెవ్వరికీ అగుపించకుండా ఆనందించే సమయంలో ఆ మూలనుంచి శంఖం ధ్వనించి పటాలున తమ పుష్పబంధాన్ని తెంచివేసింది. వినయుడు తననుంచి చీలిపోయినాడు. తనయెదుట మతపిశాచం వికటాట్టహాసం చేసింది. గంగ పిడికిళ్లుమూసి క్రోధంతో బుస్సలుకొట్టింది. ఆమె కన్నులు నిప్పులు రాల్చినాయి. ఆ మంటలలో మతపిశాచం భగ్గున మండింది. ఎంతో ఉత్సాహంతో గంగ చెంగున గంతేసింది. వేసిన గంతులోనే వినయుని పాదాలు గన్పించినాయి. అది కలగాదు, నిజమే. ఎదుట వినయుడున్నాడు. ఏం చేస్తుంది. ఏం మర్యాదచేసినా మతంసహిస్తుందా? ఏం చేసేందుకు చేతులాడలేదు. ఏమనేందుకు ఆమె కంఠం బిగుసుకొనిపోయింది. దుఃఖం పొర్లివచ్చింది. రెండు కన్నీటి చుక్కలు అతని పాదాలమీద వ్రాలినాయి, అంతమాత్రమే—అదే వీరపూజ, అదే ప్రేమార్పణ! గిఱ్ఱున వెనుదిరిగి గుళ్లోకి పోతూంటే 'గంగా గంగా' యంటూ వినయుడు పిలిచాడు. గంగ ఆగలేదు. ఆమె గుళ్లో తలుపులు బట్టి నిలిచి వినయునిచూస్తూ.

గంగ : మతం ఒక ధర్మఛత్రంపంకింది. నేను పాలిపోయినా సరే నేనా గొడుగునీడనే వుండాలని మా నాయనగారి ఆజ్ఞ. వారి అనుమతి లేనిదే నీవు నాతో మాట్లాడగూడదు.

దభాలున తలుపులు మూసుకొనిపోయినాయి. ఆమె కాంక్షతో చూసి గుళ్ళో మూతబడింది. ఆ చూపు లామె ప్రాణాలతోసంది బైట పడినాయేమో యేటకొనేందుకు వినయుడు ముందుకు దుమికినాడు. గుళ్లో రోదన వినిపించింది. గుడితలుపులుదగ్గర నిలిచి వినయుడు

విన : గంగా, ధర్మజ్ఞులైన నాయనగారి మాటకు అడుగుదప్పను. నాకు సెలవు. దుఃఖంతో గుండెలు బద్దలుచేసుకోనవద్దు.

వెక్కివెక్కి ఏడ్చే ఏడ్పుకంటే గుళ్లోనుంచి వేరే సమాధానం లేదు. వినయుడు విచారభారంతో నెమ్మదిగా నడిచి ప్రాకారద్వారం సమీపించాడు. ఈ సమయంలో పెద్దజంగం వస్తాడేమో పడేసి తందామని వీరసోము డక్కడే తమ గుఱ్ఱాలదగ్గర నిల్చున్నాడు. ఆ జంగం రాకుడానే అతని మతశాసనం వారి నరికట్టింది. వినయుడు సమీపించగానే,

వీర : ఏమైంది ?

విన : మతమనేది ఛత్రం. ఆ గొడుగు నీడక్రింద పాలిపోతుంది గంగ. మతమనే గొడుగు...గొడుగు...

వినయుడు గుఱ్ఱమెక్కి కూర్చున్నాడు. దాని వెనుక వీర సోముని గుఱ్ఱం నెమ్మదిగా నడుస్తోంది. వినయుని గొంతులో యేదో గాలిపాట గంభీరంగా బయలుదేరింది.

"కలలేనా నా అమృతపు గాథలన్నీ—
ఈ పూవుయే పురుగు కెరగాకపోవునని
పాము పడగా నీడ పదిలపరిచావేల ?
కాల కర్కోటక హాలాహలములోన
కుమిలిపోతున్నాది దేవా — నా పూవు
నా కింక దొరకదా - దేవా ?
ఈ రక్షణలు ప్రీతి యీ పూవుపై నన్ను
వ్రాలనిస్తాయని భ్రాంతి జెందితివేల ?
వైషమ్య జగతి హస్తాహతమై నేను

నేల గూలిన వెనుక దేవా — నా మీద
పూలనే రాల్చునో దేవా ?"

వీరసోముని హృదయంమీద కత్తిగీసినట్లు ఆ గీతం గాయ పరిచింది. ఆ బాధతో గుఱ్ఱాన్ని ఝెళ్ళున గొట్టితే అది చెంగున గెంతి పరుగెత్తింది. వినయుని గుఱ్ఱం దాని వేగంలో అడుగులు గలిపింది. మళ్ళీ పద్మావతి యింటిముందు ఆ గుఱ్ఱాలు నిలిచినాయి. కాని జటాశంకరుడు వాట్లోనే అడ్డుకొన్నాడు. అతడీ విషయంలో శివయోగితో సంప్రదించాడు. అతడేమాత్రం అంగీకరించలేదు సరిగదా, శివలింగంతో సమంగా అరూగణ విగ్రహం ఉంచి పూజించిన పద్మావతిని ఎందుకు క్షమించావని జటాశంకరుని చీవాట్లుపెట్టాడు. ఆ చీవాట్లు తిన్న ముఖంతోనే ఆ గడపలో నిలిచి వినయుడు కన్పించగానే చీదరతో పొమ్మన్నాడు. 'నా యింట్లో జైనులకు వీరమర్యాద జరిగితే, శివునికి మహాద్రోహం ఔతుంది' అన్నాడు.

# ౧౨

ఉదయమైంది. ప్రభాతభేరీ 'జయం జయ'మంటూ దుర్గంలో ధ్వనించింది. దుర్గంలో రెండువేల జైన సైనికులు విష్ణుపురం ప్రయాణ మయ్యేందుకు పదులు పదులుగా వరుసలు నిల్చినారు. ఉదయభానుడు తన యెఱ్ఱని మృదులకాంతులను ఆ సైనికులమీద వసంతం కురి పించాడు. ప్రవేశించీ ప్రవేశించగానే అక్కడ వందలకొలది సూర్యులు తన యెదుట వెలసినట్లే, ధర్మోద్దీపితమైన సేనాముఖమండలాలు ప్రతాప రుద్రుని ఆశ్చర్యబరచినాయి. ఆయన ఉత్సాహంతో సైనికులను చూసి పలికినాడు.

ప్రతా: మీ యిష్టదేవతలు తమ ధర్మహస్తాల్లో యశోకిరీటాలు బట్టు కొని మిమ్ము యుద్ధక్షేత్రంలోకి ఆహ్వానిస్తున్నారు. వాటిని ధరించేం దుకు మీ తేజోముఖాలే అర్హతకలిగినాయి. ఓ సైనవీరులారా, మీ పరాక్రమం నే నెరుగనిది గాదు. వరుసగా పదేండ్లలో ఢిల్లీ సింహాసనంమీద వెలిగి యారిన మహమ్మదీయ వంశదీపికలు, తమ నల్లని క్రీనీడక్రింద మన దేశాన్ని అంధకారమయం చేసేందుకు ఎన్నిమారులు యత్నించినాయి? కాని, మన స్వాతంత్ర్యవీరుల ప్రచండశౌర్యతేజంలో అవి గుడ్డిదీపాలై పోయి నాయి. ఆ తేజస్సు యీ దుర్గంలో లీనమయ్యేవుంది. ఈ కోట గోడలను ఖడ్గాలతో కొట్టిచూస్తే ఆ క్షాత్రతేజం తళుక్కుమంటుంది. ఈ నేలను కత్తులతో తవ్విచూస్తే, వీరరక్తం ఊటలూరుతుంది. రాజ్యలోభంతో పిచ్చియెత్తిన అల్లూఫ్‌ఖానునకు యీ శౌర్య మహిమ ఎల్లా తెలుస్తుంది? మీ ప్రతాప ఝంఝామారుతం అతడు వెలిగించిన దీపాన్ని ఆర్పివేయుగాక!

శరీరం పులకరించేట్లు జంగాలు శంఖాలు పూరించారు. భూమి గజగజలాడేట్లు భేరులు మ్రోతలెత్తినాయి. సైన్యం, పయనమైంది. వెంటనే జంగాలు, ఆ వెంటనే జైన, వైష్ణవ మతగురువులు, ఆ వెంట పండితులు, ఆ వెనుక చారణులు—వేదాలు, వీరగాథలు గానంచేస్తూ నడుస్తున్నారు. నాలుగడుగులు సాగనంపి, అన్నయదేవ, ప్రతాపరుద్ర దేవు లిరువురూ నిలిచిపోయినారు. క్రింద లక్షలకొలది ప్రజలతో నిండి రాజవీథి క్రిక్కిరిసిపోయింది. పైన మేడలమీద, మిద్దెలమీద పుణ్యాం గనలు క్రిక్కిరిసియున్నారు. సైనికులు ప్రవేశించగానే విజయ కోలా హలం మిన్నుముట్టింది. పైన పుణ్యాంగనల మంగళ హస్తాలనుంచి మధుర కంకణ ధ్వనులను గలుపుకొని కుంకం, పూలు, అక్షితలు జల జలా వర్షిస్తున్నాయి. అక్కడక్కడ వృద్ధమాతలు తమ వాకిళ్ళముందు ఉత్సాహంతో నడిచేసేనావాహనానికి మంగళారతు లెత్తినారు. రాజ వీథి సుగంధంతో పరిమళిస్తోంది. సైనికులు పూలతో నిండుతున్నారు. అక్షితలతో పచ్చబడుతున్నారు. ఇన్ని జరుగుతున్నా ఆ వేడుకలో యేమో కొరత కనుపిస్తూన్నట్లే, ఒక మేడమీద నిలిచి గంగ బిక్క బోయి చూస్తోంది. తాను చేయని లోటేనేమో? తన ప్రక్కన పుణ్యాంగన లందరి కన్నులూ ఆనందపరిచే పండుగ ఆమె కన్నులకు కన్పించటంలేదు. పూర్వపు జైనులే, శైవ దురాధికారంతో బాధపడే ఆ బానిస జైనులే మతభేదంతో మాటిమాటికి భగ్నమనోరథుడై నిరు త్సాహపడిన ఆ బానిసనాయకుడే, నిన్నటి వినయుడే - ముఖంలో కళ దప్పి నిరాశతో నిండి - దుఃఖితుడై తన కళ్ళల్లో మెదులుతున్నాడు. ఇంతమంది పుణ్యాంగనలు కలసి చల్లే పుష్పాక్షతలు అతనిమీద పడి నట్లే లేదేం. కుంకపు ముఖం, గుడ్డతో తుడుచుకొని తన యెదుట యెందుకూ చిన్నబోయి నంచున్నాడు. ఆమె బొట్టు దిద్దితేనే గాని తనకు తీరదేమో! ఆమెకోసం అతని మనస్సు యెంత తపిస్తోందో? యుద్ధంలో జయించివస్తాడా? లేక తనకే సుఖమూ లేకుండాజేసిన మతలోకంమీద అసహ్యంపుట్టి యుద్ధక్షేత్రంలోనే నిలిచి

పోతాడా? తన మెడమీద మెరిసే శత్రువుని ఖడ్గానికి తన ఖడ్గం అడ్డు పెడతాడా లేక తన మెడనే అప్పగిస్తాడా? గంగమీద కోపంతో ఆత్మ హత్య చేసుకుంటాడేమో—ఇంక కనుపించడేమో 'ఏడీ వినయుడు' ఆ కోలహాంలో ఆ ప్రశ్న యెవ్వరికీ వినిపించలేదు. క్రిందకు అటూ యిటూ పారచూసింది. 'ఏడీ వినయుడు?—సేనాపతి వినయుడేడి— ఏమో యెవ్వరూ పలుకలేదు. ఆమెకు భయమెక్కువైంది. బెంగతో నిలువలేకపోయింది. వినయా యని బిగ్గరగా కేక వేసింది. ఆమె మనస్సు మాత్రమే 'ఓ'యని మారుపలికింది. పిలుస్తున్నాడుగాబోలు వినయుడు వీరకుంకం తెస్మని. మేడ క్రిందకు వడివడిగా మెట్లుదిగి వాకిట్లో నిలిచింది. అక్కడ సేనలు నడుస్తూనే ఉన్నాయి. "ఏడీయా వినయుడు" అని బిగ్గరగా అడిగింది. ఒక సైనికుడు 'ముందని' సమాధానమిచ్చాడు. ముందుకు పరుగెత్తబోయింది, ఎల్లా పరుగెత్తుతుంది? క్రోవకట్టుగా జనం ఒకరినొకరు ఒరుసుకొని ఉన్నారు. చీమదూరేసందు లేదు. బలంగా జనాన్ని నెట్టుకొంటూ సైనికుల ప్రక్కనే పరుగెత్తుతోంది. 'ఏడీ సేనాపతి' 'ముందని' సమాధానం! ఇంకెంతముందో! సైనికుల ప్రక్కనే జనంలో చొచ్చుకొనిపోతోంది. కాల్బలం దాటింది. అశ్విక దళం చేరింది. ఇన్నిగుఱ్ఱాలలో వినయుడెక్కిన గుఱ్ఱమేది? ముందుకు నడిచింది. ఆ తెల్లగుఱ్ఱమేనా? డగ్గుత్తికతో వినయా యని కేక వేసింది. వినయుడే పలికాడు. వినయుని గుర్తించింది. నిజమే, తాననుకున్నట్లే వినయుడు చింతపడినాడు. అతని ముఖమేచూస్తూ గుఱ్ఱంప్రక్క నడువ లేకపోయింది. ఎంతో ఆయాసంతో.

'వినయా'

'ఆఁ గంగా!'

రొప్పుతూ తరువాత మాటేమో చెప్పలేకపోయింది. చేయెత్తి ఆగమని సౌజ్ఞ చేసింది. వినయుడు గుఱ్ఱం నిలిపినాడు. ఆ వెనుక సైన్యం నిలిచింది. వినయుని యెదుట గంగదీనంగా నిలిచింది. ఎంత ఏడ్చిందో. ఆమె కన్నులు వాచినాయి. వినయుడు మనస్సులోనే వ్యధపడినాడు.

గంగ : నీకు అపచారం చేశాను.

విన : ఏమపచారం ?

గంగ : నిన్న నీతో మాట్లాడలేను. నిన్నవమానించాను. బాధ పెట్టాను.

విన : గడియ గడియకు యీ మతలోకాన్ని యెందుకు మరిచిపోతున్నావు గంగా ! నా బాధతీర్చటమే నీకు ముఖ్యమైతే, జైన, శైవలోకాలు నరకబాధకు లోనౌతాయి. ముందు లోకాన్నిచూసి నన్నుచూడు.

గంగ : నీవే నా లోకానివి వినయా ! నన్ను నీతో తీసుకొనిపో యుద్ధంలోకి !

విన : అయితే, విదేశీయులతో ఆగిపోయి యుద్ధం శైవులతోనే చెయ్యమంటున్నావా ? ఇప్పుడంత కలహం పనికిరాదు గంగా ! చూడు జంగాలెల్లా వస్తున్నారో !

సైనికులు నిలిచిపోగానే శివయోగి అనుమానంతో ముందుకు చూశాడు. గంగా వినయులతని కంటబడగానే సహించలేక చాల మంది జంగాలతో వడివడిగా వస్తున్నాడు. రాజవీధిలో సందడిమణగి నిశ్శబ్దంగా ఉంది. ప్రజలు విచిత్రపడి చూస్తున్నారు కాని పద్మావతికి మాత్రం ప్రమాదమని తోచింది. ఆమె క్రిందకు వచ్చి జంగాల ననుసరించింది. వినయుడు హెచ్చరించినా గంగ వారివైపు చూడనేలేదు.

గంగ : పోనీ, యిటుకాస్త వంగి ముఖంపట్టు, బొట్టుదిద్దుతా...

సంతోషంతో వినయుడామె చెప్పినట్లే చేశాడు. భరిణమూత తీసి కుంకం చిటికెబట్టింది. ఎడమ అరచేతిలో అతని ముఖం అందుకొని బొటనవ్రేలితో కుంకం ముఖాన కానిస్తోంది. చటాలునామె చేతులు జంగాలు వెనుకకు గుంజారు. చేతులు వెనక్కు విరిచేశారు. ఆమె మృదుహస్తాలు వాళ్ల చేతుల్లో నలిగిపోతున్నాయి. గంగ గర్జిస్తూ రోషంతో పలికింది.

గంగ : వొదిలేసెయ్యి నన్ను.

శివ : ఏంచేస్తున్నా వికృడ? సిగ్గులేదూ పరమతస్థుని తాకేందుకు?

ఈ ప్రశ్నకు సమాధానమేమో గంగకు తెలుసు. కాని ఆ క్రోధావేశంలో యేమని పలికేందుకు తోచలేదు? పెదవులుమాత్రం శపిస్తూన్నట్టు వొణుకుతున్నాయి. అయితే ఆ మతపిశాచి శాపోహతు డెందుకు కాలేదు? ఇంతకూ చేసిన తపస్సు చాలలేదేమో, విచిత్రంగా చూసే ప్రజలందరూ జంగాలనెందుకు హతం చెయ్యరూ? దిక్కుమాలినదై గంగ వినయుణ్ణి చూసింది. ఆ మండించే చూపులంతలో రక్షణ గోరుతూన్నట్లు దైన్యం నిండినాయి. వినయుడు మాత్రం యేం చేస్తాడు. వీరసోముడు మాత్రం యేం చేస్తాడు. శివయోగి పీఠాధిపతి, రాజు తరువాత రాజంతటి వాడు. ఇంతలో పద్మముదుకు వచ్చి జంగాల చేతుల్లోనుంచి గంగను తన ముందుకు లాక్కొంది. ఆమెను తన రొమ్ముల్లో గుచ్చుకొని ఓదారుస్తూ

పద్మ : పిచ్చితల్లీ, నీ వెనుకే మతభూతం నీ గొంతు నొక్కేందుకు సిద్ధగావుందని తెలీదూ? ఎందుకీ పిచ్చిప్రేమ గంగా. పద యింటికి.

శివ : శుభంతో పోయేపొయే సైన్యాన్ని ఆపింది. బానిస ప్రేమకోసం ఏడుస్తూ నడుస్తూ పోయేపోయే గంగ తటాలున జంగాని కెదురై నిలిచి

గంగ : ఈ ప్రేమకోసం నడిచేనడిచే సైన్యం ఆగిపోయినట్లే గిరున దిరిగే సామ్రాజ్య చక్రం మాత్రం నిలిచిపోదూ! ఈ భగ్నహృదయాలను చూసి లోకం సహించి సంతోషిస్తుందా.

తిరిగి యామె ప్రజలువైపు చేతులుమోడ్చి

గంగ : పరస్పరానురాగబద్ధమై ఆనందించేందుకు మాకు స్వాతంత్ర్యము గల్పించిన యీ మతవైషమ్యాగ్నిలో మాడిపోతుందా లేక యీ తాంత్రిక మతాలను ధ్వంసం చేస్తుందాలోకం?

వీర : గంగా యీ విధంగా లోకాన్నే ప్రశ్నించు, నీ హృదయం లోకానికే యెరిగించు.

సైన్యం నడిచిపోతోంది ముందుకు. వెనుదిరిగి చూడకుండా కన్నులు నులుముకొంటూ గంగ వెనుకకు నడిచింది. ఆమె దైన్యస్థితి ఆ జనసముదాయాన్ని కరిగించిందో లేదో గాయపడినహృదయాన్ని చేతో అదిమిపట్టుకొని నడిచిపోతోంది. శుభాలుధ్వనించే ఓరుగల్లు, అలంకరింపబడిన పురవీధులు, ఆ యుత్సవం-ఆమె కన్నులకన్నీ మాయమై కన్పిస్తున్నాయి. ఆమె మార్గానికి మేడలు, మిద్దెలు అడ్డులేవు. దరీ తెన్నూ లేని యెడారి మధ్యలోపోతున్నట్లే నడుస్తోంది. నడచినడచి నగరం వెలుపల ఒక పెద్దమఱ్ఱిచెట్టు ఉంది. ఊడలుమీదుగా పాకి దాని చిట్టచివర కొమ్మమీద నిలిచింది. అల్లంతదూరాన చీమల బారు వలె సైనికులు నడుస్తున్నారు. వారిని చూడగానే తిరిగి ఆమెలో ఉద్రేకం ప్రబలింది. అక్షతలకోసు, పూలకోను ఆమెవొడి నిండి ఉంది. వాటి నా సైనికులవైపుకు విసరుతూ ఉన్మాదినియై కేకలు పెట్టింది.

"మతాల్ని నాశనం చేసేందుకు పొండి. మానవ కళ్యాణం మత విధ్వంసంలోనే ఉంది. మతాలిని ధ్వంసంచేసి రండి. మతాలను ధ్వంసం చేయండి! ధ్వంసం చేయండి!!"

ఆ సైన్యం ఆమెవైపునకు చూస్తూనే నడుస్తూ, దూరమైంది. అది దూరమైనకొలదీ, ఆ నినాదాలు మరింత బిగ్గరగా ధ్వనించినాయి!!

౧౩

ఒక మతం పేరుతో ప్రజావిప్లవం విజృంభించి, ఆ విప్లవం జయించి క్రొత్త రాజ్యాన్ని ప్రతిష్ఠించిన ఆ యధికార మతంలోను, అది కల్పించుకొన్న దేవతలలోను విశ్వాసమూ భక్తి యేర్పడిన తరువాతమాట - ఆ రాజమతస్థులు ధర్మపరులైనట్లైతే, మానవులంతా సేవా పరాయణులై క్రమాభివృద్ధిని పొందుతారు. లేక అధికారాన్ని దుర్వినియోగం జేసినట్లయితే ఆ సేవాభావం నశించి, క్రమేణా దాస్యం, దరిద్రం ప్రజలలో పెంపొందుతుంది. ఇప్పుడు వైష్ణవరాజ్య శక్తులు ప్రజలను సేవాపరతంత్రులను చేసేందుకు ప్రోత్సహించటం లేదు, నిర్బంధించటంలేదు. రామదేవవర్మ వైష్ణవమతస్థుడు. అతడు విష్ణుభక్తుడు. ఈ రాజు క్రింది యధికారులంతా, తమ వైష్ణవరాజ్యాన్ని పెద్ద సామ్రాజ్యం చేసేందుకు ఆశపడ్డారు, ఆ దురాశే చివరకు పర మత ద్వేషం క్రింద మారింది. కాకతీయ సామ్రాజ్య సరిహద్దులోనే ఈ చిన్న రాజ్యం ఉంది. ఈ రామరాజ్యానికి శివుడు దేవుడు. శైవ మత ద్వేషం సాకుగా తీసుకొని, శైవమతాన్ని శైవులను రూపు మాపేందుకు కంకణంగట్టుకొన్నాడు, ఎన్నో కుట్రలు పన్నినాడు. అప్పుడప్పుడు సరిహద్దు నిర్ణయంలో కలతలుపెంచి కాకతీయ చక్ర వర్తితో కలహానికి కాలుదువ్వినాడు. ఒకటిరెండు యుద్ధాలు గూడా జరిగినాయి. దానివల్ల అమితమైన నష్టంతో అతని ప్రయత్నం నిష్ఫల మైంది. ఇక ప్రతాపునితో పోరాడేశక్తి క్షీణించింది. ఈ మతద్వేషం సఫలం చేసుకొనేందుకు మానవశక్తిలో నమ్మకంలేక దైవబలంమీద ఆధారపడినాడు. కులదేవుడైన మహావిష్ణువు నారాధిస్తే ఆదేవుడు యీ శైవరాజ్యాన్ని నామరూపాలు లేకుండా చేస్తాడని దుర్బుద్ధితో, పూర్వం కంటే యిప్పుడు క్రొత్తదేవాలయాలు నిర్మించాడు. దేశంలో ఆలయాల

సంఖ్య పెచ్చుపెరిగింది. కాకతీయ సామ్రాజ్యంలో యెక్కడెక్కడ జైన బౌద్ధ వైష్ణవదేవాలయాలున్నాయో ఆయా ప్రాంత్యాలలో ప్రజల కేయే వృత్తులు జీవనాధారమో ఆయా వృత్తులు ఆయా దేలవాయధి కారుల పరిశీలనలో వృద్ధిపొందటమే 'శివతత్వ' సారమని ప్రతాప చక్రవర్తి శాసించాడు. కాని రామదేవుని వైష్ణవభక్తి తప్పు మార్గంలో పట్టించారు వైష్ణవ మతగురువులు. విష్ణుదేవుడు భోగపరా యణుడని విశ్వాసం పుట్టించారు. అందుకని ఆ దేవుని భోగంతోనే మెప్పించదలచారు. ఈ మత రాజ్యాలలో ఆలయోద్యోగులు దేవ తార్చకులు మాత్రమే గాక తిరిగి గ్రామోద్యోగులై వ్యవహరించేవారు. ఇప్పుడు వైష్ణవ రాజశాసనం అనుసరించి యీ వైష్ణవోద్యోగులు వివిధవృత్తులవల్ల లభించే శిస్తులతో దేవుడికి నిత్యమూ పెళ్ళిళ్ళకు, పిండివంటలకు, సుఖశయ్యలకు వ్యయం చేస్తున్నారు. సుఖశయ్య అంటే వట్టి పూలపాన్పుమాత్రం గాదు. నిండుయవ్వన స్త్రీ లేనిదే దేవుడు నిద్రించలేడు. వేశ్యలు నృత్యమాడకపోతే దేవుడిక పొద్దుజరగదు. ఈ భోగాపేక్ష రోజురోజుకు మితిమించింది. అది అమితమైనకొలది వచ్చిన ఆదాయం చాలక వివిధవృత్తుల మీద శిస్తుభారం పెంచారు. అందువల్ల దేవాలయంలో దేవుని చుట్టూ అభివృద్ధిచెందే గౌరవ జీవన వృత్తులు నశించి ఆస్థానం నీచ వ్యభిచారవృత్తితోనే నిండింది. దేవుని పేరుతో యీ విధంగా ఉద్యోగులు భోగిస్తున్నారు. ఈ భోగాలకోసం వైష్ణవ పురోహితులే నీరిదప్పారు. ఆ మతగురువులు, ప్రజలకు పవి త్రంగాదోచే పాదోదకాన్ని డబ్బు కమ్ముకొంటున్నారు.

ఈ పురోహితుల ప్రలోభమే రాజును స్వేచ్ఛాచారుని చేసింది. మతగురువుల యింద్రియ బలహీనతే రాజును అధర్మకాముని చేసింది. అతని స్థితి మరీ అసహ్యమైపోయింది. అతడు విష్ణుదేవుని దశావతారా ల్లోని శృంగార కలలు, విగ్రహాలు చెక్కించి దుర్గంలో అడుగడుగునా ప్రతిష్టించి ఆరాధనలు, ఆరగింపులు చేయిస్తున్నాడు. అతడు సింహా సనం వదలి దేవాలయంలో మిండగత్తెల మధ్య రాత్రింబగళ్ళు కొలువు

దీసుస్తున్నాడు. తప్పద్రాగి స్పృహదప్పేవరకు తందనాలాడుతూ ఉంటాడు. రాత్రింబగళ్లు యిదే భక్తి. ఈ భక్తివల్ల రాజు మిండ పూజార్లై, దుర్గం బూతుకొంపై, రాజ్యం నరకకూపమై, అచ్చటి ప్రజలు మానహాని, ప్రాణహాని, విత్తహానితో దుఃఖితులై పోయినారు. దేశం నిర్వీర్యమైంది. అందుకని అదను చూసుకొని యీ రాజ్యం స్వాధీనం చేసుకొనేందుకు అల్లూఫ్‌ఖాన్ దండెత్తివస్తున్నాడు. భోగాలతో మత్తెక్కిన రాజుకు శత్రుగర్జనలు వినిపించటంలేదు.

ఉదయమైంది. వైష్ణవ స్వాతంత్ర్య రక్షణార్థం ప్రతాపచక్రవర్తి పంపిన జైనసైన్యం విష్ణుపుర దుర్గంచేరి తన శంఖారావాలతో సంచలన కలిగించింది. రాజుమాత్రం చలించలేదు. ఆ నినాదం అతనికి వినిపించనేలేదు. అతడు ఆలయంలో వేశ్యలమధ్య కూర్చుండి దేవతారాధనకోసం తొందరపడుతున్నాడు. వైష్ణవోద్యోగులలో ఒకరొకరికిరువురు నీతివర్తనులు లేకపోలేదు. కృష్ణసేను డొక చిన్నసేనాపతి. ఏరోజుకారోజు శత్రు సమాచారాలను తన ప్రభువుకు విన్నవిస్తూనే ఉన్నాడు. కాని రాజు వినిపించుకోటంలేదు. నేడు జైనసైనికుల రాక వినిపించాడు. అప్పుడొక దేవదాసి రాజుముఖాన పంగనామాలు దిద్దుతోంది. ఆజ్ఞలకోసం చేతులు గట్టుకొని నిల్చున్న కృష్ణసేనునివైపు చూడనైన చూడక, తన రెండుకళ్లు భోగండాని అందానికి అప్పగించి కూర్చున్నాడు. బొట్టు దిద్దటం పూర్తి అయింది.

యువ: ఊ- చూసుకోండి- అద్దంలో- మొహం!

రామ: అద్దమెందుకు? నీ కళ్ళల్లో చూసుకోనియ్యి ... ఏదీ యీ కన్ను పెద్దదిచెయ్యి.

తన రెండు కళ్లూ చేరలంత చేసింది. భుజాలుబట్టి ఆమెను దగ్గరగా వొంచుకొని, ఆమె కళ్ళల్లో తన పాపను చూస్తూ

రామ: భేషు బాగుంది. ఇల్లా ఉండాలె బొట్టంటే! బొట్టు, దేవుడు, రెండూ ఒకటే! యేదీ యీ కన్ను చూపించు!... యిందులోనూ

బాగా నేవుంది. మళ్లీ ఆకన్ను... అదుగో రామదేవుడు. మళ్లీ అది. యిది. అది. ఈ- ఆ...

యువతి తన తలను అటూ యిటూ తిప్పుతూ ఉంటే, ఆమె కళ్ళల్లో తన ముఖబింబం తప్పిపోకుండా, ఆమె తిప్పినంత త్వరగానే తనతలను ఆడిస్తూ చివరకు యిద్దరూ నవ్వారు. ఆ నవ్వుతో అతడు మోహితుడై పోయినాడు. ఆపలేని మోహంతో అతడామెను తన వొళ్లోకి వొంచుకొన్నాడు. ఆమె ముఖంలో ముఖముంచి కళ్ళల్లోకి చూస్తూ—

రామ : మనోహరమైన నీ నేత్రాల్లో నావొక్క అల్పరూపమేగాదు, యీ సృష్టియంతా నీ నేత్రాల్లోనే దాక్కొంది. నీవు విశ్వ మోహినివి. విష్ణుదేవుని అవతారాల్లో నీది జగన్మోహనావతారం! నిన్నెట్లా సేవించను, ఎట్లా తరించను?

దాని ఆయన మెడకు తన రెండుచేతులూ చుట్టబెట్టి అతని ముఖం తన ముఖంమీదకు వొంచుకొనబోతే కృష్ణసేను డపహ్యంతో

కృష్ణ : ప్రభూ!

రామ : ఏం, యింకా యిక్కడే వున్నావా నీవు?

కృ : ఓరుగల్లునుంచి ప్రతాపులవారు సైన్యం పంపించారు. ఆ సేనను దుర్గంలో ఆహ్వానించేందుకు అనుజ్ఞ.

రామ : ప్రతాపరుద్రుడు నా ప్రబలశత్రువు. అతని నాశనంకోసమే మహావిష్ణువును ఉపాసిస్తున్నాను. అతని సైన్యాన్ని ఆహ్వానించి గౌరవిస్తేనే పాపం.

కృ : ఆ వచ్చినసేన శైవులుగాదు. జైనులు.

రామ : అయినా పరమతస్థులు. శత్రురాజ్య సైనికులు. మనం వైష్ణవులం.

కృ : విదేశీయులు మనమీద దండెత్తివస్తున్నారు. వారితో యుద్ధం చేసేందుకు మనకు సేన చాలదు. ప్రతాపచక్రవర్తి సహాయం ఎందుకు తిరస్కరించటం?

రామ : ఎందుకో తెలీదూ; ఆ విదేశీయులతోనే ప్రతాపరుద్రుని నాశనంచేయిస్తా. తురకాళ్ళ కాళ్ళతో వాళ్ళ శివుని తొక్కిస్తా.

కృ : శైవమతంమీద ద్వేషంతో మీరు విదేశీయులస్నేహం కోరితే, ఆ తురకలు మనరాజ్యం అపహరించరూ ?

రామ : ఎందు కపహరిస్తారు ? కృష్ణసేనా నీవు విష్ణుభక్తుడవేనా ?

కృ : అవును ప్రభూ.

రామ : మహావిష్ణు వేలే యీ రాజ్యంలో పరమతస్థుడు ప్రవేశిస్తాడని నీకు భయమెందుకు ?

కృ : ప్రభూ ...

రామ : మరేమీ వినేందుకు తీరికలేదు. ఆ జైనులను దుర్గంలో అడుగు పెట్టనివ్వను.

కృ : ఆ వచ్చిన జైనులను దుర్గందగ్గరనుంచి కదలిపోమంటున్నారు.

రామ : అయితే అక్కడే చావనియ్యి. మనరాజ్యంలో గుక్కెడు మంచినీళ్లైనా పుట్టనియ్యను. పో ... భజనచెయ్యి.

కృష్ణసేనుడు విచారంతో వెళ్ళిపోయినాడు. రామదేవుడు విష్ణు విగ్రహంవైపుకు తిరిగి

రామ : శ్రీమన్నారాయణమూర్తీ, ఉద్యోగితో మాట్లాడుతూ ఆగిపోయిన భోగకాలం అల్పమైనా యుగాలబాధ పొందినావేమో తండ్రీ, క్షమించు. రా...భక్తురాలా ! మన ఆరాధన యెక్కడ భంగపడి ఆగిపోయిందో, అక్కడినుంచే తిరిగి ఆరంభించుదాం !

యువతి పూర్వంవలెనే అతనియొడిలో తలజేర్చి పడుకొన్న తర్వాత, రామదేవుడామెముఖాన్ని పెదవులతో స్పృశించి

రామ : ఇదే ఆగిపోయినచోటు ... ఇక్కడనుంచే ఆరంభం ... ఆనందిస్తున్నాడా మహావిష్ణు.

యువ : అవును.

రామ : నాశనంచేస్తాడా ప్రతాపరుద్రుని...శైవమతాన్ని...

'తథాస్తు' అని ప్రవేశించాడు, వైష్ణవ పురోహితుడు. లేచి ఆయనకు నమస్కరించలేక...

రామ : తమ పాదాలే రామదేవుని నెత్తిమీద పెట్టి పావనం చెయ్యండి, గురుదేవా .. అహో... అహో తరించాను; తరించాను. స్వామీ, నాకీవేళ 'స్వస్వరూప సందర్శన' మైంది.

గురు : ఏవిధంగా అయింది ప్రభూ!

రామ : ఈ యువతీ సుందర నేత్రాల్లో ధ్యానముంచి చూడండి... నా స్వరూపం... అదే నా ఆత్మ... అవినాశకరమైన ఆత్మ...

గురు : అవును ప్రభూ నా ఆత్మకూడా నాకు కనపిస్తోంది. అహో యేం భక్తి, యేం భక్తి!!

రామ : సందేహం లేదు. నేటికి వైష్ణవభక్తి ఫలించింది,..చాటించండి నా రాజ్యంలో 'ఆత్మసందర్శన సూత్రాన్ని'! ఆనందించండి... ఆడండి... భక్తులారా పాడండి.

పిచ్చి యానందంతో రాజు నృత్యంచేస్తుంటే తక్కినవా రతని ననుకరించారు. 'ఆరాధన' ఆరంభమైంది.

మతద్వేషంతో వైష్ణవ ప్రభుత్వం శైవసామ్రాజ్య సానుభూతిని నిరాకరించింది. ఆ సామ్రాజ్య సైన్యాన్ని ఆహ్వానించక అగౌరవించింది. కాని వైష్ణవ ప్రభుత్వం అపనీతికరమైన భక్తిని ప్రధానం చేసుకొని అమలుజరిపిన నిరంకుశ రాజ్యాంగ విధానంవల్ల దుఃఖితులైయున్న వైష్ణవ ప్రజాకోటిమాత్రం, యీ సైనికులను తృణీకరించలేదు. శైవ సైన్యం వైష్ణవరాజ సరిహద్దు జేరగానే తమ వొరలలోనుంచి కత్తులు లాగలేదు. తమలోనున్న విజ్ఞానం వైష్ణవ భూమిమీద వెదజల్లినారు. అందువల్ల ధర్మదూతలై యీ సైనికులు తమపై దౌర్జన్య మొనర్ప వచ్చిన శత్రువులుగాక మోక్షప్రదాతలైన దేవతలవలె కన్పించారు. వైష్ణవప్రజలు సంతోషించారు. హృదయపూర్వకంగా ఆహ్వానించి, గౌరవించి ఆ సైనికులను విష్ణుపురంవరకు సాగనంపారు. నిర్వీర్య వైష్ణవ ప్రభుత్వసర్వస్వమును నిర్లక్ష్యంచేసిన వైష్ణవ ప్రజాకోటిమాత్రం తమకు వెన్నెముకగా నిల్చింది. జైనులు నిరుత్సాహపడటంలేదు.

ఆ వచ్చిన రెండువేల జైన సైనికులలో అయిదువందలమంది మాగధ సామ్రాజ్య సైన్యంలోంచి ఏరితెచ్చినవారు. మిగిలిన పదిహేనువేలమంది ఆశ్రమ విద్యార్థులు. పాతికేండ్ల వయస్సు మించక, పద్దెనిమిదేండ్ల పిన్నప్రాయానికి లోబడియున్న యీ విద్యార్థులకు కత్తిసాముమాత్రమే నేర్పి, పశులనుచంపే ఘాతుక మృగాలైపోయే సైనిక శిక్షణమాత్రమే అన్నయదేవుడు ప్రసాదించలేదు. ఆయుధవిద్య ఆత్మ రక్షణకోసం – మఱి ఆత్మవికాసంకోసం, అఖిలశాస్త్రవిద్యలు ప్రసాదించినాడు. అవినీతిపరుడైన వైష్ణవరాజు భోగలాలసుడై శత్రువును ఉపేక్షించాడు అజ్ఞానాంధకారంలో వున్న వైష్ణవ ప్రజలను తన విజ్ఞాన జ్యోతిర్జ్వాలనిచ్చి ఆత్మరక్షణమార్గం చూపించినట్లైతే, వారు తమ ప్రభువును సద్భక్తిపరుని చేయగలుగుతారు. కాబట్టి ఆ దుర్గంచుట్టూ తమ గుడారాలను లేవనెత్తి వర్ణాశ్రమ ధర్మవీరులైన విద్యార్థులు తమ తమ వృత్తుల నన్నిటినీ ప్రదర్శింప నారంభించారు. కొందరు చెట్ల ఆకులతోను, తీగలతోను రకరకాలబట్టలు, చాపలు అందంగా అల్లుతున్నారు. కొందరు ఉలిబట్టి కొయ్యలను చెక్కుతున్నారు. మరికొందరు వివిధలోహాలతో వివిధవస్త్రాలు చేస్తున్నారు. కొందరు మగ్గాలుపెట్టి నేతనేస్తున్నారు. కొందరు శిల్పులైనారు. మరికొందరు చిత్రకారులైనారు. కవులున్నారు, గాయకులున్నారు. ఈ విధంగా వృత్తిధర్మం నెరవేర్చేక్షణంలోనే ఆయా వర్ణస్థులు శాస్త్రచర్చ చేస్తున్నారు. వివిధశాస్త్రాలలో ప్రవీణులైన సేనానులు, తమసేనకు శస్త్రవిద్యలతోబాటు శాస్త్రవిద్యకూడా నేర్పుతున్నారు, వేదాధ్యయనం చేస్తున్నారు. ఈ విధంగా రాజకోటచుట్టూ పరిశ్రమాగారాలు లేర్పడినాయి. అవి ఋష్యాశ్రమాలవలె ఆత్మలను పవిత్రం చేస్తున్నాయి. తమలో ధర్మసంచలనం చేయువచ్చిన ఋషిమూకవలె ఆ సైనికులు వందనీయులైనారు. ఈ సైనికనీతి వైష్ణవప్రజలను అబ్బురపెట్టించింది. సైన్యాలు, యుద్ధాలు, రక్తవాహినులు ఆ ప్రజ లెరుగనివి కావు. కాని, ప్రభువ్యవర్గ ప్రలోభంవల్ల తాము పోగొట్టుకొన్న వర్ణాశ్రమ ధర్మాలనే వారు తమచేతుల కందిస్తున్నారు. ఈ సైనికులు తమ దారిద్ర్య

విముక్తికోసం ఒక క్రొత్తలోకం, అందులో ఒక ధర్మభానుని సృష్టించి నక్షే ఆశపడినారు. కాని ఆలోకంలో ప్రవేశించి ఆ వెలుగులో జీవన సౌఖ్యం పొందేందుకు, తమ ప్రభుత్వం నిరోధిస్తుంది. కాబట్టి ప్రభుత్వాన్నే ధిక్కరించాలె. ఈ విప్లవభావం ప్రజలలో మాత్రమేగాక, ప్రభుత్వోద్యోగులలో చాలమందికి జనించింది. వైష్ణవ సేనాపతులలో ఒకడైన కృష్ణసేనుడు, దుర్గంవిడిచి జైన సేనకడకు వచ్చినాడు. వినయజిని, వీరసోముల సాంగత్యంపొందిన తరువాత అతనికీ వుద్యోగం మీాద అసహ్యాం కలిగింది.

కృ: నా సౌఖ్యంకోసం దేశద్రోహం చేయలేను. నేను మీాతోనే ఉంటాను.

విన: మాతో వుండి?

కృ: విదేశీయులతో పోరాడుతాను.

వీర: నీ వొక్కడవేనా నీ రాజును తిరస్కరించేవాడివి.

కృ: ఇంకా ఒకరిరువురు సేనాను లున్నారు. కొంత సైన్యం గూడా ఉంది.

విన: చూడవచ్చిన వైష్ణవులంతా ఈ యధర్మ రాజ్యం అంగీకరిస్తారా?

కృ: ఈ ప్రభుత్వంమీాద యెంత విరోధముందో మీారే చూస్తున్నారుగా?

వీర: అయితే యీా యుద్ధంలో దిక్కులేని చావెందుకు కోరుతున్నావు? ధర్మంకోసం నీతోబాటు చచ్చేందుకు ఆ ప్రజలను ప్రార్థించు.

విన: ఎందుకు ఆలస్యం కృష్ణసేనా - పోయి ప్రజలను ప్రార్థించు.

కృష్ణసేనుడు అక్కడ వేలకొలది ప్రజలు గుంపుకూడి ఉన్నారు. ఆ మధ్యలో నిలిచి విష్ణుశంఖం పూరించాడు. ప్రజలంతా అతనిచుట్టూ చేరారు.

కృ: ఓ సోదరులారా! ఈ సైనికులు ప్రదర్శించే వర్ణాశ్రమ ధర్మం మీారు కోరుతారా?

ప్రజ : అవును. మా వృత్తులు నశించినాయి. కడుపుకూటి కల్లాడు తున్నాం. ఈ ధర్మం తిరిగివస్తేనే గాని మాకు బ్రతుకు లేదు.

కృ : ఈ ధర్మదేవత మన దుర్గద్వారం దగ్గరకు తనంత తానే నడిచి వచ్చింది. మన ప్రభుత్వంలోని కాహ్వానిస్తేనే యీ ధర్మం మనలో ఉంటుంది. కోట తలుపులు తెరవమని మనరాజు నడగండి.

నిండు ప్రవాహంలో సుడులు దిరిగినట్లు ఎక్కడి ప్రజలక్కడే గిఱ్ఱున తిరిగి దుర్గద్వారం దగ్గిరకు పరుగిడినారు. మబ్బు లురిమినంత గంభీరంగా ప్రజలు నినాదాలుచేస్తూ తలుపులుదట్టి రాజును పిలిచారు. " ఓ దుష్టుడవైన రాజా, మన రాజ్యంలో ధర్మదేవతలు వెలసినారు. నీ సింహాసనం వారి కక్కరలేదు. నీకు ధర్మబుద్ధిని ప్రసాదిస్తారు. తలుపులు తెరిపించు."– శాంతంగా జరిగే భోగారాధనను ఈ యల్లరి భంగపరిచింది. రామదేవుడు సహింపలేకపోయినాడు. అతడు సపరివార సమేతుడై వచ్చి కోట బురుజుమీద నిలిచాడు. ఆయన చేతిలో విష్ణు విగ్రహం, అది ఆనందించేందుకు రెండు ప్రక్కలా నృత్యం చేస్తున్నారు వేశ్యలు—

రామ : ఈ యల్లరేమిటి ! ఇది రాజదుర్గమని తెలుసా ?

ప్రజ : తమ దర్శనంకోసం వచ్చాం, ప్రభూ !

రామ : నా దర్శనం కోసమా, దేవుని దర్శనం కోసమా? ఏం తెచ్చారు దేవుని కోసం? ఏవీ మీ ముడుపులు, తెండి– తెండి డబ్బు...

ఎంతో ఆశపడుతూ అడిగాడు, ప్రజల కడుపు మండిపోయింది, ప్రజలకు! ఒక ముసలిరైతు కోపంతో ప్రజలను నెట్టుకుంటూ ముందుకు వచ్చి

ముస : ఎక్కడుంది డబ్బు, యేం ముడుపు చెల్లిస్తాం? ఈ దేవుని భోగంకోసం నిలువుదోపిళ్ళు యిచ్చాం ! ఇంట్లోఉన్నదంతా ఊడ్చి పెట్టాం ! నమ్మి కొల్చినందుకు నాశనమే గతైంది. పన్ను లెక్కువ వేయించాడు నీతో ! నిన్ను రాక్షసరాజునుచేసి బాధలు పెట్టిస్తు న్నాడు. దేవుని భోగంకోసం భూమిలో పండే పంటంతా శిస్తుల

కిందే గు జేస్తున్నావు. వృత్తులలో తయారయ్యే సరుకంతా, వృత్తి పన్ను క్రిందే చెల్లిపోతోంది మావృత్తులన్నీ మూలబడినాయి. నిష్ట దా్రిద్ర్యులమై పోయినాం! చివరి కేవృత్తీలేక లంజరికమే జీవన వృత్తైది. నీతినీమాలు అన్నీ వొదులుకొని పొట్టకూటికోసం స్త్రీ మానం అంగళ్ళలో అమ్ముతున్నాం! ఇప్పటికీ పొట్టనిండలేదూ నీ దేవుడికి".

ప్రజలంతా : ఇంకా దేవుడికోసం యీ నీచపుబ్రతుకు బ్రతకలేం.

రామ : అయితే ఏం చేస్తారు. మీరు దేవునిభక్తులుగారూ? దాసులు గారూ?

ప్రజలు : అయినాం. దేవుడికీ, నీకూ దాసులమై దాస్యం అనుభవించాం! స్వదేశీదాస్యం చాలక యిప్పుడు విదేశీయదాస్యంకూడా మానెత్తి నెక్కించ దలచావు. మేం ఎవ్వరికీ దాసులముగాము. మేం ధర్మానికే దాసులం! జైనులు ధర్మవీరులు! వారితోగలిసే ధర్మకోసం విదేశీయులతో యుద్ధంచేస్తాం!

రామ : ఓరి జైనపీరుగులు! ఎంతపనిచేశారు? నా ప్రజలకు యుద్ధపు పిచ్చియెత్తించారు. పిచ్చిదయ్యాలు పట్టించారు.

ప్రజలు : లేదు. ఆ జైనులు మాలో ధర్మచైతన్యం కలిగించారు. వారితో కలిసి మేము స్వాతంత్ర్యయుద్ధం చేస్తాం!

రామ యుద్ధం యుద్ధం అంటున్నారు. యుద్ధమంటే ఏమో తెలుసునా? ఆ తురకలకడ పెద్దపెద్ద కత్తులున్నాయి. మనగొంతులు కోస్తారు. దేశం యిప్పుడెంతో సౌఖ్యంగా, శాంతిగా ...

ప్రజ : శాంతిలేదు – దరిద్రంతో అశాంతి యెక్కువైంది. మేము యుద్ధం చేస్తాం!

రామ : ఆ తురకలచేతిలో చస్తే మీకు స్వర్గంకూడా రాదు. మీకు నరకమే గతి!

ప్రజ : మీ పాదాలక్రింద నలిగిపోయేకంటే, మా ప్రాణాలకు నరకం బాధగాదు. మేము యుద్ధంచేస్తాం!

రామదేవవర్మ వాణికిపోతూ కోపంతో గొంతుచించుకొని మాట్లాడెను.

రామ : పొండి, ఆ ప్రతాపుని సైన్యంలో చేరి ఆ జైనులు చచ్చినట్లే చావండి. ఆ ప్రతాపుని మతంలో చేరి, స్మశానంలో పిశుగులై, దయ్యాలై, ... ఓ రంభల్లారా! ఆ ప్రతాపుడు నాశనమయ్యేందుకు దేవుడికి భోగం ... ఆడండి, పాడండి!

బురుజుమీదనుంచి లోనికి దిగిపోయినాడు. తలుపులుమాత్రం తెరవబడలేదు, ధర్మం నిరోధింపబడింది. పట్టరానికోపంతో ప్రజలా తలుపులను ఎగిరెగిరి తంతున్నారు. ప్రజలు పనులు పదులుగావచ్చి కోటతలుపులను తన్ని పగులగొట్టుతున్నారు. ఆ వెనుక సమీపంనుంచి భేరీధ్వని వినవచ్చింది, వినయజినిదగ్గర ఒక గూఢచారి తనగుఱ్ఱాన్ని పరుగు నిలిపాడు.

గూఢ : మహమ్మదీయసైన్యం సమీపించింది. త్వరపడండి. ఆ భేరీ ధ్వనులు — అవే ఆమాట లతడెంతో ఆయాసంతో పలికాడు. ఆలస్యంలేదు. వినయుడు కృష్ణవర్మతో

విన : కృష్ణసేనా, కోటలోకి పోయేందుకు నిన్నెవరైనా నిరోధిస్తారా!

కృ : నిరోధించరు.

విన : అయితే వీరసోముని తీసుకొని నీవు దుర్గంలోకి పో. నీ పలుకుబడిలోఉన్న సేనలు ఉన్నాయిగాదా! వెనుకనుంచి మీ ప్రభుత్వ సైన్యం మామీద దూకపోతే మీరు దాన్ని కోటలోనిరోధించండి!

వీర : అవసరమైతే ప్రభుత్వమే స్వాధీనం చేసుకొంటాం.

విన : మంచిది. ఈ ప్రజలు మీకెక్కువ సహాయపడతారు. వారిని కోటలోకి తీసుకపొండి. ఇప్పు డంతెకలహమే మంచిది.

వీరసోమ కృష్ణవర్మలు వెనుదిరిగి నడుస్తావుంటే

విన : వీరా నన్నొకర్కమారు కౌగలించి పో! యీ యుద్ధంలో మనకు చావో - బ్రతుకో యెవరికి తెలును?

వినయునకు వీరసోములు గాఢాలింగనం చేశారు. కన్నీళ్లు తుడుచుకుంటూనే

వీర: భయంలేదు వినయా, త్వరలోనే నీకు సైన్యంతో సహాయపడతాం.
విన: మెళకువతో కార్యం సాధించు- అదుగో శత్రుసేన.

జైనసైన్యంలోనుంచి రణ నినాదాలు మిన్ను ముట్టినాయి. క్షణంలో సేనలు వ్యూహబద్ధమైనాయి. మరుక్షణంలోనే శత్రువులతో తలపడినారు. పోరు మొదలైంది. కోటకవాటాలను ప్రజలు పగుల గొట్టతూనే ఉన్నారు. కృష్ణవర్మ వీరసోములతో దుర్గంయొక్క దక్షిణ ద్వారం చేరగానే, తన మైత్రికిగోరు ద్వారపాలకులు తలుపులు తెరచి నారు. కొంతిమందిభటులతో తరువాత వారు ప్రధానద్వారం చేరారు. అక్కడి ద్వారపాలకులను భటులు బంధించారు. తలుపులు తెరవగానే ప్రజలు మందలు మందలుగా లోనికి వచ్చారు. వీరసోమ కృష్ణసేనులు ముందు, ఆ వెనుక ప్రజలు విప్లవ నినాదాలు వేస్తూ మరి కొంత ముందుకుపోయినారు. అక్కడ కృష్ణసేనుని సేనాదళముంది. మరి యొక ద్వారంలో ప్రవేశించగానే వస్తోంది రాముదేవుడు పంపిన సేన జైనులను తరిమివేసేందుకు. కృష్ణసేనుడు తనసేనతో ప్రభుత్వసైన్యాన్ని అడ్డినాడు. వీరసోముడు ప్రజానాయకుడై ఆ ముందుకేగ, అచట ఆయుధాగారముంది, దానిని ప్రజలతో పగులగొట్టించినాడు. ప్రజ లాయుధాలు దోచుకొన్నారు. రాజదుర్గమంతా అల్లకల్లోలమైంది. అభివృద్ధి నిరోధకులై, ప్రజా పీడకులై, యే దేశద్రోహులు అధికారంలో వుండి, యీనాడు విదేశీయులకు సహాయపడుతారని అనుమానమో అట్టి ధూర్తుల మందిరాలను ముట్టడించారు. మంత్రులందరిని బంధిం చారు. ప్రధాన దండనాధిపతి యింట్లో కునుకుతున్నాడు. అతనిని యింట్లోఉంచే తాళంవేశారు. ఎందరో ఉద్యోగులను బంధించారు. ఎదిరించిన లోభపరులెందరో హతులైనారు. పిదప రాజును బంధించేం దుకు రాజమందిరం చేరారు. దుర్గంలోంచి వెలుపలికి ఒక రహస్య మార్గం ఉంది. భయంతో ఆ సొరంగంలోదూరి రాజు పారిపోయి నాడు. ప్రభుత్వం ప్రజలకు స్వాధీనమయింది.

బంధితులందరూ ఒక్కచోట ఒక్కమందిరంలోనే చేర్చబడిం తరువాత దుర్గంలో శాంతి యేర్పడింది. తరువాత దుర్గరక్షణకోసం

కోటబురుజులమీద ప్రజలు సాయుధులై నిల్చారు. మరికొందరు ప్రభుత్వసేన నిరోధింపబడినచోట కృష్ణసేనున కండగా నిలిచారు. ఇంత వరకూ సేనాపతులమధ్య సంఘర్షణ జరుగుతూనేవుంది. తిరుగుబాటు మొదలైన మొదటి గడియలలో కృష్ణసేనునకు తద్వ్యతిరేకులకు జరిగిన వాగ్వాదంవల్ల సత్యాగ్రహించి మరికొన్ని సేనాదళాలు అతనిపక్షంలో చేరినాయి. అయినా, ప్రభుత్వపక్షంతో పోరాటం తప్పలేదు. గడియలు గడిచినకొలది ధర్మానికే జయమూ, బలమూ సమకూడుతోంది. ఎటు చూసినా దుర్గమంతటా స్వాతంత్ర్యవీరులతోనే నిండివుంది. అధికారు లకు మత్తుజారింది. పోరిపెనుగులాడినా ప్రయోజనంలేదు. అప్పుడు ఏబదిదళాల సేనాపతులు ప్రజాప్రభుత్వానికి పట్టుబడినారు. అంతటితో అంతఃకలహం ఆగిపోయింది.

అంతఃకలహం సామాన్యమైంది కాదు. ఏండ్లతరబడి యత్నిం చినా సాధ్యంగాని జయం ఒక్కపూటలో సమకూరింది. ఆకాశంలో నడినెత్తిన నిలిచి యీ ప్రజాధర్మవిప్లవం చూసి ఆనందించిం తరువాత సూర్యుడు పశ్చిమానికి జరిగాడు. అప్పుడు నాలుగువేల వైష్ణవసేన ఆ సూర్యునిదిక్కుకే నడిచింది. దుర్గందాటి, దూకులేస్తూపోయి పోరాడే జైనసేనను వెనుకకునెట్టి తాను శత్రువులయెదుట నిలిచింది. రెండువేలమంది జైనులను వెనుకంజవేయించలేక, తానొక్కమారైన ముందుజవేయలేక, అడ్డినచోటనే నిలిచి పదివేల శత్రుసైన్యం పోరాడు తోంది. మతదురభిమానపరులైన అధికారులకు యీ అల్పులు చూపించే అసాధారణ శౌర్యపటిమ అవమానకరంగా ఉన్నా సామాన్య మహమ్మదీయులు మాత్రం లోలోన మెచ్చుకొంటూనేవున్నారు. ఇంత వరకు నిరువురిలోనూ సమరోత్సాహం తగ్గిపోలేదు. కాని, వైష్ణవసేన తలపడగానే శత్రుసేన నిరుత్సాహంతో వెనుకంజవేసింది. ఇంతవరకు రెండువేల జైనసేనతో పోరిపోరి ప్రొద్దుముగిసింది. తమ బలగంలో సగం నశించింది. మదపుటేనుగులవలె తమమీదకురికిన వైష్ణవసేన ఎంత పెద్దది ? ద్విగుణీకృతోత్సాహంతో సేనలు పోరాడినాయి. ఇరు

పక్షాలలోనూ సేనాబలం క్షీణించిపోతోంది. దుర్గంలోనుంచి వచ్చి అనుక్షణం వైష్ణవసేన పెరుగుతోంది - తురకసేన తరిగిపోతోంది. అక్కడ స్వాతంత్ర్యవాయువు బలంగా వీస్తోంది. వైష్ణవసేనాతరంగ పంక్తులు తమమీద అసంఖ్యాకంగా ఎగ్గదూకుతాయో? - లూఫ్‌ఖాన్ భయపడి పారిపోయినాడు. సేనాసమేతుడై అలూఫ్‌ఖాన్ పలాయనుడైనాడు. పారిపోయే శత్రువులను స్వాతంత్ర్యవీరులు తరిమికొట్టారు. వారి సామగ్రినంతా కొల్లగొట్టారు. యుద్ధం ముగిసింది.

## ౧౪

రెండువేల జైనసేన, పదివేల శత్రుసేనతో పోరాడినారు. జయించారు. ఆ తీవ్రయుద్ధంలో చాలమంది హతులైపోయినారు. చావగా బ్రతికినవాళ్లు కొద్దిమందిమాత్రమే. ఆ బ్రతికిన వారిలోనైనా గాయపడని సైనికుడు లేనేలేడు. వీరసోముడు, వినయజిని, సేనానాయకులైనా, స్పృహదప్పేంతటి కత్తిపోట్లు తిన్నారు. ఆగాయాలతోనే, ఆ నెత్తురు గుడ్డలతోనే ఓరుగల్లుకు ప్రయాణమైనారు.

జైనులు బానిసలు. ఆ దాస్యం నుంచి తప్పించుకోనేందుకు వారెల్లప్పుడు శైవులతో పోరాడుతూనే ఉన్నారు. కాని తమజాతి స్వాతంత్ర్యం దృష్టిలో ఉంచుకొనే నేడు పోరాడలేదు. ప్రపంచంలో తమవలెనే ప్రలోభపరుల దురాధికారంవల్ల దుఃఖితులైపోయే అన్ని జాతుల మోక్షంకోసం తాము వీరకంకణం కట్టుకొన్నట్లు ఈ వైష్ణవ స్వాతంత్ర్యయుద్ధం స్పష్టపరిచింది. వారి కత్తులు రుచితెలియక భేషజం కోసం, రక్తంలో యెఱ్ఱబడలేదని మాత్రమే ఆ ధర్మవీరులు తమ గాయాలను మాటిమాటికి చూసుకొని సంతోషిస్తున్నారు. ఎంతో గర్వపడుతున్నారు. వారివలెనే రక్షింపబడిన వైష్ణవజాతి గూడా యీ జాతీయ ధర్మతత్పరులైన యీజైన వీరులను చూసి గర్వపడినారు. ఆ వీరుల నెన్నోవిధాల సత్కరించి, మహోత్సవంతో వైష్ణవులు వీడ్కోలిచ్చారు. వైష్ణవులవలెనే తమ సామ్రాజ్యానికారులైన శైవులుగూడా సత్కరిస్తారా? పాపం, ఆ యమాయిక జైన సైనికులు తమకు దాస్య విమోచన మైనట్లే కలలుగంటూ ఓరుగల్లు నడుస్తున్నారు.

ముందు గాయపడిన సైనికులబండ్లు, ఆ వెనుక ఒక బండిలో వీర సోముడు, వినయుడు అస్వస్థతతో ఒకబండిలో పడున్నారు. వీర సోముడు ఏవోసుఖాలు కలవరస్తూ వినయజినిని చూసి

వీర : అస్తమించినా ఉదయించినా, సూర్యుడు కాంతాలింగనంలోనే కాంతి దేలు తున్నాడు. అరిషడ్వర్గాలను హతం చేస్తున్నాడు.

విన : ఇప్పుడు నీకు పార్వతి జ్ఞప్తి వచ్చిందా ?

వీరసోముడు సిగ్గుతో నవ్వుకొని

వీర : వినయా, ఈమాటు గంగ కౌగలిస్తే యేంచేస్తావు !

విన : అంతటితో అస్తమిస్తాను.

వీర : ఎందుకని ?

విన : నీవు మతాలను మరిచిపోయి, నన్ను గంగను పెండ్లి పీటలమీద కలగంటున్నావు. అవునా ?

వీర : మత గురువులలో యిప్పటికైనా మార్పురాదూ !

విన : మతాలమధ్య ద్వేషాగ్నిని పారించి ఆవొడ్డునగంగను, ఈవొడ్డున నన్ను మతగురువులు నిల్పి ఆనందిస్తున్నారు. ఇంక మేమేకమైతే ఆ యగ్నిలోనే !

వీర : ఒడ్డు దిగితే యీ యగ్నిలో ఒళ్ళు కాలుతుంది. ఒడ్డునుంటే హృదయాలు మాడుతాయి.

వినయజిని నిట్టూర్పు విడిచాడు. హృదయభారం తీర్చుకొనేందుకు వీరసోముడేదో పిచ్చిపాట పాడుతున్నాడు. ఇంతలో బండి ఆగింది ఇరువురు తలయెత్తి చూశారు. జయనినాదాలు చేస్తూ తమ సైనికులు బండ్లలో నుంచి క్రిందకు దూకుతున్నారు. శైవసామ్రాజ్య సైన్యం తమ కెదురు వస్తోంది !

విష్ణుపుర యుద్ధవార్తలు ఎప్పటికప్పుడు ప్రతాపచక్రవర్తి గూఢచారులద్వారా తెలుసుకొంటూనే ఉన్నాడు. ఒకవంక వైష్ణవ ప్రభుత్వాన్ని కూలగదీసి, మఱియొకవంక విదేశీయ సైన్యాన్ని జయించగలిగే విప్లవశక్తిని వైష్ణవ ప్రజాలోకంలో వినయజిని సృష్టిస్తున్నాడని ప్రతాపుడువిని యెంతో ఆనందించాడు. ఆ విప్లవకారుని తమ సామ్రాజ్య రక్షణకోసం బ్రతికించు కొనేందుకు ఆ చక్రవర్తి ఆరాటపడినాడు. జైనుల రాజకీయ విజ్ఞానం శైవమతగురువుల నీర్ష్యపెట్టింది.

చక్రవర్తి యాజ్ఞననుసరించి జటాశంకరుడు సేనలతో విష్ణుపురం పయనమైనాడు. అప్పుడాతని చెవిలో శివయోగి గుహ్యాపదేశం చేశాడుగదా - 'నీవు విష్ణుపురం జేరేసరికి యుద్ధం జరుగుతూవుంటే తురకలను నీవే జయించు, లేక జైనులే జయించినట్లైతే వినయజినిని రాజద్రోహియని బంధించు. లేకపోతే వినయుడు సర్వసేనాపతి అవు తాడు." ఈమాటలనే స్మరించుకొంటూ, జటాశంకరుడు ఇప్పటికి తమ సామ్రాజ్య సరిహద్దు దాటనేలేదు, జయించివచ్చే జైనసైన్యాం యెదు రైంది. ఆతడెక్కువ నిండిపోయినాడు. కాని జైనసేన తను ఆత్మీయు లను చూచినట్లే సంతోషిస్తూ ఎదురైతే, అతడు ధుమధుమలాడుతూ సమీపించాడు. నిష్కపటప్రేమతో వినయజిని జటాశంకరుని కౌగ లించి:—

విన: జయం మనకే బావా!

జటా: దూరంబానిసా

వినయజిని తెల్లబోయినాడు. శైవసేన జైనులను చుట్టిముట్టింది.

జటా: ఈ యుద్ధంలో జయం నీవిద్రోహానికేగాని మాసామ్రాజ్యానికిగాదు. నీవు రాజద్రోహివి!

విన: రాజద్రోహినా?

జటా: అవును. నీవు వైష్ణవ ప్రభుత్వంమీద ప్రజలతో తిరుగుబాటు చేయించావు.

విన: అవును.

జటా: కాబట్టే నీవు ద్రోహివి, నీవిప్పుడు బందీవైనావు.

తిరిగి జైనులవైపు కఠినంగా చూస్తూ:

ఏయ్ బానిసలూ, మీకు ఓరుగల్లులో ప్రవేశం లేదు. ఇక్కడ నుంచే మీ గ్రామాలకు చెద పొండి,

జైనులు: మేమూ విద్రోహులమే. మమ్ముగూడా బంధించు.

వీర: నేనూ విద్రోహినే.

జటా : వినయజిని విద్రోహనాయకుడు. అతను మాత్రమే నిందితుడు. మీ యందరినీ ప్రభుత్వం క్షమించింది. ఆయుధాలు నేలబెట్టి చెదరి పొండి !

వీర : ఏం వినయా ?

జటా : వినయుడు మీ యధికారిగాడు. నేను అధికారిని. చెప్పినట్లు చేయండి.

వీర : వినయుడు మా నాయకుడు.

విన : ఓ సోదరా, ఈ యధికారితో వివాదపడి ప్రయోజనంలేదు, పోయి గ్రామాల్లో మీధర్మం నెరవేర్చండి.

వీరసోముడు తన కత్తిని జటాశంకరుని యెదుట విసరినాడు. తక్కిన జైనులందరూ అతని ననుసరించారు. వినయజినిని వెంటబెట్టుకొని శైవసైన్యం ఓరుగల్లుకు మరలింది.

త్రోవలో జటాశంకరు డేమీ ప్రశ్నించ లేదు. విష్ణుపురంలో అనుసరించిన యుద్ధవిధానంగాని, ఆ రణగాధలుగాని, ఆ ధర్మంగాని గ్రహించదలచినా, నేర్చుకోదలచినా, అతడేవిధంగా వినయజినిని విద్రోహ కళంకంలో నిందితుని చేయలేడు. ఆ జైన బానిసలో ఉత్తమగుణ సంపద, ఉన్నత రాజనీతి, అపారవిజ్ఞానం, అజేయ పరాక్రమ శౌర్య ధనం, అనల్పమైన భక్తి, శ్రద్ధ, సేవ ఇవన్నీ నిండి ఉన్నాయి. ఆ విశేషాలన్నీ తలంచిన కొలది, తానున్న అధికార పదవిలో వినయుని నిల్పి గౌరవించ మనసౌతుంది. అంతేగాదు, ఆ గుణాలన్నీ ఊహించిన కొలది, వినయుడు రాజగద్దె మీదరాజై, దేవతా పీఠంమీద దేవతై, సూర్యుని యెదుట సూర్యుడై, తనలో లోకాన్ని నిండించుకొని, తాను లోకమంతా నిండిన మహాశక్తివలె దర్శనీయుడౌతాడు. ఆ శక్తిని రూపరహితుడైన పరమాత్మగా, విభ్రమంతో, విశ్వాసంతో, ఆనందంతో, సత్కరించి, పూజించి తరించేంతవరకు అతని మనస్సు పాపంచేసినట్లు తపిస్తూనే ఉంటుంది. వినయునిలోవున్న యీ యద్భుత శక్తులు తా నంగీకరిస్తే లోకంలో తన ఆధిక్యతేముంది ? ఆ యాధిక్యతే లేకపోతే, తన

కధికార మెక్కడికి? అప్పుడు వినయునికంటే తక్కువ అధికారం తక్కువ సౌమ్ములభిస్తుంది. జటాశంకరుని మతద్వేషానికి యీ స్వార్థ చింతే కారణం. కాబట్టే వినయు ధీశక్తి దేశాభ్యుదయానికి యెంతటి ఉపయోగకరమైన దైనా స్వార్థంకోసం అతని నరికట్టతాడు. ఆ ధీశక్తి విద్రోహనేరంతో కప్పిబెట్టుతారు. అప్పటికీ అతనివల్ల భయమైతే, మణి త బానిసను జేసితొక్కుపుంచుతారు. ఈయభివృద్ధి నిరోధకులకాళ్ళ క్రింద దుమ్ముగొట్టుకొని మెరిసే యీ మణిని ప్రజలాసించి యేసుకొనబోతారా లేక మతద్వేషంతో విసరిపారేస్తారా?

వనలక్ష్మి ధరించిన వజ్రకిరీటంవలె దూరాన ఓరుగల్లు దుర్గ శిఖరం యెత్తైన అడవిచెట్ల మీదుగా కనుపిస్తోంది. ఆకాశంలో నుంచి సూర్యుడు, పరంపరలుగా విసరికొట్టే బింబాలు మొదట ఆచలువరాతి శిఖరంమీద పగిలి, పిదప లోకంలో వెలుగులు చింది పడుతున్నాయి. శత్రువుల మధ్యలోనే తన తేజోవిభావాన్ని చాటించగోరే శక్తివంత మైన యీ దుర్గం మబ్బు నీడలు కోరుకోదు. ఎదిరిసి చాటుజేస్తూ, తనను కిరణ బాణాలనుంచి రక్షించేందుకు మూగివచ్చే శరన్మేఘాలను ఆ దుర్గం తన పతాకతో విసరివిసరి తోలుతోంది. ఎండలో తళతళ లాడుతోంది. ఓరుగల్లు సమీపిస్తున్నారు. సేనాపతి యాజ్ఞానుసారం సేన నిలిచింది. జటా శంకరుని సమక్షంలో యిరువురు సైనికుల మధ్య వినయజిని నిలిచాడు. సేనాపతి విషపుచూపులు చూస్తూ:

ఇప్పుడు నీవు ఎక్కడికి వెళ్లుతావు.

విన: ఎక్కడికి తీసుకెడితే అక్కడికి...న్యాయవిచారణ యెక్కడ?

జటా: దుర్గంలో ఉన్న న్యాయస్థానంలో శాసన నిందితులు విచారింప బడరు. నీవు అన్నయ దేవుని ఆశ్రమంలో ఉండు. అక్కడే విచారణ!

ఆశ్రమ దిశాముఖుడై వడివడిగా నడిచిపోయే వినయజినిని ఇరువురు సైనికులు వెన్నాడినారు. సేన పయనమై ముందుకుసాగింది. ఆ సేనను విడిచి జటాశంకరుడు, తన గుఱ్ఱాన్ని బాణవేగంతో – దుర్గంలో వ్రాలినాడు. అధికారలోకం అతనిరాకనుచూసి ఆశ్చర్య

పడింది. రాజమందిరంలో ప్రతాపచక్రవర్తికి తన దుశ్చర్యను తానే వినిపించాడు. అవమానభరంతో ఆయన తల నేలకువంగింది.

ప్రతా: ఎందుకు చెదరకొట్టావు జైనులను? వినయు నెందుకు బంధిచావు?

జటా: వైష్ణవ రాజ్యంలో వినయజిని విద్రోహంచేశాడు ప్రభూ!

ప్రతా: అయినా ఆ జైనులు మన సామ్రాజ్యానికి జయమే తెస్తున్నారు గాదా?

జటా: అవును ప్రభూ!

ప్రతా: మనసామ్రాజ్యాన్ని కౌగలించవచ్చిన విజయలక్ష్మిని నీవు కత్తిన బొడిచి చంపావు! జైనులు విద్రోహులని బాధించే అధికారం నీ కెవ్వరిచ్చారు?

'నేనే' నంటూ శివయోగి ప్రతాపుని యెదుట ప్రవేశించాడు. ప్రతాపు డాయనకు నమస్కరించి:

దయచేయండిస్వామీ, యీ సుఖాసనంమీద.

శివ: అక్కర్లేదు నాకు చర్మాసనం ఉంది.

పులిచర్మం నేలమీద పరచుకొని దానిమీద పద్మాసనంవేసి కూర్చున్నాడు.

ప్రతా: నా కాశ్చర్య మౌతోంది స్వామీ! ఏ రాజ్యానికో విద్రోహం చేసి సామ్రాజ్యానికి విజయం చేసారు జైనులు. మీ రా జయ లక్ష్మిని బెదరించి తరిమివేసి యిప్పుడు ప్రజా విద్రోహం సామ్రాజ్యానికి ప్రసాదించారు తమరు. ఈ విధంగా దయదలచినా రేం? జైనులు శైవులు యెంత క్రోధిస్తారో తెలుసునా?

శివ: ఆగండి, నన్నుకొంచెం ధ్యానం చెయ్యనియ్యండి!

తన కుడిముక్కు బొటనవ్రేలితో నొక్కి ఎడమముక్కుతో గాలి పీల్చాడు. మళ్లీ కుడిముక్కులోంచి గాలివదలి నాడు.

శివ: పరమశివా పరమశివా, అయిపోయింది ధ్యానం; ప్రభూ,తురకల మీద పొందిన జయం చూసి సంతోషిస్తున్నారు గాని జైనులు

మీవంటి పాలకులే మరొకనిని తిరస్కరించినారని మీరు గ్రహించలేదు. నా ధ్యానం జైనులలో తిరస్కారభావం మీద నిలిచింది.

ప్రతా: వైష్ణవరాజ్యంలో మన సైనికులు చేయించిన తిరుగుబాటు యుద్ధనీతి అవుతుందిగాని రాజద్రోహ మౌతుందా?

మళ్లీ 'ధ్యానం' నటించి

శివ: నాధ్యానం జైనులలో తిరుగుబాటుమీద నిలిచింది. స్నేహంకోరి రామదేవవర్మకు సహాయపడమని మనము జైనులను పంపినాం! కాని వినయుడు ఆ రాజును రాజ్యంలోనుంచి తరిమివేశాడు. కత్తి బట్టి అల్లూఫ్‌ఖానుని, కత్తివిడిచి రామదేవుని ఎదుర్కొన్నాడు. తురక రాజువలెనే వైష్ణవరాజుగూడా ప్రబల శత్రువా?

ప్రతా: వైష్ణవరాజ్యాన్ని, మన శైవరాజ్యాన్ని రెంటిని అపహరింప వచ్చిన శత్రువునకు సహాయపడ తలచిన రామదేవుడు మనకు శత్రువుకాడా? అంతర్యుద్ధంతో రామదేవుని సాధించి, వినయుడా రాజ్యాన్ని ఆరాజగౌరవాన్ని కాపాడినాడు. కాని అపహరింపలేదు. యీ ధర్మబుద్ధినే రాజద్రోహమని తమరు నిందిస్తున్నారు.

శివయోగి మళ్ళీధ్యానం నటించాడు.

శివ: నా ధ్యానం జైనులలో తిరస్కారంమీద నిలిచింది. తురకలతో పోరాడే ముందు వినయుడు రామదేవుని తిరస్కరించాడు. ఆ తిరస్కార బీజాలే వైష్ణవులలో గూడా నాటినాడు. వైష్ణవులు రాజును తిరస్కరించారు. తరువాతధర్మయుద్ధం జరిగింది తురకలతో అధర్మం, తిరస్కార ధర్మం - జయించింది. ఈ తిరుగుబాటు, ఈ విప్లవం, యీ విప్లవ ధర్మానికేనా మన ప్రజామనో వీథుల్లో విజయోత్సవం చేయగోరేది?

ప్రతా: అవును. రామదేవుడు ప్రలోభి. ఆతని రాజ్యంలో వృత్తి ధర్మం నశించి, వైష్ణవజాతి నిర్వీర్యమైంది. జైనులు మన వృత్తిధర్మం ప్రదర్శించారు. అది ప్రజల నాకర్షించింది. ఆ ధర్మంకోసమే ప్రజలు తిరుగుబాటు చేశారు. విప్లవమంటే యేమో తెలిసిందా యిప్పుడు

ఈ సువిశాలదేశం ఎక్కడ అధర్మపీడితమై అశాంతియుత మౌతుందో అక్కడే ధర్మం ఘోషిస్తూ విప్లవం విజృంభిస్తోంది. అనగా దేశశాంతి కవసరమైన ధర్మాన్ని విప్లవరూపంలో ఈశ్వరుడు అధిపతులకు ప్రసాదిస్తున్నాడు. మీరా విప్లవాన్ని అణచివేశారు. ఈశ్వరుని నెత్తి కాలితో తొక్కారు. ధర్మతిరస్కారం చేశారు. పాపంచేశారు.

శివ: అయితే ఆ విప్లవకారుని శిరస్సున మన శైవకిరీటం ఉంచి, తల మోకరిస్తారా తమరు ?

ప్రతా: ఆ రత్న గర్భితమైన విశాల సముద్రానికి కిరీటం ఎక్కడ ఉంచుతారు? సముద్రానికి పట్టాభిషేకంచేసి తరిస్తాడా మానవుడు; తనను చూసి దూకుతూ వచ్చే తరంగాన్ని కౌగలించి తరిస్తాడుగాని. వినయుడు పెద్దసముద్రం. ఆవిజ్ఞాన నిధికి నా కిరీటంకంటే నాకౌగిలి ఆనందమిస్తుంది. నన్ను వినయుని దగ్గిరకు నడిపించండి.

ప్రతాపు డాశ్రమానికి ప్రయాణమైనాడు!

## ౧౫

వినయుడికి పరాభవం జరిగింది. అతని మనసు గాయపడింది. ఆ బాధతో అతడు కుపితుడైనాడు. ఆ క్రోధంలో తనమీద ప్రతాపుని కున్న అభిమానం, అన్నయదేవుని అనురాగం అన్నీ ఆహుతియై పోయినాయి. త్రోవపొడుగునా శివయోగివంటి కలుషాత్ములతోనే నిండి కనుపిస్తోంది లోకం! ఎంతో అసహ్యంయెంతో క్రోధం! అది తీవ్రమైన కొలది అతని గమనంలో తీవ్రతగూడా హెచ్చింది. దూకులుపెట్టుతూ పోయి ఆశ్రమంలో ప్రవేశించాడు. విద్యార్థులందరూ ప్రచారంబోతే ఆశ్రమమంతా చిన్నబోయింది. కాని వినయుడు రాగానే తిరిగి నిండిచ్చింది. అతని రాకను అప్పుడేచూసి నిలిచినట్లు ఆశ్రమవృక్షాలన్నీ ఆహ్వానమిచ్చాయి. ఎల్లాగ్రహించిందో గంగ హారతి పళ్ళెంపట్టుకొని యెదురుగా వచ్చింది కులుకుతూ వరాల తల్లిలాగున! వినయుని హృదయంలో మండే క్రోధాగ్ని ఆమె గమనించనేలేదు. దెబ్బతిన్న తాచులాగున బుస్సలుకొట్టుతూ సమీపిస్తూంటే అతనికి గంగ హారతియెత్తింది. ఆ యెత్తిన చేయిని కోపంతో తోసివేశాడు. భూదేవి చేసిన జయనాదంవలె పళ్లెంబోర్లపడి ఖంగుమన్నది. పచ్చని భూదేవి పదిచేతులు జాచి అరచేతుల్లో హారతులెత్తినట్లే క్రిందబడి తుంపులైనా కర్పూరం వెలుగుతూనేవుంది. వినయుడీ వింతలు చూడలేదు. పైగా గంగవైపు ఎఱ్ఱగా చూస్తూ అరిచాడు.

విన : నామీదే అభిమానముంటే ఆ హారతిని కాగడాజేసి యీ మత ప్రపంచాన్ని మండించు. బూడిదచెయ్యి!!

గంగ నిర్ఘాంతపోయి చూస్తోంది. అక్కడవున్న మంటపం మీదకు వినయుడు నిచ్చెనమీదుగా యెక్కుతున్నాడు. క్రింద బడిన

పుష్పాక్షతలను కర్పూర దీపాలను పళ్లెలోకి యేరుకొని గంగ నెమ్మదిగా నిచ్చెన యెక్కింది. మంటపం మీద కళ్లుమూసుకొని వినయుడు వెల్లికలా పడుకొని వున్నాడు. అతనికీ వెలుగుకంటే, చీకటే, శూన్యమే బాగుంది గాబోలు, అతను కళ్లుమూసుకొని ఉన్నాడు. శోక దేవతవలె గంగ యెదుట నిలిచింది. ఆమె దీనంగా పలికింది.

గంగ : వినయా

విన : యెందుకని, యెందుకొచ్చావు, మాట్లాడవేం ?

అతడు చిరాకుతో కఠినంగా పలికినా గంగ అసహ్యపడలేదు. దీనంగా నిలుచొని చూస్తోంది. ఆమె భుజంమీద అరచేతిలో నును జెక్కులకానియున్న పళ్ళెంలోకి కన్నీళ్లు ధారగట్టినాయి. అప్పుడందులో వెలిగేజ్యోతి కర్పూర జ్యోతిగాదు, గంగ వెలిగించిన ప్రేమజ్యోతి. వినయుడు కరిగి పోయినాడు. అతనులేచి సమీపించాడు. ఆమెచేయిని గ్రహించి

విన : క్షమించుగంగా, నిన్ను కోపించేందుకు నేనెవణ్ని! నాకే మధికారముంది. నేను బానిసను జైనుడను! నీకు తెలీదు గంగా, లోకంలో యితరుల ప్రేమపొందే పుణ్యం మాకులేదు సరిగదా యితరులను ప్రేమించినా మాకు పాపమే తగులుతుంది. మాయంతటి పాపజాతి లోకంలో లేనేలేదు. అందుకనే మాకు ఉత్తమ స్థానంలేకపోయింది. మేమెవ్వరి పాదాలక్రిందో నలిగి పోవాలె! చాలా పాపం, చాలానీచం!

వినయుడామె పాదాలచెంత కూలబడినాడు.

విన : గంగా యీ జైన శరీరాలను మెట్లుగట్టుకొని నడిచి పోతేనేగాని పరమశివుడు మీ శైవులకు కైలాసద్వారం తెరవనే తెరవడు. నన్ను నీ కాలితో దొక్కి పుణ్యంగట్టుకో! లేకపోతే శివుడు మూడో కన్ను తెరచి నిన్ను భస్మం చేస్తాడు!

గంగ : ఇంత విసిగి పోయినావేం వినయా, ఏం జరిగింది ?

విన : మత న్యాయమే జరిగింది. ఈ శైవసామ్రాజ్యం అలూఫ్‌ఖాన్‌కు స్వాధీనపరచేందుకు నేను రామదేవవర్మకు సహాయ పడలేదు.

తిరుగుబాటుజేసి రామదేవుని, యుద్ధంచేసి అల్లూఫ్‌ఖానును ఓడించి స్వాతంత్ర్యం రక్షించాము. మా జైనులలో దేశభక్తి అపారంగా ఉంది, నీతిలేక జైనజాతి బానిసజాతిగా లేదు. దేశ సంపదమీద శైవులకున్న అనుభవాధికారాలు జైనులకులేక బానిసలమైనాము. యెంతో శ్రమించి శైవుల సంపదకూడబెట్టే మా బానిస శరీరాలకు ప్రతిఫలం తిట్లూ, దెబ్బలే గాదా? శత్రువులనుంచి ఆ సంపద రక్షించేందుకు మా ప్రాణాలు బలిగొన్నా మాకు గౌరవంలేదు. యుద్ధరంగంలో విరిగిపడిన బళ్ళెమూ తెగిపడిన బానిస శరీరమూ యీ రెంటికీ సమానగౌరవమే యిచ్చారు. కాబట్టి మాకు విజయోత్సవ మెందుకూ? జయించి వచ్చే నా యనుచరజైనులను త్రోవలోనే తరిమివేశారు గ్రామాల్లోకి –

గంగ : నీ వెందుకు పోలేదూ? ఇక్కడి కెందుకొచ్చావు?

విన : నా కాయనుజ్ఞ లేదు. నేను వైష్ణవరాజును తిరస్కరించిన రాజద్రోహిని. శైవపీఠం నన్ను ఆజన్మ నరకంలో పడదోస్తుంది.

గంగ : యేమిటీ –

గంగలో యెగిరిపోయే ప్రాణాలే గొంతులో నిల్చి అరచినట్లైంది.

విన : నన్ను న్యాయవిచారణ చేసి ఉరితీసి చంపుతారు గంగా!

సాహసమో, భయమో, క్రోధమో తెలీదుగాని అప్రయత్నంగా ఆపె హృదయం ఆక్రోసించింది.

గంగ : చంపుతారా నిన్ను! ధర్మమూర్తిని చంపేందుకు న్యాయవిచారణా! ధర్మాన్నిచంపే మతన్యాయమా లోకాన్నేలేది? మానప్రాణాలు బలిగొని నిల్చిన ధర్మం మతద్వేషానికి బలైపోతుందా? స్వార్థంకోసం శిథిలమైపోతుందా – మతం స్వార్థం!!

మెల్లిగా వినయుని దగ్గిరనుంచి లేచి నిచ్చెనదిగింది. ఆలయంలో ప్రవేశించింది. ఇంతపెద్ద కర్పూరగడ్డ యిన్ని దూపవత్తులు. పెద్దశంఖం పళ్లెంలో అమర్చుకొని నెత్తిమీద బెట్టుకొంది. ఆవునెయ్యి నిండివున్న కుండ నొకటి చేత్తో బుచ్చుకొని వెలుపలికివచ్చింది. ఆలయ ప్రాంగ

ణాలో ఆ పచ్చని మైదానంలో, ఒకనిర్మల యశస్తేజోబింబం, తన పవిత్ర పాదాలతో అడుగడుగునా అధర్మాన్ని తొక్కివేస్తూ నడుస్తున్నట్లే గంగపోతోంది. గుత్తులుపూసిన తీగలతో సింగారించుకొన్న పెనుతరువు తలవొంచి ఆమెనబ్బురంగా చూస్తోంది. నిజంగా రంగురంగు పూలతో గుప్పిళ్లు నిండించుకొని యీ నూతన తేజస్సును ఆరాధించే విధం యోచించే ప్రత్యక్షప్రకృతిదేవివలె! ఇంతలో కలకలా విజయ గానం చేస్తూ పిట్టలు తీగలమీద వ్రాలేసరికి గంగమీద పూలవాన జలజలా రాలింది. ప్రకృతి గంగను పూజించింది. అప్పుడ స్తమయ సూర్యుడు తన జేగురురంగు కాంతులను గంగమీద వసంతంచల్లినాడు. ఆశ్రమం గడిచింది. ఆ తరువాత చిట్టడవిలో పరుగులెత్తింది.

ఈమూల చిట్టడవిలో మేరినపుల్లలు, కోసినగడ్డి మోపులు కట్టుతున్నారు కొందరుబానిసలు. ఆమూల అగ్నిపర్వతాలవలె వెలుగుతున్నాయి బట్టీలు - అక్కడకూలీలు మట్టిదవ్వి ఇటుకలు పెంకులు చేస్తున్నారు. ఆ వైపున వరిపంట పసుపు తిరిగింది. అక్కడ రైతులున్నారు. ఈ వైపున సమీపంలోనే కూలీలు కొండలు పగుల గొట్టుతున్నారు. ఆ రాళ్లలోనే శిల్పులు తమజీవాలూడ్చి పోస్తున్నారు. ఈ యన్నింటి మధ్య ఒకచోట గంగ తన పరుగు నిలిపింది. యుద్ధమారంభమైంది మొదలు గంగ నిత్యమూ యీచోటికే జేరుతోంది. యిచ్చటే ఆశ్రామికులందరూ సమావేశమౌతారు. అప్పుడు గంగ యుద్ధవార్తలను వారికి కథలు వినిపిస్తుంది. శంఖం పూరించగానే శ్రామికులంతా పరుగిడి వచ్చి ఆమె చుట్టూ మూగినారు.

గంగ: నిన్నటివరకు విష్ణుపుర యుద్ధగాథ యెంతవరకు వినిపిచానో జ్ఞప్తిఉందా!

జనం: ఉన్నది తల్లీ: యుద్ధంలో జయించి రెండువందల సైనులు మాత్రం, బ్రతికివస్తున్నారు. నిన్నటికి కథముగిసింది.

గంగ: తరువాత కథవినండి. ఆ బ్రతికి వచ్చే సైనులను అధికారులు ఓరుగల్లు జేరనీయలేదు. మన మతగురువు వారిని త్రోవలోనే తరిమివేయించాడు.

అంద : ఎందుకని ?

గంగ : వినయజినిమీద రాజద్రోహ నేరం మోపినారు. అతనిని ఉరి తీస్తారు.

అంతా : ఘోరం, ఘోరం! వారుచేసిన ద్రోహమేమిటి ?

గంగ : విప్లవంచేసి వైష్ణవరాజును తరిమినారు గాదా రాజ్యంలో నుంచి, అదేరాజ్య ద్రోహమని మతపీఠం నిర్ణయించింది.

అంతా : జయించివచ్చిన వీరుల కిదేనా బహుమతీ! ఆ విప్లవం మన రాజ్యాలనే రక్షించింది గాదా.

గంగ : కేవలం రాజ్యాలను రక్షించి మాత్రమే ఆ విప్లవం ఆగిపోలేదు అధికారుల ప్రలోభంవల్ల నశించిన వృత్తి ధర్మాన్ని ఆ విప్లవం ఉద్ధరించింది. మీ వంటి శ్రామికుల కాయకష్టం భోగించి బ్రతికే అధికారుల స్వార్థాన్ని ఆ విప్లవం అరికట్టింది. వొట్టి సోమరులైన అధికారులను ఆ విప్లవం తరిమివేసింది. ఈ కథవిని అధికారవర్గంలో ఉన్న స్వార్థపరులు గూడా భయపడి పోయినారు తమ నావిప్లవం తరిమివేస్తుందని! కాబట్టే వారా విప్లవకారులకు విజయోత్సవం చేయలేదు. ఆ వీరులను దేశంలోనుంచి తన్ని తరిమినారు. వినయ జినిని ఉరితీస్తారు. పూర్వం వలెనే మీరు దరిద్రులై, బానిసలై పడి ఉంటారు. ఇంక మీకు ముక్తిలేదు. మీకు నరకమే యిష్టమా!

అంద : కాదు.

గంగ : అన్నలారా, స్వార్థపరులను రక్షించేందుకు మాత్రం జైనులు యుద్ధం చెయ్యలేదు. మీ దారిద్ర్య విమోచనం కోసం వారు విప్లవం చేశారు. మీ కోసం జయించారు. ఆ మీ విజయాన్నే విద్రోహ మని స్వార్థపరులు కళంకపరిచారు, ఈ యవమానం మీరెట్లా భరిస్తు న్నారు ? విప్లవంలో మరణించినవారి యాత్మలు మీ చుట్టూ మూగి చేసేరోదన మీకు వినిపించటంలేదా ? ఆ యాత్మలకు మీరు శాంతి చెయ్యలేరా ?

అందరూ : మేమేమి చెయ్యాలో చెప్పు.

గంగ : మీ విప్లవ విజయానికి మీరే ఉత్సవం చెయ్యండి:
అందరూ : మేము విజయోత్సవం చేస్తాం!

అంతలో ప్రజలలో కొండంతగా ఉద్రేకం ప్రబలింది. అక్కడొక రాళ్ళకుప్పమీద కెగబడి ఒక్కొక్కడు ఒక్కొక్కరాయి యేసుకొన్నారు. వెలిగింపబోయే జ్యోతుల కా రాళ్ళే ప్రమిదలు. పిదప వారులుతీరి ఆశ్రమదిక్కై పరుగిడినారు.

నిర్జనమైయున్న ఆశ్రమంలోని నిశ్శబ్దత తన యేకాకి బ్రతుకును మరింత స్పష్టపరిచి ది. గంగ నడిచిపోయిన దిక్కే రెప్పార్పకచూసే వినయుజిని కళ్ళల్లో తన అరుణరాగాలను నింపి సూర్యుడ స్తమించాడు. తనలో గంగ వెలిగించిన ఆశాజ్యోతిని మతభూతం 'ఉఫ్'న ఊది ఆర్పినట్లు తోచింది. అతడు కష్టంతో కన్నులుమూశాడు. ఇంక తన జీవితాని కంధకారమే గతి. దుఃఖంతో మంటపం దిగినాడు. తన అంతః క్షోభను అనుకరించినట్లు ఆవుదూడ 'అంబా' యని అరిచింది. వినయుడు నెమ్మదిగా దాన్ని సమీపించబోతున్నాడు. ఇంతలో రాజభటుడువచ్చి చక్రవర్తి రాకను తెలియజేశాడు, వినయుడు చకితుడై చూస్తుండగానే, ప్రతాపుడు, అన్నయ దేవుడు, శివయోగి ఇంకెందరో రాజపరివారం అతనిని సమీపిస్తున్నారు. అంతదూరాన్నుంచే అతి వినయంతో చేతులు మోడ్చే వినయునిచూసి.

ప్రతా : ఏమి వినయా, రామదేవు నెదిరించి తెచ్చిన ధర్మవిజయానికి ప్రవేశమీయని మా దుర్గద్వారం తన్ని తెరిచి ఉత్సవం చేస్తావని భ్రమించాను. అక్కడనీ విజయానికి వైష్ణవ శక్తిచలనే, యిక్కడ జైన శైవ శక్తులతో పరిపూర్ణమైన నీ విశ్వరూపం దర్శించి తరించుదామని తపస్సు చేశాను. ఇప్పుడు తపోభంగం చేశావు!

విన : ప్రభూ, తమరొకనాడు విప్లకారులు. పీడాకరులైన రాజులను దండించారు. ధర్మసామ్రాజ్యం స్థాపించారు. కాబట్టే విప్లవాన్ని మీరు ప్రశంసిస్తున్నారు. కాని మతసీరం చాటున దేశసంపదలు భుక్తపరచుకొని భోగించే స్వార్థపరుల కీవిప్లవంలోని యదార్థం యెల్లాగోచరిస్తుంది. నన్ను సర్వసేనాపతిని జేసే యుద్ధనీతి మాత్రమే

మా విప్లవంలో చూసి ఈ బానిస తమపై అధికారి ఔతాడనే శైవులు భయపడినారు. కాబట్టే మేము రాజద్రోహుల మైనాం!

ప్రతా: చేతికందిన వైష్ణవరాజ్యం యెక్కి-యేలే అదృష్టాన్ని కాలదన్నిన స్వార్థత్యాగివి, నీవొక చిన్న సేనాధిష్ఠానం ఆశించి, కళంకితుడ వయ్యేంతటి అల్పుడవని యెవరు నమ్ముతారు వినయా? ఈ యశాశ్వతసంపదకోసం అమ్ముడుబోయే శరీరమూ నీ-శాశ్వత యశస్సంపదకోసం బలియయ్యే శరీరంగాని. నీవు మహాత్యాగివి. నీ స్థానం సేనాపతిత్వం గాదు, లేక చక్రవర్తి కూర్చుండే రత్నసింహాసనం గాదు. ఈ యన్నింటికి వందనీయమైన పరమపదవిలో ఈబ్రహ్మాండ మంతటినీ అజ్ఞానంలో నుంచి తప్పించే విజ్ఞాన తేజోరాశివిగా దర్శితుడవౌతున్నావు. ఇన్నాళ్ళు నిన్నందుకోనేందు కారాటపడి యిప్పుడు నీవు దయతో మాలోకి దిగివస్తే నిన్ను చూసి భయ మెందుకు మాకు? రా, విమల తేజోరాశీ, యిటురా! నడియాకాశంలో అందుకోలేక పొంగి కుంగే సముద్రునిమీద జాలితో పశ్చిమ దిశలో తనలోకి దిగివచ్చే పూర్ణచంద్రుని చూసి మళ్ళీ భయంతో నేలనింకే సముద్రుడెంతటి బుద్ధిహీనుడో నీ తేజస్సును చూసి భయ పడేవా డంతటి బుద్ధిహీనుడు. వినయా నన్ను కౌగలించు, నన్ను నీ శరీరంలో అదిమిపెట్టు, ఇంకా గుచ్చు, యింకా, యింకా.

గద్గదమైన కంఠంలోనుంచి పొంగివచ్చే ఆనందాన్ని గుటకలు మింగుతూ చక్రవర్తి గాఢంగా కౌగలించాడు. అందరి కన్నులా ఆనంద బాష్పాలు జలజలారాలినాయి. వినయునాలింగనంచేసేందుకు అందరూ ఆశతో చేతులు చాచారు. ఇంతలో 'ఓం'మ్మని శంఖారావంచేస్తూ గంగ ప్రాకారద్వారంలో ప్రత్యక్షమైంది. సూర్యునే మకుటంగా ధరించి నట్లు ఆమె శిరోభాగాన మంగళజ్యోతి ప్రకాశిస్తోంది. ఆవెనుక ఎందరో ప్రజలు, ఎన్నోజ్యోతులు అపారంగా కనుపిస్తున్నాయి. మెల్లిగా ఆ జ్యోతిర్గంగ అధికారుల సమక్షంలోకి ప్రవహిస్తోంది. ఆలయప్రాంగణ

మంతా దీపాల సముద్రమైంది. ప్రతాపుడానందభరితుడైనాడు. ఎదుట నిలిచిన గంగను చూసి.

ప్రతా : ఎందుకు చెల్లీ, యీ యల్పులమీద నీ కింత కోపం! నీవెంట అగ్నిప్రవాహా న్నెందుకు తెచ్చావు?

గంగ : ఈ మతప్రపంచాన్ని భస్మంజేసేందుకు.

ప్రతా : శాంతించు చెల్లీ, శాంతించు.

గంగ : నీవు మాయందరినీ శాంతపరుచు, శాంతిస్తాను.

ప్రతాపుడు చేతులెత్తి ప్రజలకు మొక్కుతూ

ప్రతా : ఓ యీశ్వరా నీ రౌద్రరూపం చూసి భరించలేకపోతున్నాం! నిన్నే విధంగా శాంతిపరచగలం?

ప్రజ : ధర్మాం రక్షించు.

ప్రతా : ఓ యీశ్వరా నీ ధర్మమేమి?

ప్రజ : సత్యాం, అహింస, ప్రేమ!

స్మశానంలో కాలేకాలే కళేబరం బరువులేక నిల్చినట్లే, భయంతో కట్టయి నిలిచినాడు శివయోగి అతనిని చూసి.

ప్రతా : స్వామీ! ఈ విప్లవమూర్తికి హారతులిచ్చి మన శైవమత ధర్మం కాపాడమని యీ మహాజనం కోరుతోంది. ఆ హారతిపళ్లెం అందుకోండి.

శివ : నా కిష్టంలేదు. విప్లవకారులకు హారతులిస్తే ప్రమాదమనే నా మతం!

గంగ : ప్రమాదమే నీ మతమైతే, ఇదుగో, ఆ ప్రమాదమే అనుభవించు.

హారతిపళ్లెంతో గంగ చేయి పైకిలేచింది. ఆ వెనుక వేలకొలది చేతులు జ్యోతులెత్తినాయి. దీపాలసముద్రంలో తుపాను వీచసాగింది.

ప్రజ : వినయజీని నీవు ద్రోహంలో కప్పిపెట్టితే, నిన్ని యగ్నులలో తగులబెట్టుతాం, జాగ్రత్త!

ప్రతా : ఈ యాగ్నేయాస్త్రాలు మనమీద పడి మాడ్చివేస్తాయి స్వామీ! త్వరపడండి! త్వరపడండి.

మారుమాట లేదు. భయంలో వణికిపోతూ గంగ చేతుల్లోంచి హారతిపళ్లెం తీసుకొన్నాడు. చక్రవర్తి హస్తాల్లో స్నేహబద్ధుడైయున్న వినయజీకి జేగంట వాయిస్తూ శివయోగి హారతిచ్చాడు. జయ నినాదాలు మిన్నుముట్టినాయి. ప్రజా భుజస్కంధం వినయజీనికి సింహాసనమైంది. పురవీధులలోకి విజయోత్సవం సాగింది. గ్రామాల లోకి తరుముబడిన వీరసోముడు మొదలైనవారు వేలకొలది గ్రామస్తులతో నలుదిక్కులనుంచి చేరినారు. వీరోత్సవంలో తెల్లవారింది.

## ౧౬

విష్ణుపురంలో యెత్తిన పరుగు వైష్ణవరాజ్య సరిహద్దు దాటిందాకా నిలుపలేదు. తమ దేవఘుడ సామ్రాజ్యంలో ఒక అరణ్యం చేరి, అలూఫ్‌ఖాన్ అక్కడ ఆయాసం తీర్చుకొంటున్నారు. అక్కడ సమీప గ్రామస్తులు అన్న సామగ్రిని పంపి తమ యువరాజుయందు భక్తి చూపించారు. ఇక్కడే రెండురోజులవరకు విశ్రాంతి తీసుకోనేందుకు నిశ్చయించాడు.

ఢిల్లీ సమీప గ్రామంలో రజియాతండ్రి ఒక పేదరైతు. చిన్నప్పటినుంచి పొలంపనులకు రజియా శరీరంకూడా బాగా అభ్యాసపడింది. ఆమెకూడా తండ్రితోబాటు వ్యవసాయంలో కష్టించేది. అలూఫ్‌ఖానుని ప్రేమించి, రజియా యింటిదూరం వచ్చి పది మాసాలైనా, ఆమెలో గ్రామజీవనంమీద ప్రీతి చచ్చిపోలేదు. పంజరంలో పిట్టనుంచినట్లు ఆమె రెక్కలు విరిచి రాజదుర్గంలో బంధించటం యువరాజుకు కష్టమైంది. రాజసాంప్రదాయాన్ననుసరించి రాజదుర్గంలో బంధించబోతే ఆమె జ్వరంతో బాధపడింది. కాబట్టి గ్రామ సాంప్రదాయం నెరవేర్చుకొనేందుకు దుర్గంలోనే నాలుగెకరాల భూమిని సాగుచేయించి అందులో పైరులు వేయించాడు ఇష్టమొచ్చినప్పుడల్లా రజియా ఆ పొలంలోకి ఎగిరిపోయి ఆ కాస్త పైరుగాలితోనే సంతుష్టిపడేది. అంతేగాని రాణులు తిరిగే ఉద్యానవనంలో ఆమె విహరించేందుకు, యిప్పటికీ ఆమెకు తలనొప్పే!

ఇప్పుడు సేనలు నడచిన అరణ్యంప్రక్కనే పెద్దపెద్ద జొన్నపైరులున్నాయి. పట్టు డేరాలు విడిచిపెట్టి రజియా ఆ చేలోకి పి పా పోయి వచ్చింది. అక్కడొక మంచెమీద కూర్చుని కాస్సేపు రిట్టలు

దోలింది. తరువాత లేత పాలకంకులు విరిచి ఊచబియ్యం కొట్టు కొంటోంది. ఆమెను వెతుక్కొంటూ అల్లాఫ్ రహీంతో అక్కడికి చేరాడు. ఏవో రాజకీయవిషయాలు మాట్లాడుతూ అక్కడే రహీంతో యిటూ అటూ తిరుగుతున్నాడు.

అలూ: రామదేవవర్మ సోమరి. పోతే, ప్రతాపరుద్రుని రెండువేల జైనసేన నా మార్గానికడ్డైతే యిల్లా నా కాలితో ఆ కంపను తొలగించవచ్చుననుకొన్నా! కాని విప్లవంతో ఆ రెండువేల జైనులు మనయెదుట రెండులక్షల సైన్యాన్ని సృష్టిస్తారని ఎవరికి తెలుసు... ఓడిపోయినాం.

రహీం: అన్నీ పోగొట్టుకొని, అంతా నష్టపడి, పారిపోయివచ్చాం!

అలూ: అయినా, ప్రాణాలున్నాయిగాదా మనలో.

రహీం: ప్రాణాలుండబట్టే అవమానంగా వుంది యుద్ధంలో ఓడినామని.

అలూ: అవమానమెందుకు? మతంకోసం యుద్ధంచేశామా, మన మతం ఓడిపోయిందని సిగ్గుపడేందుకు? బంగారంకోసం యుద్ధం చేశాం! బాణం గురితప్పితే పారిపోయే లేడిని చూసి వేటగాడు నవ్వుకొంటాడుగాని తన తెలివిమాలినపనికి ఏడువడు. మనంకూడా వేటగాళ్ళమే! ఒకమారు ఓడిపోతే తిరిగి సమయంకోసం ఎదురు చూస్తాం! కాని సిగ్గెందుకు నాకు నవ్వొస్తోంది. హ, హ, హ.

మంచెమీదనుంచి రజియా క్రిందకుదూకి ఆతనియెదుట నిలిచింది. అతని రొమ్ముమీద చెయ్యివేసి

రజి: మళ్ళీ యుద్ధంచేస్తావా నీవు!

అలూ: ఆ, గెలిచేవరకు, చచ్చేవరకు.

రజి: గెలుపు చావూ మధ్య మళ్ళీ ఓడిపోతే నీవు...

అలూ: ఈ యడవుల్లో- ఈ చేలల్లో- ఈ యండల్లో

యేదో పిచ్చిపిచ్చిగా తలవూపుతూ రాగాలుతీస్తూ నడుస్తూంటే రజియా వెనకపాటునుంచి గుప్పెటతో అతని నోరుమూసింది. నోటి నిండా జొన్నలు నింపింది. అతడు తినే పరమాన్నాలు వేరు. ఆ పాలలో ఉన్న చిరుచేదు, ఒగరు అతని జిహ్వాకు గిట్టదు.

రజి: ఏయ్, ఉమ్మేయకు, మింగు.

రహీం: ఆయనను సహించవు.

రజి: హూ– ఎవరికి తెలేదు, ఆయన తండ్రి యీ జొన్న తిన్నదై తే- ఖుస్రూను చంపి యిప్పుడు రాజ్యమేలుతున్నాడు. ఈయన కెందుకు సహించవూ?

వినకపోతే రజియాకు కోపమొస్తుంది తింటే గొంతు దిగదు. ఇంతలో ఒక భటుడు తమవైపుకు వస్తున్నాడు. ఆ వంకమీద అతనికి యెదురుగా దూరంగాపోయి అక్కడ ఉమ్మేశాడు. రాహీంకు కాసిని పెట్టి, తాను తింటూ రజియా మంచె మీదయెక్కి చూస్తోంది.

భటు: ఇక్కడ కొన్ని గ్రామాలున్నాయి. యుద్ధపు పన్ను చెల్లించేందుకు అక్కడి ప్రజలు తిరస్కరించారు. సైన్యంలో చేరమంటే పారిపోయినారు. ఇప్పుడా ప్రజలు మళ్ళీ గ్రామంలోనే ఉన్నారు.

అలూ: నీవు పోయి గుఱ్ఱం తీసుకొనిరా! రెండువందల సైనికులు మాతో వచ్చేందుకు సిద్ధంకమ్మని చెప్పు. త్వరగా!

భటుడు పరుగిడి పోయినాడు. అలూఫ్ యోచనతో నెమ్మదిగా వచ్చి మంచెదగ్గర నిలిచాడు.

అలూ; రజియా, వేటకొస్తావా నాతో.

రజి: యేంవేట?

అలూ: గుఱ్ఱాలమీద ఆడే వేట.

రజి: ఆ సంగతి తెలుసు...కాని నీవు చంపే మృగాల్లో లేళ్లనే చంపుతావా?

అలూ : లేళ్లను చంపను. ఏదో పనికిరాని జంతువులను.

ఇంతలో గుఱ్ఱంవచ్చి నిలిచింది. అలూఫ్ దానిమీద యెక్కి, దానిని మంచెప్రక్కకు నడిపించాడు. మంచెమీదనుంచే రజియా అతని వెనుక గుఱ్ఱంమీద దిగింది. ఆ గుఱ్ఱం పరిగెత్తుతుంటే వెనుకా ముందు రెండువందల అశ్వికదళం త్రోవలో గలిసింది.

ఆ యడవిప్రక్కనే ఆ గ్రామం. సైనికులరాకను చూసి, గ్రామస్థులు రోదనచేస్తూ చెల్లాచెదరులై అడవిలోకి పారిపోతున్నారు. సైనికులు వెంటబడి తరుముతున్నారు. ఆ యడవిలో పారిపోయే ప్రజలను అందినవాళ్ళను అందినట్లే బల్లేలతో పొడిచి చంపుతున్నారు. మృగాలను వేటాడేంతటి కుతూహలంతోనే అలూఫ్ స్వయంగా బల్లెంపెట్టి మనుష్యులను పొడుస్తూంటే రజియా ఆ హత్యలు చూడలేకపోయింది. కళ్లుతిరిగి కెవ్వున కేకేసి పడిపోయింది. ఆమె మూర్ఛపోయింది. అక్కడే చిన్న నీటివాగుంది. రజియాను ఆ నీటిఒడ్డున పడుకోబెట్టి ఉపచారం చేస్తున్నాడు. చాలాసేపటికి ఆమెకు స్పృహవచ్చింది. వేట ముగించి ఆ సైనికులుగూడా తిరిగివస్తున్నారు.

అలూ : ఎందుకింత భయపడ్డావు?

రజి : ఆ వేట నాపివేశావా ?

అలూ : పూర్తిఅయింది. సైనికులు వస్తున్నారు.

రజి : నన్నక్కడికి తీసుకపో.

అలూ : ఎక్కడికి ?

రజి : ఆ మనుష్యులు ఖూనీఅయినచోటికి.

అలూ : ఎందుకు ?

ఎందుకో చెప్పలేదు. నెమ్మదిగా లేచి నడిచింది. ఆ యడవిలో నేలంతా వెతుక్కొంటోంది. ఒక శవం కనుపించింది. ఆ సమీపంలోనే

మఱియొకటి. ఇంకా కొన్ని శరీరాలు, కొన ఊపిరితో, బాధతో నేల దొర్లుతున్నాయి. ప్రాణం వదలిన ఒక ముసలివాని ప్రక్కన రజియా యేడుస్తూ కూర్చుంది. అతని ముఖంలో ముఖంపెట్టి మాటిమాటికి చూస్తోంది. అలూఫ్ విసుగుతో —

అలూ : పదినెల్లయినా, నీ సామాన్య గ్రామజీవనం రాజకీయ దశకు మారకపోయింది. ఎందుకు ఏడుస్తావు ?

రజి : ఇతడు చాలా ముసలివాడు. ఈయన శరీరంమీద తన కిరణాలతో సూర్యు డంకితంచేసిన శ్రమ ఎంత అందంగా కనుపిస్తుందో చూడు. అనుభవించే భాగ్యం వీళ్ళకి లేకపోయినా, పండే పంటలు చూసిన ఆనందం ఈ ముఖంలో కళకళలాడుతోంది. నా తండ్రివలెనే యితడొక పేదరైతు.

అలూ : అయినా యితడు నీ తండ్రికాడు.

రజి : కాకపోయిననా రైతు తెగకు చెందినవాడు. వీళ్లను నిష్కారణంగా యెందుకు చంపావు ?

అలూ : ఈ యుద్ధానికి సైన్యంలో చేరనన్నారు. యుద్ధపు పన్ను యివ్వలేదు.

ఇంతలో ఒక గాయపడినశరీరం హీనస్వరంతో పలికింది. అతడు మహామ్మదీయుడు.

అతడు : నిరుడు వాన కరువులో పంటలు పోయినాయి. ఎట్లా చెల్లిస్తాం పన్నులు ?

అలూ : ఎద్దులాగున్నావు. పోనీ సైన్యంలో చేరకపోయినావ్ ?

అతడు : ఎందుకు చేరాలె నీ సైన్యంలో. ఎందుకు చావాలె యుద్ధంలో ? ఆ యుద్ధంవల్ల ప్రజలకు లాభం ?

అలూ : మూర్ఖా, నీ కేం తెలుసని మాట్లాడుతున్నావు.

రజి : మూర్ఖుడనే చంపేశావు జాలిలేకుండా! అలూఫ్, రజియాను ప్రేమించే అలూఫ్ వేనా యీ హత్యలు చేసేది.

అలూ : మా రాజకీయాలకు వీళ్ల జీవితాలు ఉపయోగించనప్పుడు...

రజి : యుద్ధాలే నీ రాజకీయాలా? వేరొక అభివృద్ధి లేదా? నీ రాజకీయాలు వాళ్ల ముఖాన చావేనా రాసిపెట్టేది? ఎంతఘోరం, ఎంతఘోరం?

అలూ : ఈ సామాన్యులు.

రజి : నా తండ్రిగూడా సామాన్యుడే, సామాన్య పేదరైతే, యుద్ధాలకోసం నా తండ్రి నిట్లాగే పీకిస్తారా రాజులు. ఇట్లాగే చంపేస్తారా!

అలూ : ఇక్కడుంటే నీకు మళ్లీ మూర్ఛవస్తుంది. అక్కడికి పోదాంపద.

మరు నిముసంలోనే డేరా చేరారు. రజియా డేరాలోకి పోలేదు. ఆ డేరా ఒక మఱ్ఱిచెట్టు క్రింద నిలిపిఉంది. రజియా ఆ చెట్టు మాను ఆనుకొని కూర్చుంది. ఎదురుగా పశ్చిమంలో సూర్యుడస్తమించాడు. ఇందాక తాను చూసిన మానవరక్తంవంటి యెఱ్ఱని కాంతులే ఆ మూల అలుముకున్నాయి. ఆ రక్తరేఖలను చూస్తూ రజియా కన్నీళ్లు తుడుచుకొంటోంది. సమీపంలోనే మహ్మదీయ మతగురువు పెద్ద పెద్ద కేక లేస్తూ అల్లాను ప్రార్థిస్తున్నాడు. రజియా అలూఫ్‌ను ప్రశ్నించింది.

రజి : ఆ మౌల్వీచేసే ప్రార్థనలుకూడా రాజకీయాలకోసమేనా?

అలూ : సందేహ మెందుకు?

రజి : ఈ రాజకీయ హత్యలు, యీ మానవరక్తం చూసి అల్లా సంతోషిస్తాడా? అత డంగీకరిస్తాడా?

అలూఫ్ మాట్లాడలేదు. అతడుగూడా ప్రార్థన మొదలుపెట్ట బోతున్నాడు. ఇంతలో ఒక భటుడు వచ్చి అభివాదనంచేశాడు.

అలూ : మళ్ళీ యేం మునిగింది?

భటు : వైష్ణవరాజు తమ శరణ్యంగోరి వచ్చాడు.

అలూ : ఎవరు, రామదేవవర్మేనా?

భటు : చిత్తం!

అలూ : రహీం, ఆ కుక్కను మచ్చికచేసి తీసుకొనిరా!

వెడలిపోయే రహీంవైపు ఆలోచనతో చూస్తూవుంటే, అతని యెదుట రజియా దిగులుతో నిలిచి...

రజి : అలూఫ్, ఇప్పుడు నీ రాజనీతి ఎట్లావుంటుందో చెప్పు చూస్తాను.

అలూ : నా నీతితో నీ కేంపని?

రజి : నిన్నుచూస్తే నాకేమో భయమౌతోంది, చెప్పు.

అలూ : ఏమి చెప్పను!

రజి : వైష్ణవరాజు నీ శత్రువుజేరాడుగదా, అతని నేం చేస్తావు?

అలూ : అతని రాజకీయజీవితం అంతమైపోయినట్లే. ఇంకటినుంచి రాజకీయదృష్టితో అతని జీవితమంత ప్రయోజనమైంది గాదు.

రజి : ఈ లోకంలో ప్రతివస్తువును రాజకీయదృష్టితోనే చూస్తూ, ఉపయోగించినన్నాళ్ళూ ప్రేమించి, లేనినాడు చంపేస్తావు, అంతేనా?

అలూ : రాజకీయస్వభావం నీవు సరిగానే అర్థంచేసుకొన్నావు రజియా.

రజి : అయితే ఢిల్లీ సింహాసనంలోఉన్న గ్యాసుద్దీన్ నీకు తండ్రి ఔతాడా, నీకు సుల్తాను ఔతాడా?

అలూ : ఒకప్పుడు సుల్తానుగూడా ఔతాడు.

రజి : నన్నుగూడా ఆ రాజకీయదృష్టితోనే ప్రేమిస్తున్నావా? ఎన్నాళ్లి ఉపయోగించుకొంటావు నన్ను? ఎప్పుడు చంపేస్తావు?

ఆమె రుద్ధకంఠం అలూఫ్ యిదివరకెన్నడూ వినలేదు. ఆ చీకట్లో ఆమె కళ్లు తళతళ మెరుస్తున్నాయి. ఆమె కోపించిందని గ్రహించినా అతడు లెక్కజేయలేదు, ఏమో విషపునవ్వు నవ్వినాడు.

అలూ : నా విషయంలో నీవు పొరబడినావు రజియా; నేను యువరాజు ననేగదా నన్ను మోహించావు.

రజి : కాదు. నీవొక మానవుడవని జాలిపడ్డాను.

అలూ : ఆశ్చర్యం. నేను మీ వూరిప్రక్క అడవిలో రాజపరివారంతో...

రజి: ఆ పరివారంతో కలిసి నీవు వేటాడేప్పుడు మా చెలికత్తెలు తోలుతూ ఆ వేట చూసేందుకు వచ్చానుగాని, నీ రాజరికం చూసేందుకు రాలేదు. అప్పుడేదో నీవు పలుకరించబోతే నీ రాజరికం చూసి భయపడి పారిపోయాను. తరువాత నీవెన్నో కబుర్లుచేసినా తిరస్కరించాను. ఒకనాటిరాత్రి సామాన్యునివలె నా యింట్లో ప్రవేశించావు. నా తండ్రి ఒక పేదరైతు. ఆ పేదగుడిసెలో నా పాదాలమీద నీవొక భిక్షకునివలె కన్పిస్తే జాలిపడి నీకు ప్రేమ భిక్షను పెట్టాను. స్వర్గతుల్యమైన నా తండ్రి ప్రేమనుసహా త్యజించి నీతో దేవఘడుకు లేచివచ్చాను.

అలూ: దేవఘడ్‌లో తిరిగి యువరాజునైనానని తెలీదూ నీకు.

రజి: అయితే నీ రాజదుర్గంలో నే నెవరి నౌతాను?

అలూ: సామాన్య భారతీయ మహమ్మదీయ స్త్రీవే.

రజి: అప్పుడు నీ రాజనీతి యీ సామాన్య స్త్రీమీద కృత్రిమప్రేమనే చూపిస్తోందా? నన్ను నీచంగా చూస్తున్నావా! నా నీతిని చంపి తిని, నన్ను వొదిలేస్తావా? నన్ను ప్రేమిచవూ, నన్ను పెండ్లాడవూ?

చెంపమీద ఛెళ్ళునగొట్టింది, మీదపడి ముఖమంతా పీకింది, రక్కింది. కక్షతీరక యేడుస్తూ చెట్టుచాటుకు లేచిపోయింది. ఆ యేడుపు సంగీతంవలె సుఖంగా వినిపించిందేమో యువరాజు భూశం లాగున నవ్వుతూ లేచినిలిచాడు. సైన్యవరాజు రహీం తన యెదుట నిలిచినప్పుడుకూడా, ఆ నవ్వులు ధ్వనిస్తూనే ఉన్నాయి. ఇప్పుడు రజియామీదనుంచి యెగిరి ఆతని పరిహాసధ్వనులు సైన్యవరాజుమీద పడినాయి.

రామ: నేనంటే యింత సంతోషమా యువరాజు కడుపుబ్బ నవ్వుతున్నాడు.

రహీం: అవును తామంటే యెంతో అభిమానం!

అలూ : అభిమానమెందుకో తెలుసా? ఇద్దరం పారిపోయివచ్చాం. మనిద్దరికీ చెట్టనీడే గతైంది దయచేయండి.

రామ : అల్లాచేశారు దుర్మార్గ ప్రజలు. వాళ్లల్లో భక్తి నశించింది.

అలూ : నిజమే. ఎప్పుడూ యేదోవిధంగా ప్రభుత్వంమీద తిరుగుబడి అల్లరిచేస్తూనేవుంటారు ప్రజలు. నాకూ విసుగువుట్టింది రాజ్యం మీద. ఏదైనా పల్లెటూళ్లో సామాన్యంగా జీవిస్తే సుఖమనిపిస్తోంది.

రామ : కాదు, కాదు. మనం రాజులం. మనకు భక్తి ప్రధానం. జన సామాన్యానికి సేవప్రధానం. ఆ బండచాకిరిచేసే మూర్ఖులమధ్య మనకు ముక్తిలేదు. మళ్లీరాజ్యంకోసమే మీ యండ జేరేను.

చివాలున రజియా రామదేవునిమీదకు లంఘించింది.

రజి : సామాన్యులమధ్య సేవాభాగ్యంలో నీకు సుఖంలేదూ? ఈ పాదాలక్రింద దుమ్ముగొట్టుకొని బ్రతుకుతావా? నిన్ను బ్రతక నియ్యను.

అలూఫ్‌ఖానుని నడుముక్రింద వ్రేలాడే ఒరలోనుంచి కత్తిలాగి పొడవబోయింది. యువరాజు అడ్డువచ్చి ఆమెచేతిని గట్టిగా పట్టు కొన్నాడు కాని ఆగక ముందుకు చొచ్చుకుపోతోంది. యువరా జామెను కోపంతో త్రోసివేశాడు. ఆమె క్రిందపడింది. ఆవేశంతో రొప్పుతూ కాస్సేపు చూసింది. తరువాత పగబట్టిన తాచువలె పాకిపోయి చెట్టుచాటున కూర్చుంది. వైష్ణవరాజు నిర్ఘాంతపోయిచూస్తూ...

అలూ : మీ మీదగాదు. మీ మతంమీద ద్వేషం!

రామ : ఆహా యింత మతద్వేషమా? ఇంత మత భక్తా? ఈ భక్తు రాలు తమ కేమౌతుంది?

అలూ : మా రాజమహలులో దాసీది...

రామ : వేశ్యా...ఇహి, హె, హె...

రజి : వేశ్యనా...!

"ఔను"- నోరు నొక్కుకొంది. పొర్లివచ్చే దుఃఖం ఆపుకొనే యత్నంతో చీరకొంగు నోట్లో కుక్కుకొంది. ఆపలేక నెత్తిబాదుకొంది.

తాను వేశ్య ననుపించుకోనటం రజియాకు అవమానం. కాని రాజ కీయ న్యాయాన్ననుసరించి ఆ లంజరికం రచరికానికి ప్రాణతుల్యం! రామదేవు డెంతో ఆపేక్షతో యువరాజను చూస్తూ-

రాము: తమకు గొప్ప భక్తులవలె కన్పిస్తున్నారు.

ఇంతలో మౌల్వీ ప్రవేశించాడు. ఆత డలూఫ్‌ను చూసి:

మౌల్వీ: యువరాజు నమాజు చేయలేదు.

అలూ: సమయానికి జ్ఞప్తి తెచ్చారు. నే నిప్పుడే ఆరంభిస్తాను.

మౌల్వీ నిష్క్రమించాడు. రామదేవుడు సమీపించి మీ ప్రార్థనలో దేవునికి మేజువాణీ చేస్తారా.

అలూ: ఇంతవరకు మా మతంలో లేదు. కాని యీ మార్పు అవస రమే...రజియా?

రజి: ఎందుకూ?

అలూ: ఇల్లారా?

రజి: ఎందుకు?

అలూ: నేను నమాజుచేస్తా, నీవు నాట్యమాడు.

రజి: ఏ మహమ్మదీయుడైనా నమాజులో నాట్యం ఒప్పుకోడు.

అలూ: ఇది కొత్తపద్ధతి. లేచి రా?

రజి: నేను రాను. నేను బోగందాన్నికాను.

అలూ: పదిమార్లు శాసించిచెప్పా నీవు బోగందానివని.

రజి: నూరుసార్లు వేడుకొన్నా నేను నీచవృత్తిలో...

అలూ: లాభంలేదు. నీవు నాట్యమాడు.

రజి: నే నాడను.

తిరిగి రహీం ప్రవేశించాడు. అతనివెనుక యిరువురు బోయీలు మేనాను మోస్తున్నారు.

అలూ: అదేంటి రహీం?

రహీం: ఇది రామదేవులవారు యెక్కివచ్చిన మేనా. ఇందులో పండ్లున్నాయి.

రాము: తమకోసమే తెచ్చాను పండ్లు. నేను పారిపోయివస్తూంటే ఒక గ్రామోద్యోగి యీ మేనా, పండ్లు యిచ్చి సహాయపడినాడు.

అలూ: మేనా ఖాళీ చెయ్యండి, యిందులో రజియా కూర్చుంటుంది.

భటులు పండ్లగంపలను వెలుపలికి తీస్తారు. అలూఫ్‌ఖాన్ మేనా వద్ద నిలిచి.

అలూ: ఓ రజియా, నీవీ మేనాలో కూర్చో; నిన్నిక్కడనుంచి పంపించివేస్తా.

రజి: ఎక్కడికి కీ యర్థరాత్రి.

అలూ: ఓరుగల్లు.

రజి: ఎందుకు?

అలూ: అక్కడ శైవమతగురువు శివయోగి ఉన్నాడు. అతను జైన మతద్వేషి! అతని కుపచర్యచేస్తూ, అతనిలో ద్వేషం మరింత పెంచు.

రజియా: ఏమిటీ

అలూ: ఆ మతకలహాలే యెప్పటికైనా విదేశీయులకు జయమిచ్చేవి.

రజియాపాదాల క్రింద భూమి జరిగిపోయిందేమో, ఆమె భయంతో దుఃఖంతో అతని పాదాలదగ్గర, కూలిపోయింది. అలూఫ్ ఆమె చేతిలో యింతడబ్బు మూటపెట్టి

అలూ: అట్లా చూస్తావెందుకు, నీ జీవితాన్ని రాజకీయంగా ఉపయోగిస్తున్నాను.

రజియా: నీ రాజకీయాలు మానహాని చేసేంతటి భయంకరమైనవా అలూ! నిజంగానే నన్ను నీచంలోపడేస్తున్నావా? నన్ను పెండ్లాడవూ?

అలూ: ఇక్క డాఫ్ఘున్‌జాతి రాజ్యమేలుతోంది. నేను ఆఫ్ఘనుని.

రజియా: అయినా మన యిరువురిమతం ఒక్కటే, మహమ్మదీయ మతం!

అలూ: మతమొక్కటైనా జాతివేరు. నీవు భారత మహమ్మదీయ స్త్రీవి, నిన్ను పెండ్లాడి రాణీని చేసుకొనేందుకు.

రజి: నాకు రాణీతనంవద్దు. అది నాయాశగాదు. నీయింట్లో నీ భార్యనై బ్రతికేందుకు అంగీకరించు.

అలూ: నేనైతే అంగీకరిస్తా! కాని నా అఫ్ఘన్‌జాతి అంగీకరించదు. నీ చుట్టరికంవల్ల రాజ్యంలో తమ ఆధిక్యత నశిస్తుందని ఆఫ్ఘనులు భయపడుతారు. నన్ను రాజ్యాధికారంలోనుంచి తరిమివేస్తారు.

రజి: ఆ రాజ్యాన్ని తన్నేసెయ్యి నీ ప్రేమకోసం. నా పవిత్రహృదయ సీమను ఏలుకొందువుగాని.

రజియా అతని పాదాలమీద పడింది. ఇంతలో మాల్కీవారి ప్రక్కన పోతూపోతూ శాంతంగా పలికాడు.

మాల్కీ: నీచులకు చనువివ్వద్దంటే నా మాట విన్నావుగాదు.

అలూ: ఓ రహీం, నాకీ పీడను వొదిలించు.

అలూఫ్ కఠినచిత్తుడు. అతని పాదాలు రజియాను దుమ్ములో దొర్లించివాయి. ఆమె యెంతో రోదన చేసింది, ఎవరికి వినిపిస్తుంది? బలవంతంగా ఆమెను మేనాలో మూసివేశారు. బోయీలు మేనాను అడవిచీకట్లో మంచేశారు. ప్రాణంతో ఆమె శరీరం నీచదాసీవృత్తిలో తొక్కించేకంటే, స్మశానంలో కప్పిస్తే యెంత సుఖించేది? రజియా రోదనమరణ్య రోదనమైంది.

# ౧౮

ఇపుడు వైష్ణవరాజ్యానికి రాజులేడు. ఆ రాజ్యానికి కృష్ణసేనుడే నియంత. ఈ నియంతవంటి ధర్మోత్సాహులైన యువకులే కేంద్రాధికారంలో స్థానంవహించారు. విప్లవంతో స్వాతంత్ర్యం రక్షించుకొన్నారుగాని, అంతఃశత్రువు నశించిపోలేదు. జీవనవృత్తిక్షయమే అక్కడి అంతఃశత్రువు. ఇప్పుడావృత్తులను పునరుద్ధరించాలె. మతపిచ్చిలోనుంచి, మత్తులోనుంచి ప్రజలు మరలి సేవాధర్మంలో నడువగలుగుతారు. ఈ నిర్మాణశక్తి క్షణంలో పెంపొందజాలదు. అడ్డువచ్చే ధర్మద్రోహులను అణగద్రొక్కుతూ, శాంతిభద్రతలను కాపాడుతూ దేశాన్ని సుశోభితం చేయాలంటే కనీసం ఏడాదిగడువైనా కావాలె. నిన్నటికి శత్రువులను తరిమివేశారు. కాని, నేడుదయమయ్యేసరికి ఆ శత్రుబలగం పదింతలై తమ దేశంమీద దాడివెడలుతోందని గూఢచారులు వార్తలు వినిపించారు. ఇప్పుడు దేవగిరినుంచి నూరువేల సైన్యం బయలుదేరింది. మరినూరువేలావెనుక సిద్ధమౌతున్నారు. కాబట్టి, తమ నిర్మాణవిధికి దూరమై యీ నియంతృత్వం నిన్న చేసిన యుద్ధానికే మళ్ళీ నేడు సిద్ధమైంది.

విష్ణుపురంలో సైన్యం తక్కువగా వుంది. కోశాగారంలో డబ్బు లేదు. ఆహారసామగ్రి నిలవలేవు. దుర్గంలో యేం చూడబోయినా లోటే కన్పిస్తోంది. రెండువేలమంది యువకులు కృష్ణసేనుని సమక్షంలో నిలిచారు. శాంతిసైనికులై వారు గ్రామాల్లో స్వాతంత్ర్యసందేశం వినిపించేందుకు నియమింపబడినారు. ఆ యువకులు పల్లెల్లో ధనమూ, ధాన్యం పోగుచేస్తారు. సేనను సమకూరుస్తారు. నెలరోజులవకాశమిస్తే యీపని పూర్తి అవుతుంది. కాని, గడువులేదు. మరిరెండురోజుల్లో మరియొక వార్త. ఒకలక్ష మహమ్మదీయ సేన వైష్ణవరాజ్యం సరి

హద్దులో ప్రవేశించింది. అలూఫ్‌ఖాన్ యీ క్రొత్తసేనను దేవగిరి నుంచి రప్పించి వెనుదిరిగినాడు. మఱి రెండురోజుల్లో విష్ణుపురం ముట్టడిస్తాడు. ఈ రెండురోజుల్లోనే రక్షణ ప్రయత్నం వైష్ణవులకు సాధ్యమౌతుందా ?

ఇరువదివేల సేన దుర్గరక్షణ కేర్పడింది. మఱి పదివేల ప్రజలు సాయుధులై శత్రువుల కెదురేగినారు. ఎదురైన స్వాతంత్ర్య వీరులను శత్రువులు ఊచకోత కోశారు. శత్రువు లెంతో బలవంతులు. వారు నిరాటంకంగా ముందుకు నడిచివస్తున్నారు.

మొన్నటి కీ శత్రుసేన ఓడిపోయింది. తన నోడించిన పరమశక్తి వైష్ణవసేన మాత్రంగాదు. ఆ ప్రబలశక్తి ప్రజావిప్లవమే ! ఆ విప్లవంతోనే సామ్రాజ్యాలు కూలిపోయినాయి. విష్ణుపుర దుర్గం జయించేందుకు సులభమైనా, ఈ విప్లవ ప్రజల నణచివెయ్యాలె ! మఱియెన్నడు వారు తిరుగబడగూడదు. మార్గమధ్యంలో అనేక గ్రామా లున్నాయి. సైనికులు ఆ గ్రామాలమీదకు దండెత్తినారు. తమవృత్తులతో దేశాన్ని కళావంతంజేసి ఆనందించే కోమల స్వభావపరులైన ప్రజలు ఈ సైన్యం వలె హింసకు అలవాటుపడి ఉండరు. వారు అసహ్యంతో భయంతో అడవులలోకి పారిపోయినారు. సైన్యం గ్రామాలుదోచి, ధాన్యం, ధనం తీసుకొనిపోయినారు. మొన్నటి యుద్ధంలో అపజయంవలన కలిగిన నిరుత్సాహం యీ దోపిళ్ళతో తీరిపోయింది. ఉత్సాహంతో గ్రామాలకు నిప్పు ముట్టించారు. క్షణంలో ఆకాశమెత్తున మంటలు, పొగలు కమ్ముకొన్నాయి. ఆ భయంకర జ్వాలలుచూసి చేసే ప్రళయాట్టహాసాలే, రేపు ఈ యరాచక రాజ్యంలో అలూఫ్ శాసించే భద్రశాసనాలు. అలాఫ్‌ఖాన్‌తో రామదేవుడుకూడా ఉన్నాడు. ఆ భక్తిపరుడు కూడా తన ప్రజలమీంద కోపంతో యీ వినాశనంచూసి సంతోషిస్తూన్నాడు.

ఈ రీతిగా ప్రజలను భయపెట్టుతూ, గ్రామాలనుదోస్తూ, తగులబెట్టుతూ, శత్రువులు విష్ణుపురం ముట్టడించారు. జయించే విశ్వాసంతో

గాకపోయినా, ధర్మ విశ్వాసంతోనైనా వైష్ణవులు శత్రువులయెదుట నిలిచిపోరాడినారు. హతులైనారు. దుర్గం శత్రువులకు స్వాధీనమైంది. మరి త బీభత్సం చేయకపోతే ప్రజలు రేపే తిరుగుబాటు చేస్తారేమో! సైన్యం పురవీధుల్లో పరుగులెత్తింది. పారిపోయే ప్రజలను అందినవారి నందినట్లే చంపేశారు. జొరబడి యిండ్లల్లోవారి నిండ్లల్లోనే పొడిచి వేశారు. స్త్రీలను బలాత్కరించారు. హత్యలుచేసి సంతోషిస్తూ, ఆత్మ హత్యలుచూసి ఆనందిస్తూ, తమ పిశాచనినాదాలతో సైనికులు విజయోత్సవం ముగించారు. ఆ వెంటనే ఒక బహిరంగ స్థలంలో, భయ కంపితులైన ప్రజామధ్యంలో, రామదేవునితో గలిసి అల్లూఫ్‌ఖాన్ కొలువుతీర్చాడు. విప్లవంలో చావు తప్పించుకొని, కొండగుహలలోను, చెట్టు తొఱ్ఱలలోను యింతవరకు దాగిన మతగురువులు వేదికమీద నిలిచి 'దేవుని పలుకులు, దేవతల ఆశీస్సులు' వినిపించారు. వేశ్యలు సంగీతం పాడుతూ నృత్యంచేస్తున్నారు. అప్పుడు కొలువు ఆరంభమైంది. నూరుమంది విద్యార్థికులైన యువకులు బంధితులై, రాజసమక్షంలో నిలుపబడినారు. ఈ యువకులు విప్లవాన్ని దిగ్విజయంగా నడిపిన నాయకులు. కడచినక్షణంవరకు పరిపాలకులు. ఇప్పుడు రాజద్రోహులైన నిందితులు. ఆ బహిరంగస్థలంలో పాతియుంచిన ఉరిస్తంభాలమీద ఒకరివెనుక ఒకరి నెక్కించి ప్రాణాలు తీస్తున్నారు. నిందితులమీద దయజూపి క్షమించటంలేదు, లేక క్షమించమని నిందితులు ప్రార్థించటంలేదు. ఇంతవరకు రామదేవుడే ఆజ్ఞాపిస్తున్నాడు. నవ్వుతూబోయి యువకులు ఉరికంబ మెక్కుతున్నారు. ఉరిదీసిన శవాలను భటులు ఒకచోట కుప్పలు బెట్టుతున్నారు. ఇదంతా తనకు తెలీనట్లు అల్లూఫ్‌ఖాన్ పరధ్యానం నటించాడు. ఇంతలో వేదికయెదుట, 'కణంగ్ కణంగ్'మని ధ్వనులు వినిపించాయి. శరీరమంతా యినుపగొలుసులతో బిగించి కృష్ణసేనుని రాజసమక్షంలో నిలిపారు. రాజులగుండెలు దద్దరిల్లినాయి. ఆటపాటలు నిలిపి వేశ్యలు కొయ్యబొమ్మలైనారు. ఇతడు భయంకరుడైన విప్లవకారుడు. రామదేవు డతనిని కఠినంగా చూస్తూ

రామ : నీవెంత విశ్వాసఘాతకుడవో తెలుసా?

కృష్ణసేనుడు సగర్వంగా తలయెత్తి చూశాడు.

రామ : భక్తిప్రధానమైన మా ప్రభుత్వాన్ని కుట్రజేసి కూల్చిన పాపాత్ముడివి.

కృ : విదేశీయులకు దాసులైపోవటంగూడా భక్తిప్రధానమేనా?

రామ : ఓరి నీచుడా, మనకు విరోధమైన శైవమతాన్ని నాశనం చేసేందుకు తురకలతోకలిస్తే దాస్యమౌతుందా?

కృ : అవును. తమ ప్రలోభభక్తి యెంతనిర్వీర్యం చేయకపోతే దేశాన్ని విదేశీయుల అండజేర్చింది. వీర్యవంతం జేసేందుకే మేము ప్రభుత్వం మీద తిరుగబడినాం పౌరుషంతో!

రామ : ఇప్పుడా పౌరుష మే మైంది?

కృ : ఆప్రశ్న కత్తి చేతికిచ్చి అడుగు.

రామ : పదిబల్లేలతో పొడిచి చంపండి యీ ద్రోహిని.

నిరాయుధుడైన కృష్ణసేనుని బల్లెంతో పొడిచి కూల్చారు. అతడు క్రిందబడి గిల గిల లాడుతోంటే, పది బల్లేలతో పదిమంది - ఒకడు తలమీద, ఒకడు కళ్లల్లో, కడుపులో, డొక్కలో పొడిచి పొడిచి చంపారు. కృష్ణసేనుని శరీరమంతా చచ్చిపోయింది. కాని అతనిచెయ్యి మాత్రం నేలమీద యేదో వెతుకుతోంది. కిరాతకులు యీటెలతో పొడుస్తూనే ఉన్నారు. చెయ్యి వెతుకుతూనేఉంది. అలూఫ్‌ఖాన్ ఆశ్చర్యంతో యెలుగెత్తి యేడ్చాడు, అరిచాడు.

అలూ : అతనిచెయ్యి కత్తికోసం వెతుకుతోంది.

అలూఫ్ కృష్ణసేనుని ప్రక్కకుదూకి తన ఒరలో కత్తిని ఆ చేతిలో ఉంచాడు. చేయి కత్తినాడిస్తోంది. అయితేదానికి బలిగావలసిన వారెవరు? రామదేవు నీడ్చుకొనిపోయి ఆ శవం ప్రక్కకు దొర్లిం చాడు. అతడు లబలబ లాడాడు. ఆ వీరుని హస్తం రామదేవుని భుజం మీద గాయంచేసి కత్తిని విడిచింది. రామదేవుని శరీరంమీద కారే రక్తం వ్రేలితోతీసి అలూఫ్ కృష్ణసేనుని పెదవులమీద పూశాడు. ఆ

నాలుక నెత్తురునాకి దాహం తీర్చుకొంది. ఆత్మ శాంతించింది. అప్పుడా వీర ముఖబింబం మీద ఆనందరేఖలు లెక్కిస్తూ

అలూ : శత్రురక్తం త్రాగి యీ వీరుని ఆత్మ శాంతించింది.

రామా : నేనా శత్రువును. అతడే మనశత్రువు శత్రువును చంపే వాడు శ్రీ మన్నారాయణమూర్తి, ఇంక మీరు శాంతించండి !

అలూ : నిన్ను చంపివేస్తేనే నాకు శాంతి. ఎక్కు ఉరికంబం !

రామా : నే నే మపరాధంచేశాను యువరాజా !

అలూ : విష్ణువర్మవంటి మహాయోధుని చంపించటమే నీ యపరాధం !

రామ : నా మతంకోసం –

అలూ : నీరాజ్యం పరాధీనమైంతర్వాత నీకు మతంగూడా నిలుస్తుందా? నీ మతధర్మం నీ స్వతంత్రంతోనే చచ్చిపోయింది. ఇంక నీ బానిస తనానికి బాహ్యాచారాలే మిగిలినాయి.

రామ : ఆచారాలకోసమైనా నన్ను సింహాసనంలో ఉంచండి.

అలూ : ఈ కృష్ణవర్మ మృతశరీరానికి పట్టంగట్టినా దేశం వీర్యవంత మౌతుందిగాని నీ జీవచ్ఛవం సింహాసనంలో ఉంచి ఎవరూ దుఃఖించ లేరు. చచ్చిపోయిన కృష్ణవర్మకే నా స్నేహం, నా గౌరవం ధార పోస్తా.

అలూఫ్ ఆదరంతో కృష్ణవర్మ ముఖం ముద్దాడినాడు.

రామ : నన్ను కౌగలించు యువరాజా.

అలూ : 'నిన్నా ... ఛీ కుక్కా ... ఉరిబెట్టుకో'

రామదేవవర్మను యీడ్చుకొనిపోయి భటులు ఉరికంబ మెక్కిం చారు. అత డేడుస్తూనే ప్రాణాలు విడిచాడు.

## ౧౮

వైష్ణవరాజ్య పతనంగూర్చి ప్రతాపునకు తెలిసింది. దానిని మింగిన విదేశీయులే ఈ దేశాన్నిగూడ మింగుతారు. అంతః కలహంతో త్రిలింగ సామ్రాజ్యం బలహీన మైయింది. స్వార్థమే దాని అంతఃశత్రువు. మత సమానత్వం శాసించి జాతీయ ధర్మంతో తన దేశాన్ని బలీయ మొనర్చేందుకు యత్నించాడు. ఈ సమానత్వంవల్ల జంగాల ఆధిక్యత రాజ్యంలో నశించిపోతుంది. సామంతుల దౌర్జన్య పాలనంగూడా అరికట్టబడుతుంది. ఈ జాతీయ ధర్మానికి విరుద్ధంగా మతగురువులు, సామంతులు కుట్రలు బన్నినారు. ఈ విధంగా సాహసించేందుకు ప్రక్కలోనే విదేశీయు లున్నారు. ఆ భయంతో ప్రతాపుడు వీరి నణచలేడు. ఈ ధైర్యంతోనే ఈ దుండగులు ప్రతాపు నెదిర్చేందుకు ధైర్యంబూనినారు. ధర్మాతురుడై ప్రతాపుడు కొలువు తీర్చాడు. శివయోగి పక్షమంతా సభలో ఒక ప్రక్కన గూర్చుంది. ఇప్పుడు ప్రతాపుని పక్షసభ్యులు సంఖ్యకు చాలా తక్కువైనారు. అనగా రాజ్యంలో ప్రలోభులసంఖ్యే ఎక్కువగా కన్పిస్తోంది. ప్రతాపుడు ధైర్యంతో జాతీయధర్మం చర్చించేందుకు నిశ్చయించాడు.

ప్రతా : వైష్ణవరాజ్యం విదేశీయులకు వశమైపోయింది. అనగా మన సామ్రాజ్యం అపహరించేందుకు అల్లాఫ్‌ఖాన్ సైన్యసమేతుడై మన సరిహద్దులో నిలిచాడు. వైష్ణవరాజును బలహీనపరచిన ప్రలోభమే మన మనస్సులమీద అధికారం చేస్తోందా ?

ఒక సా : లేదు ప్రభూ, మేము ప్రలోభులంగాదు.

ప్రతా : అయితే జైనులకు మన శైవులతోబాటు సమానాధికారాలు పంచియిస్తున్నాం! ఇకమీద శైవులకు జైనులు బానిసలుగారు.

శివ : అకస్మాత్తుగా మన మతంమీద ప్రళయందింపినారేం సార్వభౌమా? జైనులు శైవులతో సమానాధికారులైతే ప్రశ్నించే లోకానికి యే ఆధిక్యతతో తన ముఖం చూపిస్తుంది మన శైవమతం!

ప్రతా : సర్వమానవ సౌభ్రాతృత్వంతో శోభితమైన సుందర ముఖం చూపిస్తుంది. స్వామీ! ఎదుట దుఃఖంచూసి సంతోషించే పైశాచిక స్వభావంకంటె, సకలమానవ సౌఖ్యంచూసి సంతసించే దైవస్వభావం మన మతానికి సిగ్గుచేటౌతుందా? మనకు జైనులెందుకు బానిసలై యుండాలె?

శివ : జైన శైవుల మధ్య సాంప్రదాయభేదం ప్రబలమైంది. నాలుగు నంద లేండ్లక్రిందట జైను లీదేశం పాలించేప్పుడు సంపదలన్నీ తామే భుక్తపరుచుకొన్నారు. శైవులను దరిద్రులను చేశారు. చివరకు బానిసతనమే మన శైవమతానికి సాంప్రదాయమైంది. ఆ విధంగా జైనమతం ప్రసిద్ధికెక్కింది. తిరిగి శైవ మతాధిక్యతకోసమే మన పూర్వులు జైనులను బానిసలను చేసుకొన్నారు.

ప్రతా : అయితే, మతం పేరుతో దేశ సంపదలన్నీ అనుభవించటమే మతధర్మం, సాంప్రదాయం అవుతుందా? యింతకంటే కృత్రిమం, స్వార్థం యేదైనా వుంటుందా?

శివ : స్వార్థపరులని నిందలు మోసేందుకైనా త్యాగం చేశారుగాని, మన పూర్వులు మతం పోయేందుకుమాత్రం అంగీకరించలేదు.

ప్రతా : మతమనగా కొలదిమంది స్వార్థపరుల కీదేశ సంపదను దోచి యిచ్చేందు కేర్పడిన మాయాభూతమని తమరు వాదిస్తున్నారు. మానవుని నైతికజీవితం, యీశ్వరునకు ప్రీతికరమైన సత్యాహింసా ధర్మబద్ధ మయ్యేట్లు, అర్థసూత్రాన్ని స్పష్టపరచిన ప్రణాళికనే మత మనే పేరుతో పిలుస్తున్నాం! ఈ ప్రణాళికను, అనగా యీ మతాన్ని ప్రజలందరూ జీవనసౌఖ్యం పొందేట్లు సరిగా అమలుపరిచే అధికారమే ప్రభుత్వం. ఆ ప్రభుత్వం వశపరచుకొనే రాజుగాని...

శివ : ఆ ప్రణాళికను లిఖించే మతగురువుగాని...

ప్రతా : అవును, రాజుగాని, మతగురువు (పురోహితుడు) గాని స్వార్థ పరులై ఆ ప్రణాళికను భంగపరిస్తే ప్రజలు దరిద్రంతో క్షోభిస్తారు. దేశంలో అశాంతి కలుగుతుంది. తత్క్షణమే జీవన సౌఖ్యప్రేరితులై క్రొత్తమతం పేరుతో ప్రజలు ప్రభుత్వంమీద తిరుగుబాటుచేస్తారు. ఆ తిరుగుబాటునే ఆర్థిక విప్లవమనండి, ధర్మ విప్లవమనండి, లేక మత విప్లవమనండి - యీ ప్రజా విప్లవమే ఒకనాడు శైవులను రాజ్యంలోనుంచి యీడ్చింది జైనమతం స్థాపించింది. మళ్లీ జైనులను రాజ్యంలోనుంచి తరిమింది. శైవులను రాజ్యాధికారు లను చేసింది.

శివ : అయితే శైవమతం ప్రతిష్ఠించిన యీశ్వర ధర్మానికే జైనులెం దుకు బద్ధులుగాలేరు? జైనమతం విడిచి శైవమతం యెందుకు స్వీకరించరు? జైనదేవతలను జైన సాంప్రదాయాలనే యెందుకు విశ్వసిస్తున్నారు? సార్వభౌము లిప్పుడు గ్రహించి ఉంటారు. రాజ్యాధికారంలో ఉన్నప్పుడు జైను లెంతటి స్వార్థపరులో ఇప్పుడు బానిసలైపోయినా, ఆ స్వార్థమే, ఆ యధర్మమే వారిలో నిండిఉంది. ఇప్పుడా స్వార్థపరులకు ఆర్థికహక్కులు ప్రసాదించి ఆ యధర్మాన్నే పెంచదలచినారా?

ప్రతా : అయితే జైనుల రాజ్యంలో బానిసలైయున్న శైవులు తిరిగి స్వార్థపరులయ్యేందుకే విప్లవంచేసి, రాజ్యాధికారం వహించినారని సెలవిస్తున్నారా? స్వార్థపరులకు అధికారమూ, ప్రజలకు బానిస తనమూనా? అధికారబలంతో మనకు భాగ్యాలూ, భోగ్యాలూ బ్రతుకైతే బానిసతనంవల్ల ప్రజలకు దొంగతనం, దోపిడీ బ్రతుకౌ తుందా? సామంతులారా, మాట్లాడరేం? మన నిత్యకర్మలలో సర్వభూతాలకు అన్నశాంతి నిచ్చే మతధర్మానికి మారు, మన అధికారబలంతో ఒక దరిద్రలోకం సృష్టించాం. అందులో శైవులు జైనులను, జైనులు శైవులను నేటాడి బ్రతుకమని శాసించాము. హింసే ఆ ప్రజలకు వృత్తిధర్మమైంది. హింసిస్తున్నారు. హత్యలు

చేసుకొంటున్నారు. విజ్ఞానాభివృద్ధికి వినియోగించే మానవశక్తి మతద్వేషంతో మానవ రక్తం పారించేందుకు వినియోగపడుతోంది. యేండ్ల తరబడి మానవ రక్తం యెంత ప్రవహించినా యీ దరిద్రంలోనుంచి ముక్తి లేదు. తిరిగి దరిద్రంలోనే కృశిస్తున్నాడు, దుఃఖంలోనే కుంగిపోతున్నాడు. దేశమెంతో బలహీనమైపోయింది. ఈ బలహీనం మన ప్రభుత్వాన్నెంతలో పతనంచేస్తుంది? కాబట్టి ప్రజాబలమూ, శక్తి, పెంపొందించేందుకు మతాలమధ్య సమానాధికారాలు శాసిస్తున్నా!

శివ : సామంతులారా, సార్వభౌములు శాసించే రాజకీయ సమానత్వం మత సమానత్వానికి మార్గమౌతుంది. శైవమతం సంకరమైపోతుంది. ఇది మీ కిష్టమేనా? శివుడు పరమాత్ముడు. ఆ పరమ శివుడు ప్రసాదించినదే శైవమతం! ఆ మతంలో ఉన్న ఆధ్యాత్మిక ధర్మం అనుష్ఠించలేని బలహీనులు, భౌతిక సుఖాలకు లోభించి, జైనమతం సృష్టించారు. బలహీనులు సృష్టించిన మతంలో మానవులు బలవంతులౌతారా? ఈశ్వర ధర్మానికి బలహీనమే విరోధం! ఈశ్వరునితో విరోధించి, దరిద్రులై, దుఃఖితులై, కృశించి కుళ్ళిపోవటమే జైనుల కిష్టం! మన రాజ్యంలో ఉన్న జైనమతమే మన బలహీనం! మన రాజ్యం బలీయమొనర్చేందుకు యీ జైనమతాన్ని నాశనంచెయ్యాలె! ఈ జైనులవల్లే రాజ్య మరాజకమైంది. ఈ యధర్మపరులవల్లే మనకు విదేశీయ శత్రుత్వం దాపురించింది. యుద్ధాలు సంభవించాయి. ఈశ్వరధర్మం మీ రపేక్షిస్తే దేశంనుంచి జైనులను తరిమివెయ్యండి.

సామం : జైనులను తరిమివేస్తాం, ధర్మం ఉద్ధరించుతాం!!

జైనులను తరిమివేస్తామనే నినాదాలతో సభామంటపం ప్రతిధ్వనిస్తోంది. సభికులను వారించే శక్తిగూడా లేనట్లే ప్రతాపుడు తెల్లబోయి చూస్తున్నాడు. అప్పు డన్నయ్యదేవుడు ముందుకు వచ్చి

అన్న : ఎక్కడికి తరుముతారు జైనులను. మీ రాజ్యంలో చోటు లేనప్పుడు జైనులకు శత్రువులే ఆశ్రయమిస్తారు. విష్ణుపురంలో

విదేశీయుల నోడించిన జైనశక్తిని, మీా నాశనంకోరి విదేశీయుల కప్పగిస్తారా ? దేశ జనసంఖ్యలో నూటికి డెబ్బదిమంది జైనులు మన శత్రువులలో కలిస్తే మన రాజ్యం, మన మతం యెంతలో పతనమౌతుంది.

సామం : ఈశ్వర రాజ్యాన్ని మానవశక్తి పతనం చేయలేదు. పరమ శివుని మతాన్ని మానవశక్తి పతనం చేయలేదు. శైవుల సుఖం కోసం జైనులను తరుమండి.

సంతోషంతో యింతలావున ఉబ్బి చక్రవర్తి యెదుట నిలిచాడు.

శివ : యీా ప్రజాప్రతినిధుల నిర్ణయానికే తమరు బద్ధులై శాసించండి సార్వభౌమా ! సింహాసన మలంకరించండి.

ప్రతా : ఈ ధర్మసింహాసనంలో కూర్చుని నే నధర్మం శాసించలేను. ఈ కిరీటం మీా రెవ్వరైనా ధరించండి. మతద్వేషంతో మీా దేశ శక్తిని మీారే చంపుకోండి !

ప్రతాపు డసహ్యపడుతూ తన కిరీటం శివయోగి నెత్తిని బోర్లించాడు. అప్పుడు సభామందిర గవాక్షానికి సూటిగా పశ్చిమదిశలో సూర్యుడు క్రిందకు జారాడు. సూర్యుడు శపించి సామంతులను అంధకార కూపంలో పడద్రోశాడా ! సభలో వెలుగు తగ్గింది. ప్రతాపుడు సభలోంచి కదిలిపోతూంటే శివయోగి, అన్నయదేవుడు అడ్డునిలిచి వారించారు.

శివ : రాజ్యంవిడిచి పోయేందుకు మీా కధికారంలేదు. పీఠాధిపతిని నే నాజ్ఞాపిస్తున్నా !

అన్న : అవును చక్రవర్తీ, సింహాసనం వీడి రమ్మని ప్రజలు నిన్నాజ్ఞాపించలేదు. అంతవరకు నీవు మతగురువులు సూచించే ధర్మమే శాసించు. ఆ శాసన మామోదించేందుకు తిరస్కరించేందుకు ప్రజలున్నారు. దయతో కిరీటం ధరించు !

చేయిబట్టి నడిపించి ప్రతాపుని సింహాసనంలో కూలవేశారు. ఆయన నెత్తిన మళ్ళీ శివయోగి కిరీటం బోర్లించాడు. కాని ఆ ముఖ పద్మానికి అది పూర్వంవలె శోభ నీయకపోయింది.

అన్న : ఓ మతసార్వభౌమా! తమ ధర్మశాసనం చక్రవర్తి సమక్షంలో ఉంచండి.

శైవమతరక్షణగోరి ఈ శాసన గ్రంథం యెన్నాళ్లు వ్రాసినాడో, శివయోగి దానిని జోలెలోనుంచి వెలికితీసి చదివాడు.

శివ : బానిసలైన జైనులు, తమ యజమానులైన శైవులమీద తిరుగబడి, వ్యవసాయమూ, మొదలైన వృత్తులలో ధర్మం ప్రతిష్టం భించేట్లు చేసినారు. అధికార శైవులతో కలహించి రాజ్యంలో అశాంతి కలిగిస్తున్నారు. శాంతి ధర్మస్థాపనకొరకు జైనులు త్రిలింగ సామ్రాజ్యంలోనుంచి తరుమబడేందుకు శాసించటమైంది.

సభాసదులీ శాసన మంగీకరించారు!

ప్రతాపుడా శాసనంక్రింద సంతకం చేశాడు!!

# ౧౯

ఆచారంకోసం ఆడించే నాలుక లేకాని, భక్తితో యిచ్చే పవిత్రోదకం కాదని తెలుసుకొన్నాడేమో, తర్పణాలిచ్చే శైవలోకం వంక యెఱ్ఱగా చూసి సూర్యు డస్తమించాడు. రాజసభలో కనుపించిన మాసిన వెలుగులే లోకమంతా వ్యాపించినాయి. ఆ సభలోనే సృష్టించిన మతశాసనం ఓరుగల్లునగరవాసుల ముఖపద్మాలమీద భయమూ నిరాశను పూది నల్లబరచింది. దుర్గంలో ఉద్యోగధర్మం నిర్వర్తించే జైనులను ఉత్తరక్షణంలో వెడలిపొమ్మని ఆజ్ఞాపించారు. దుర్గరక్షకసైన్యంలో యేబదివేల జైను లున్నారు. శైవసేనాపతులు శాసనం వినిపించగానే జైనసేన చేతుల్లోని ఆయుధాలు నేలమీద కుప్పలుబడినాయి. ఈ జైనోద్యోగులందరూ దుర్గం దాటి నగరంలో ప్రవేశించగానే జైనపండితులు, జైనవర్తకులు, జాతీయవాదులైన శైవులు వారికి యెదురుకోలొచ్చినారు. తరువాత మత శాసనంమీద తమ అసమ్మతిని తెలుపుతూ మౌనంవహించి పురవీధులలో ఊరేగ నారంభించారు. ఈ జైనులను భయపెట్టేందుకు, ఇందుకు ప్రతిగా వీరశైవులు రౌద్రోత్సవం ప్రారంభించారు. కొందరు తమ శరీరాలకు నారసాలు గుచ్చుకొన్నారు. రక్తంచిందేట్లు కొందరు తమ శరీరాలను కొరడాలతో బాదుకొంటున్నారు. కత్తులతో తమ రక్తంతోడి వీధుల్లో చిమ్ముతున్నారు. అరచేతులలో జ్యోతులు వెలిగించుకొని మింగుతూ తిరిగి మంటలు గ్రక్కుతున్నారు. ఆ వెనుక శాంతిని రక్షించేందుకు నగర రక్షకోద్యోగులు సైన్యసమేతులై జైనులు నివసించే వాడలలో ప్రవేశించారు. నలుదిక్కులా పీడిస్తూ మతశాసనం ఓరుగల్లును హోరున నేడిపిస్తోంది. జైనులు తమ జన్మభూమిని విడిచిపోలేక దుఃఖిస్తున్నారు. వారు తమ సొత్తును వెంటతీసుకొనిపోరాదు. ఆకలితీర్చుకొనేందుకు ఇష్ట

నూకలైనా వెంటనుంచుకోరాదు. ఇది పరమశివు డేలేరాజ్యం. ఇంతవరకు తమశక్తిశ్రమలను భోగించి మదించిన శైవులకే, తాముకూడబెట్టుకొన్న సొత్తునుకూడా వశపరచాలె! ఒట్టిచేతులతోనే జైనులు వెడలిపోవాలె. విడిచిపోలేక తమయిండ్లల్లో కూర్చుని దుఃఖిస్తున్నారు. కూలిపోయే గోడలు, కుంగిపోయే పైకప్పులు యిల్లాంటి పేదగుడిసెలేయైనా అవి మాతృగర్భంవలె ఎంతో మధురంగా, స్వర్గతుల్యాంగా కనుపిస్తున్నాయి. తల్లియొడికి దూరమైపోలేక జైనసంతానం దుఃఖిస్తోంది. ఇండ్లల్లో లేచి పొమ్మని సైనికు లల్లరిచేస్తూంటే, లేచిపోమని బోర్లపడి గట్టిగా నేలను గరుచుకొంటున్నారు. సైనికులు బలవంతంగా యీడుస్తూంటే కొట్టుక పోయేట్టు పొట్టమీద డేకుతున్నారు. మాతృరూపం మూర్తీభవించిన ఆ యిండ్లల్లో గోడలను కౌగిలించి, చూరులుబట్టి వ్రేలాడి, 'అమ్మా, అమ్మా' యని యేడుస్తున్నారు. దెబ్బలుతిని చేతులు పట్టుదప్పితే, స్పృహదప్పితే, అప్పుడు—ఆ శరీరాలు వీధులలోకి యీడ్వబడుతున్నాయి. అప్పు డడవులలోంచి పూరిమేసి తిరిగి వస్తున్నాయి పశువులు. తాము కష్టించే కూలిడబ్బులో తమ పశువులకు పట్టెడు మేతైనా పెట్టకుండా తన గుక్కెడు జావ తాగనేతాగరు. అంత ఆపేక్షతో పెంచుతారు. ఇప్పుడు విడిచిపోతే శైవులీ పశువులను యే యజ్ఞాలలో బలిస్తారో? పెంచిన ప్రేమ ఆ బక్కదూడలను, బర్రెలను, మేకలను కౌగలించి దుఃఖిస్తున్నారు. కర్రలతో అదలించినా, కత్తులతో బెదరించినా స్వస్థానంలోనుంచి జైనులు కదలటంలేదు. ఇక్కడేగాదా పుట్టింది. యిక్కడేగాదా పెరిగింది. ఇప్పుడు తా మెక్కడికి నడిస్తే అక్కడికి యీ భూమే నడిచివస్తుందా? రాదు. ఇదియెంతో పవిత్రమైన భూమి. పుణ్యభూమి. ఈ మన్ను అంతా బంగారమే, అమృతమే! యెంతో ఆపేక్షతో యింత మట్టి తీసుకొని వొళ్లంతా పూసుకొన్నారు. తృప్తిలేదు. దుమ్ములో దొర్లాడినారు. దుమ్ముమ్రింగినారు. వసంతంచల్లుకున్నట్లు దుమ్ముచల్లుకొంటూ నాట్యమాడారు. నాగరిక శైవులదృష్టిలో యిది పిచ్చితనమనిపించింది. అయితే మతిచెడిన పిచ్చిమాత్రంకాదు. మతి వున్న పిచ్చిప్రేమ,—జైనులకు తమ మాతృభూమిపై తీరని భక్తి! ఆ

భక్తివల్ల, పుట్టినచోటనే మట్టిగలవాలనిపిస్తోంది. మరొకచోట మరణిస్తే తమకు ముక్తిలేదు. స్వర్గంలేదు. నరకభయంతో వలసపోలేక తమను తరిమేసైనికులకు కనిపించకుండా కొందరు బావులలో దూకి దాక్కొన్నారు. బావిలోంచి సైన్యంపైకి లాగబోతే ఒక్క శరీరమైనా ప్రాణంతో బయటపడలేదు. అది ఆత్మహత్య, అది మహాపాపం అని జైనులకు తోచటంలేదు. పరదేశమే వారికి పరమలోకంగా, పాపపంకిలంగా, నరకప్రాయంగా తోస్తోంది. దౌర్జన్యంచేసి సైనికులు నడుపజూస్తే ఆత్మహత్యలు చేసుకొని జైనులు మరణిస్తున్నారు. ప్రాణాలతో కదిలించే ఉపాయమేమిటి? ఈ యిల్లూ వాకిల్లూ కనుపించేవరకు జైనులకీ స్వస్థానంమీద మమకారంపోదు. అందుకని ఒక పూరికొంపకు అధికార్లు నిప్పుముట్టించారు. ఆ యిల్లుగల జైనుడామంటలలోకే దూకాడు. ఆ యింటితోబాటు ఆ శరీరం ఆ మంటలలో గలిసింది. ఆ మంటలలో మసైపోయి, మట్టిగలసి జైనుడు తన జన్మహక్కును సార్థకపరుచుకొన్నాడు అయినా జాలిపడేదెవరు? క్షణక్షణానికి సైనికుల దౌర్జన్యం అధికమౌతోంది. జన్మభూమిమీద అనురాగంతో జైనులు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. మరొక్కక్షణంలో యీ యాత్మహత్యలే పరహత్యక్రింద పరిణమిస్తాయేమో! జన్మభూమిమీద జైనులప్రేమే శైవులమీద ద్వేషంగామారిపోతుందేమో? శైవులమీద జైనులు కత్తులు దూస్తారేమో? మతకలహం సర్వనాశనం చేస్తుంది. జైనులకూ ముక్తిలేదు; శైవులకూ ముక్తిలేదు. దేశంలో యీ క్షోభకు, యీ యశాంతికి కారకులైన అధికారవర్గంమీదే యీ ద్వేషం నిలిచిపోవాలె. పరిస్థితులు విషమించేంతలో అన్నయదేవుడు ఆశ్రమ విద్యార్థులతో ప్రత్యక్షమైనాడు. దేవుని సముఖంలో నిలిచినట్లే ఆ దీనులు చేతులుమోడ్చి నిశ్శబ్దంగానిలిచారు. అన్నయదేవుడు శాంత గంభీరస్వరంతో ప్రశ్నించాడు.

అన్న : సోదరులారా నామీద మీకు విశ్వాసముందా?

ప్రజ : ఉంది అన్నా.

అన్న : అయితే నా వెంటనే బయలుదేరండి.

ప్రజా : ఎక్కడికి ?

అన్న : ఎక్కడికి, ఎందుకు అనిమాత్రం ప్రశ్నించకండి. మాతృభూమి మీద మీకెంత ప్రేమో, మాకూ అంతే ప్రేమ.

ప్రజ : పరాయి దేశంపోయి యెట్లా బ్రతికేం అన్నయదేవా ?

అన్న : పరాయి దేశం మనం పోవద్దు. నగరంవెలుపల నిలిచి ఉందాం. పీడించే మతాధికారులనే యీ నగరంలో నిలువనియ్యండి. పీడితుల మైన మనమంతా నగరం వెలుపల నిలుద్దాం! దేశమంతటా చెల్లా చెదరులై గ్రామాల్లోఉన్న మన పీడితజాతి, మన బానిసజాతి మనలోకి ప్రవహిస్తుంది. సముద్రమువలె నగరం వెలుపల అపారంగా వ్యాపించిపోదాం. ఆ సముద్రంలో విజృంభించే ధర్మ విప్లవం, యీ యధర్మ ప్రభుత్వాన్ని తుపానువలె తుడిచివేస్తుంది.

ఆత్మ రక్షణమార్గం గోచరించింది. జైనులు అన్నయదేవునితో ప్రయాణమయ్యేదుకు సంసిద్ధులైనారు.

ఆ వీధులలో దుఃఖవేదన భరించలేక గాబోలు, నవమిచంద్రుడు జాతీయాశ్రమంప్రక్కన ఆకాశంలో నిలిచి, తన మెత్తని కిరణాలతో ఆశ్రమప్రశాంతిని అనుభవిస్తున్నాడు. అప్పటినుంచి చంద్రుడు జ్యోత్స్నామృతంతో క్రమంగా నిండుతున్నాడు. అదే సమయాన వినయునిలో, లోకశాంతిని ప్రసాదించే ప్రేమజ్యోతిగూడ క్షణక్షణానికి పెంపొందుతోంది. కాని ఆ జ్యోతిర్కాంతిని మతశాసనం మబ్బు తెరవలె కప్పివేసింది. ఆ తెరచాటునే ఆ ప్రేమోజ్వలమూర్తి అస్తమిం చేందుకు గంగ అంగీకరించదు. ఆపె సుందరప్రకృతిలోని ఆశాలతలు సుగంధవాయువులను వీచి ఆ తెరను చించివేస్తుంది. ఆమె యీ వెలుగు ననుభవించి తీరుతుంది. వినయుడాపె యుద్దేశం గ్రహించలేక వెలుపల ఆమె యెదుట నిలిచి సెలవడుగుతున్నాడు.

విన : నాకు సెలవిచ్చిపంపించు గంగా.

గంగ : ఎక్కడికి వినయా ?

విన : నీళ్ళూ, నిప్పూ దొరకని యే యంధకారంలోనికో మా దిక్కులేని జైనజాతి తరుమబడుతోంది. నేనా జాతివెంటే పారిపోతాను. అక్కడ మా దుఃఖానికి విరామ ముండదు.

గంగ : అయితే నన్నేమై పొమ్మంటావు వినయా.

విన : ఇది శైవులు సుఖించేలోకం గంగా, నీవు శైవయువతివి. నీవు నీ శైవ జాతిలోనే ఉండు.

గంగ కోమల హృదయాన్ని ఆ మాటలు గాయపరచినాయి. ఆమె యెంతో బాధతో—

గంగ : నీమీద నా ప్రేమను చంపుకోమని చెప్తున్నావా వినయా.

విన : నన్నావిధంగా నిందించవద్దు గంగా! మన దేశ స్వాతంత్ర్యం మతద్వేషంవల్లే నష్టమైపోతోంది. ఆ మతద్వేషానికి లోగుట్టు రాజ్యలోభం, ధనలోభం అని జనసామాన్యం ఇప్పటికీ గ్రహించలేకపోయింది. క్షేమసాఫల్యంకోసం యిప్పుడు మన మేప్రయత్నం చేసినా ఈ ప్రలోభం మనచాటున మరుగుపడుతుంది. భిన్న మతస్థులమధ్య పరస్పర ప్రేమే, మతకలహం పుట్టించి దేశపతనానికి కారణమైందని లోకం నిందిస్తుంది. అందుకనే జైనులతో కలిసిపోయేందుకు నాకు సెలవు.

గంగ : అయితే పద నేనూ వస్తాను.

విన : ఎక్కడికి? మీ జైనులంతా యెక్కడికిపోతారో అక్కడికి, ఆ చీకటికోణంలోకి.

విన : నీది శైవమతం గంగా!

గంగ : కాదు. యీ గడియనుంచి నాది జైనమతం! శైవమతం విడిచిపెట్టాను.

విన : శైవమతం విడిచేందుకు నీ కధికారంలేదు.

గంగ : ఎందుకు లేదు? ఒక మతంలోనుంచి వేరొకమతంలోకి నిత్యం యెన్ని పేదకుటుంబాలు మారిపోతున్నాయి? పేదలకున్న అధికారం నా కెందుకు లేదు?

విన : లేదు గంగా, సంపదాధికారులను బంధించేట్లు మతాచారాలు చెట్టనీడనో, పుట్టనీడనో బ్రతికే పేదవాళ్ళనుమాత్రం కట్టలేవు. నీవు రాణీ రుద్రమదేవికి మనుమరాలివి. ప్రతాపరుద్రచక్రవర్తికి చెల్లెలవు. అంతటి గొప్పవంశంలో పుట్టి మా బౌద్ధసమతంలో కలిస్తే, శైవులింట్లో ధనరాసులు జైనులింట్లోకి చిమ్మివేసినట్లౌతుంది. అది శైవరాజ్యానికి, శైవులకు యెంత అవమానం? ధనంలోనుంచే మానవులు మతాధిక్యతెను చూస్తున్నారు గంగా! శైవమతంలో నుంచి నిన్ను అడుగుదాటనివ్వరు మతగురువులు!

గంగ : ఈ మతగురువులకు జడిసి నా స్వచ్ఛంద ఆశ్రమజీవితమంతా ఆడంబరమయం చేసుకోమంటున్నావా వినయా? నీ మీద ప్రేమతో నీ దోసిట్లో నీరు త్రాగి సుఖించేమారు, నీ రక్తం త్రాగి దాహం తీర్చుకోనేదా వినయా!

విన : జైనులను ద్వేషించేందుకే నిన్ను శైవమతంలో ఉండమని చెప్పటంలేదు. ప్రతాపరుద్రదేవులు, నాయనగారూ జాతీయధర్మం కోసం పోరాడినట్లే నీవు నీ మతంలోఉండి నీ ప్రేమకోసం పోరాడు.

గంగ: అసంభవం వినయా, మీ జైనులంతా దేశం విడిచిపోతూంటే నే నెవరికోసంపోట్లాడను?

విన: మేము దేశంవిడిచిపోముగంగా మతశాసనం మమ్ము తొక్కినా యిష్టమే, మేము మట్టిగరుచుకొనే కూర్చుంటాము.

గంగ: అయితే నీ పాదాలు బట్టుకొని కూర్చుంటాను. మతశాసనం నన్ను ముక్కలుగోసి చంపనియ్యి!

గంగ అతని పాదాలమీద నిలువునా కూలింది. ఆ పాదాలను కౌగిట బిగించి కన్నీళ్లతో తడుపుతోంది. వినయుడు కూర్చుండి ఆమెను పాదాలమీదనుంచి లేవనెత్తుతూ:

విన: గంగా...

గంగ: ఇంక నాకేమీ చెప్పవద్దు వినయా, మీ జైనులను జన్మభూమినుంచి తరిమివేసే మతశాసనమే, నీనుండినన్ను లాగేస్తోంది.

జన్మభూమి నీ కెంత ప్రియమో, నీవు నా కంతప్రియం, నా ప్రాణం, నాసర్వస్వం!

వెక్కి వెక్కి యేడుస్తోంది పాదాలమీద ముఖముంచి. వినయుడు గద్గదస్వరంతో:

విన: నా పాదాలు వొదులు గంగా.

గంగ: వొదలలేను వినయా, మన యిరువురిమధ్య ప్రేమలోనుంచే ప్రపంచ వ్యవహారాలను పరిశీలిస్తున్నాను. ప్రపంచంలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలు మన దాంపత్యధర్మంతో ముడివేసుకొని ఉన్నాయి. నైతికజీవితం, దేశస్వాతంత్ర్యం ఉద్ధరింపబడేందుకే ఈనాటి రాజధర్మానికి మత సమానత్వం అవసరమని స్వర్గంలో ఉన్న మాయమ్మ సందేశమిచ్చింది. మనిద్దరని పెండ్లాడమని చేతులు గలిపి మరణించింది మాయమ్మ! మాయమ్మ ముఖపద్మంనుంచి వొలికిన ధర్మామృతంతో యీ సుందర భూమిని తడిసిపోనీయక అది యెడారిలో ప్రవహించేట్లు మతకర్తలు కాలువలు త్రవ్వినారు. మన శరీరాలు అడ్డునిలిపి యీ పుణ్యభూమిమీదకు ఆ యమృతాన్ని పొర్లించుదాం వినయా!

విన: రోదనచేయకు గంగా... నేనేం చెప్పుతున్నానో విను.

గంగ: వినను వినయా, క్రియలతోనేగాని యింక మాటలతో యీ మతాలను సాధించలేము. ఇప్పటికే యెంతో జాగుచేశాను. దేశానికి సంప్రాప్తమైన స్వాతంత్ర్య యుద్ధాల్లో గాయపడిన నీ శరీరం మీద రక్తం నా చేతులతో నేనే తుడిచినట్లైతే, అప్పటి మతకలహంలో ప్రవహించే మానవరక్తం యీ మతాల నెన్నడో తుడిచిపెట్టేది. నా ఆలింగనంలోనే నీ క్షతగాత్రం సేదతీరినట్లైతే, ద్వేషంతో మానవహస్తాలే కంఠాలకు కత్తులు గురిచేస్తున్నాయో, అనురాగంతో ఆ కంఠాలనే ఆలింగనం చేసేవి. ఈనాటికి శాంతిగీతాలే వినిపించేవి. కాని మత గురువులకు జంకి నీకు సేవచేసేందుకు ఆలసించాను. దేశానికెంతో అపచారం చేశాను. ఇంక నేనీ దేశంలో

క్షోభను భరించలేను. నీకు దూరమై నేను నిట్టూర్పులు విడిచివిడిచి మత భూతాలను తాపం చల్లార్చలేను. ఇంక నీ పాదాలు వదలలేను. మతాలను ధ్వంసంచేసే మహాప్రళయంకోసం, నన్ను నీతో తీసుకొనిపో వినయా! ప్రపంచ శాంతినిచ్చే, మహా ప్రణయంకోసం నన్ను ప్రేమించు వినయా! పోనీ ప్రేమించలేకపోతే, నా స్థితి చూసి కాస్త జాలైనాపడు వినయా!

విన: జాలిపడి నిన్ను విడిచిపోలేను గంగా, నిన్ను గాఢంగానే ప్రేమిస్తున్నాను. నా కంఠం కౌగలించు.

వినయుడామె కంఠాన్ని కౌగలించాడు. ఆమె వినయుని గాఢంగా కౌగలించింది, ఆమె యెక్కడ చచ్చిపోతే ఆ శవంప్రక్కన అతని ప్రాణాలు ఆ క్షణంలోనే పోయేంతటిగాఢంగా అతని శరీరంలో శరీరం గుచ్చివేసింది. ఆ యానందంలో కరిగి ఆ శరీరా లేకమైనాయి. మనమేకమైనామంటూ ఆ యాలింగనంలోనే లేచి నిల్చారు. వారిలో మితిలేని ప్రేమకు అంతకన్న మాటలులేవు. 'ఏకమైనా' మటూ ఆ యాలింగనంలోనే నడుస్తున్నారు. నడుస్తూ నెమ్మదిగా ప్రాకారద్వారం దగ్గరచేరగానే చెట్లులేని యా చోట ఆకాశంలో చంద్రదర్శనమైంది. వర్ణభేదం, మతభేదం, రూపభేదం లేకుండా, తన చల్లని వెన్నెలలో సర్వజీవులకు సుఖమిచ్చే పరిపూర్ణుడు యీ మతైక్యతనుచూసి యెంత ఆనందించాడో — కళ్ళల్లో నిండిన ఆనందంలోనుంచి చూస్తూంటే, ఆ చందమామలో నల్లమచ్చ చెరగిపోయినట్లే స్వచ్ఛంగా కనుపిస్తోంది. వెన్నెల తీర్చి కాస్తోంది. అక్కడనుంచి యేదో గంటలమ్రోత గంగా వినయులను కదలనీయలేదు. ఎదురుగా శిష్యులతో శివయోగి ప్రత్యక్షమైనాడు. మతగురువును చూసి గంగ కంగారుపడలేదు. తమ ఐక్యశరీరాలను చంద్రునికి చూపినట్లే శివయోగి యెదుటగూడా చూపి, మే మేకమైనామంటూ తన బాలామాయకప్రేమను వెల్లడించింది. శివయోగి మండిపడుతూ వినయుని చూసి—

శివ: ఎక్కడికి?

విన : దీను లెక్కడికి పోవాలని శాసించావో - అక్కడికి.

శివ : నీవు దీనుడవు, జైనుడవు, బానిసవు. ఈ శైవకన్యను మోస గిస్తున్నా వెందుకు ?

గంగ : మోసగించలేదు. నే నతనిని ప్రేమించాను. ప్రేమించి మే మేకమైనాం !

శివ : ఇంతమందిలో యేకం...ఛీ ఛీ...

సిగ్గుతో చీదరతో కళ్లు మూసుకొంటూ శిష్యుల నాయిద్దర్నీ వేరుచెయ్యమన్నాడు. శిష్యు లామెమీదపడి శక్తికొలది గుంజారు. కాని మే మేకమంటూ మంత్రించినట్లు ఆ శరీరాలు రెండూ అతుక్కొని పోయినాయి. 'ఇంకా వీళ్ళను చీలదియ్యాలంటే కత్తిబెట్టే చీల్చా'లని శిష్యులు మొత్తుకొన్నారు. కత్తిబెట్టి చీల్చేందుకు శివయోగి యిష్టపడ లేదు. దగ్గరలోనే ఉన్నాయి ఆశ్రమంలో పర్ణశాలలు. ఏకమైన ఆ శరీరాలను ఒకశాలలోకి మోయించుకొనిపోయినాడు. క్రోవపాడు గునా పొంగిపొర్లే ఆనందంతో పిచ్చినవ్వులు నవ్వుతూ, గంగ— మే మిద్దరం యేకమని—రాగాలుదీసింది, ఆ సంగీతంతోనే, ఆ వినాదం తోనే పర్ణశాలంతా నిండింది. పరస్పరబాహుబద్ధమైన ఆ యవ్వనశరీరా లల్లాగే స్తంభానికి బిగించికట్టి తాళ్లతో గట్టినా భయంలేదు. దిగులు లేదు. గంగ నవ్వుతూ సగర్వంగా పలికింది.

గంగ: మేమిద్దరం ఏకం, ఇద్దరం ఒక్కటే పెండ్లాడి ఒక్కచోట బ్రత కమనే మాయమ్మ చెప్పింది.

శివ: ఆ మాట నీ మతంమాత్రం చెప్పలేదు.

గంగ: మా అమ్మముందు - మతం యేమంత గొప్పది? దేవుడేమంత గొప్పవాడు. యేం వినయా? నువ్వు చెప్పు అమ్మ యెంతగొప్పదో?

విన: అమ్మ వొళ్లో జైనులూ, శైవులూ కవలపిల్లలవలె పెరిగారు. అమ్మ నందరూ ప్రేమిస్తారు, అందరూ పూజిస్తారు !!

గంగ : ఊఁ, అందరూ పూజిస్తారు. అందరూ ప్రేమిస్తారు. మరి దేవుణ్ణో అందరూ ద్వేషిస్తారు. అరూగణుడనే పేరుతో దేవుణ్ణి

శైవులు విరోధిస్తారు. శివుడనే పేర దేవుణ్ణి జైనులు విరోధిస్తారు. ప్రపంచంలో ఎన్నిమతాలున్నాయో, ఆ యా మతస్థులందరికీ స్వమతంలోనుంచి దేవుడు కన్పించనే కన్పించడు. కాని పరమతంలో నుంచే కన్పిస్తాడు, ఎంతో తేలికగా - ఎంతో నీచంగా - ఎంతో అసహ్యంగా ! అందుకని, బుద్ధుడు దేవుడని వైష్ణవు లొప్పుకోరు. విష్ణువుదేవుడని బౌద్ధులంగీకరించరు. 'అల్లా' అనే పేరు చెప్పితే ఆర్యులు మండిపోతారు. ఆర్యుల దేవుడంటే తురకలు కత్తులు దూస్తారు. దేవుడంటే మానవులకింతపగ! అందుకనే దేవాలయాన్నీ మానవులే కూల్చివేస్తున్నారు. మసీదులన్నీ మానవులే తగులబెట్టు తున్నారు. ఏం వినయా మానవులకు శివుడు ప్రబల శత్రువుగాడా ?

శివ: అతడే శత్రువైతే నిన్నతడే నాశనం చేస్తాడు !

చూరులోపలనుంచి లోపలకు పొగలు గమ్ముకొన్నాయి. వెలుపల జంగాలు నిప్పు ముట్టించారు. గంగ భయపడలేదు. ఆమె ముఖపద్మంలోనుంచి ధర్మామృతం పొర్లుతోంది. వినయుడామె ముఖం మీద ముఖముంచి ఆ యమృతాన్ని సేవిస్తున్నాడు.

గంగ : అతడు గాకపోతే నాశనకరుడు మరెవ్వడు ? ఒకే అమృత నినాదంతో అమ్మా యంటూ తల్లి యొడిలో పాకులాడే మానవ సంతానం ఏదో ఒక్క- పేరుతోనే తనను పిలిస్తే అతడు సమ్మతించడు. ఒకనితో తనపేరు అరూగణుడని, వేరొకనితో తనపేరు శివుడని చెప్పాడు. ఒకనిముఖాన జైనమతమని, ఒకని ముఖాన శైవమతమని గీశాడు. జైనులతో శివు డబద్ధమని చెప్పాడు. శైవులతో అరూగణు డబద్ధమని చెప్పాడు. ఈ యబద్ధంతో మానవసమాజాన్ని రెండుగా చీల్చాడు. తిరిగి యీ యబద్ధుడైన అరూగణుడే సత్యదేవుడని జైనులు ధృవపరచాలె. శివుడే సత్యమని శైవులు ధృవపరచాలె. అందుకు ఉపాయమేమో తెలుసునా ? జైనులను చంపి శివుని, శైవులనుచంపి అరూగణుని ప్రత్యక్షం చేసుకోవాలె ! చూశావా తనను నమ్మికొల్చే భక్తులముఖాన దేవు డేవిధంగా

చాపురాసిపెట్టాడో! తల్లి ఒళ్లో పెరుగుతూనే దేవుడికోసం సోదరులు పొడుచుకొని చస్తున్నారు. తల్లి యొడిలోనే సంతానరక్తం మడుగు గట్టుతోంది. అద్దంలో చూసినట్లే ఆ నెత్తురుమడుగులో తన రూపం చూసుకొని అందం దిద్దుకుంటున్నాడు దేవుడు! పిశాచదేవు డానం దిస్తున్నాడు. మతభేదాలతో యెన్నియుగాలనుంచి యీ దేవుని పేరుమీద యెందరు మానవులు హతులైపోయినారు, ఇంకెన్నియుగా లీ హత్యలు జరగాలె! అతడున్నాడని యెందుకు విశ్వసించాలె! ఉన్నాడనిమనమంటేనే యింతరక్తపాతమై అతడుంటున్నాడు. మనమే లేడంటే యీ లోకంలో అతడేఉండడు, యీ మతాలే ఉండవు, యీ హత్యలేఉండవు. అను వినయా, యీ మాట అను, దేవుడు లేడు!

విన : దేవుడులేడు.

గంగ : ఊఁ దేవుడులేడు.

శివ : దేవుడుగాక యెవరున్నారు?

గంగ : అమ్మవుంది. ద్వేషంతో పొడుచుకొనిచావమని తల్లి తన సంతానానికి కత్తులందించలేదు. తినిబ్రతకమని తియ్యని పదార్థా లందించింది. ఆ మధురభక్ష్యా లొక్క జైనులకూగాదు, ఒక్క శైవులకూగాదు, సకల సంతానానికి సమంగా యిచ్చింది. సమానత్వమే ఆమె ముఖ్యధర్మం! ఈ ధర్మంకోసమే మతాలు విడిచి మా యిద్దరినీ పెండ్లాడమంది మా యమ్మ.

శివ : ఆడండి పెండ్లి యీ యగ్నిలో.

లోపల చూరుల్లోనుంచి అగ్నినాలుకలు జాపి ఆ యువ్వనుల నందుకొనబోతోంది. ఆ వేడి భరించలేక శివయోగి చంగున ద్వారం లోకి దూకాడు, అతనిచేతులో కంచుకాగడా వెలుగుతోంది. దానితో ద్వారంమీద వొంగిన చూరుకు నిప్పు ముట్టించాడు. ద్వారానికి నిప్పులతోరణం గట్టినట్లు యెఱ్ఱగా మండుతోంది. మళ్ళీ ఆ కాగడాను గంగా వినయులమీదకు విసిరినాడు. గంగ లెక్కచేయలేదు.

గంగ: ఏయ్ శివయోగీ. ఈ యగ్ని మాశరీరాలు దహించేకంటే యేంచేస్తాయ్! మతాలు వేధించినట్లు మా హృదయాలను మాత్రం మాడ్చలేవు. మాతృధర్మంతో మా హృదయాలు ప్రేమమయమైనాయి. మా యాత్మలు శాంతిస్తాయి.

విన: అవును గంగా, మాతృధర్మమే లోకానికి శాంతినిస్తుంది. మాతృ నామమే లోకంలో స్థిరమౌతుంది. మాతృగీతంగానంచేసి మత పిచ్చిలోంచి మానవులను మేల్కొలుపు.....వందే మాతరం!!

గంగ: వందే మాతరం!!

మధురంగా మాతృగీతం భజిస్తున్నారు. ప్రజ్వలించే యగ్నులు ఇంద్రియలోలుపుడైన శివయోగిని ఆ గీతం విననీయలేదు. భగ్గు భగ్గు మని మంటలచప్పుడు మాత్రమే వినిపిస్తోంది. అతడు వెలుపలికి పారిపోయినాడు. ప్రేమవీరుల నా మంటలు మింగివేసినాయి. ప్రాంగ ణంలోవున్న ధర్మశాలలన్నీ దహనమవుతున్నాయి. ఆ శాలలమధ్య సుందరమైన దేవాలయముంది. ఆ దేవాలయం, అందులోని దేవతా విగ్రహం శివయోగి ద్వేషానలంలో ధ్వంసమైపోయినాయి. ప్రళయ భీకరంగా మన్నూ మిన్నూ ఏకజ్వాలతో నిండిపోయింది. ఆ మంటలు చూసి సంతోషంతో జంగాలు చిందులు త్రొక్కుతూ తమ పాపిష్టి కర్మను చూసి ఆనందించమని గాబోలు, ఆకాశంలో దేవుని శంఖాలు వూది మేల్కొల్పినారు. ధూమాచ్ఛాదితమైన ఆకాశంలో మాత్రం దేవుడుంటాడా, మేల్కొంటాడా! నగరం వెలుపలకు వలసపోయే జైనులు మేల్కొన్నారు. అన్నయదేవుని ఆశ్రమంమీద జైనులకెంతో భక్తి! అమ్మో అమ్మోయని గుండెలు బాదుకొంటూ ప్రజలు పరుగిడి వస్తూంటే భీతితో జంగాలు పలాయనులైనారు. పారిపోయే జంగా లను వీరసోముడు వెంట తరిమినాడు. ఆశ్రమంచుట్టూ జనమంతా రెక్కలమీద వ్రాలినారు. ఆర్పివేసేందుకు సాధ్యమయ్యే మంటలేనా అవి! అన్నయ దేవుడు జనమధ్యంలో వెఱ్ఱివానివలె నిల్చి చూస్తు న్నాడు. జాతీయ ధర్మచిహ్నంగా ఒక్క వస్తువైనా మంటలు మిగిలిం

చవు. తన వర్ణాశ్రమం, తన ధర్మపరికరాలు, తన దేవుడు-తన బిడ్డలు గంగా, వినయుడు - అంతా ఒక్కమారే ఆ యగ్నులలో ఆహుతి యైనారు. స్పృహదప్పినట్లే ఆయన నేలమీద కూలబడినాడు. ఇంతలో వీరసోముడొక జంగాన్ని జుట్టుబట్టి యీడ్చుకొంటూ వచ్చి 'గంగా వినయుల యీ మంటలోనే కాల్చివేశారు జంగాలంటూ ఆ జంగాన్ని మంటలలో విసరివేశాడు. ఇప్పటికి అతనికి కక్షతీరక ఆ రౌద్రావేశంతో అటూ యిటూ వెతుకుతున్నాడు. ఆ మంటలలోకి దొర్లించేందుకు మరొక పాపాత్ముడు చేతికి దొరకలేదు. చిక్కితే వెయ్యిమంది జంగాలను చంపినా ఆ కక్ష తీరదు. కాని యీ సమయంలో గంగావినయుల స్నేహగుణం కన్నీటితోనే తీర్చుకొన్నాడు. అతడు దుఃఖంతో అన్నయదేవుని వొళ్లో తూలిపడినాడు. గురుశిష్యు లిరువురూ గుండెలు బాదుకొని నేలదొర్లి యేడుస్తుంటే జనం గొల్లుమన్నారు. వేదాలే నోరుతెరచి ఘోషిస్తున్నట్లు తోచింది. ఆ ఘోష సామాన్య మైందికాదు. అది శివయోగి నెంతో భయపెట్టి దుర్గంలోకి తరిమివేసింది. అక్కడ ధైర్యంతో చక్రవర్తియెదుట నిలిచాడు. తన దుష్కర్మమే అప్పుడు తోచింది గర్వం. ఇంకెన్ని పాపాలైనా చేసేందుకు రాజఖడ్గం తన నరికట్టదు. చక్రవర్తినే అతడు కత్తులబోనులో బంధించినట్లు అశక్తుని చేశాడు. శివయోగి వినిపించే వినాశనం, దుఃఖం విని కుళ్లిపోయే కంటే, ప్రతాపుడు చేయకలిగిం దేమీ లేదు.

ప్రతా: ఈ బంధితునకేదో సంతోషవార్త తెచ్చినట్లున్నారు తమరు

శివ: అవును. ఉహుఁ - కాదు - జాతీయాశ్రమాని కెవరో నిప్పుపెట్టారు?

ప్రతా: ఆ మంటలనేగా జోలు చూస్తున్నాను యీ కిటికీలోంచి.

శివ: అందులోనే గంగావినయులను కాల్చి చంపారట!

ప్రతా: ఈ మందిరంలో నన్ను కాల్చేందుకు వచ్చినారా తమరు.

శివ: మిమ్మలిని కాల్చి చంపేందుకు రాలేదు; అధర్మాన్ని కాల్చేందుకు వచ్చాను.

చికాకుపడుతూ శివయోగి ఆ గదిలో ఉత్తరనైపుద్వారం తెరిచాడు. అక్కడికి చేరువలో చక్రవర్తియొక్క పూజామందిరం కనుపిస్తోంది. వడివడిగా శివయోగి ఆ గుడిలోకి నడిచాడు. కర్పూర దీపాల వెలుగులో స్వయంభూదేవుని పాలరాతివిగ్రహం తళతళ మెరుస్తోంది. దాని తలమీద ఆనాడు చక్రవర్తి యలంకరించిన మంగళసూత్రం తెంపుకొని శివయోగి వెళ్ళిపోతున్నాడు. ప్రతాప రుద్రుడు కిటికీలోంచి యీ దుండగంచూసి పటపట పళ్లుకొరుకుతూ

ప్రతా: ఓ శివయోగీ, ఓ మతపిశాచ చక్రవర్తీ!

తానుపోయేమార్గంలోనే శివయోగి నిర్లక్ష్యంగా నిలిచి చూశాడు. ప్రతాపదేవుడు తన ఉత్తరీయాన్ని శివయోగినైపుకు విసరి-

శివ: ఆ యమంగళమూర్తిని తగులబెట్టి, మరీపో—

శివయోగి మారుచెప్పలేదు. వాయువేగంతో తన త్రోవన విడిచిపోయినాడు. అతడా ఆలయంలో మాంగళ్యం తెంపుకొనిపోయి నంత వేగంగానే శైవుల యిండ్లలో మంగళశోభ తరిగిపోతోంది. సుమంగళియైన పద్మావతి తన భర్తకు విడాకులు చెప్పి సేవాపరతంత్రు డైన వృద్ధఅన్నయదేవునికి ఉపచర్య చేసేందుకు వెడలిపోయింది. జటాశంకరునిలో అంతులేని పదవీవ్యామోహం, ఆమెయందు పత్నీప్రేమ నెన్నడో చంపివేసింది. నీతిని రక్షించేందుకు తీసుకొన్న ప్రతిజ్ఞే మత దీక్షయని అతడు భావించటంలేదు. 'మతమనేది ఒక రాజకీయపక్షం. ఆ పక్షానికి తాను బద్ధుడైయుండాలె! పాపమైనా పుణ్యమైనా ఆ పక్షం చెప్పినట్లు చేసితీరాలె! అప్పుడే అతనికి ఉన్నతాధికారం లభిస్తుంది. తమ దాంపత్యంలోగూడా ప్రేమకు మారు పక్షభావమే యీ యధికార వ్యామోహితునకు కనుపిస్తోంది. తన అధర్మకృత్యాల నామె యెన్నడు అరికట్టినా ఆమె జైన పక్షపాతివలె కన్పిస్తోందిగాని, ధర్మ పక్షపాతివలె కన్పించటంలేదు. కత్తెరబోనులో తగుల్కొన్న స్త్రీ అతని మెడ పదవీ వ్యామోహంలో యిరుక్కొనిపోయింది. తన అడుగుజాడలలోనే తప్పక నడిచే ఆ పతివ్రత హృదయంలో యేధర్మ జ్వాల విజృంభిస్తుందో వెను

దిరిగి చూసేందుకు అతని మెడ నాబోను వెనుదిరగనీయటంలేదు. ఆమె యెన్నడైనా తన శుభహస్తాలతో అతని వీపుమీద అనురాగంతో నిమురుతూ 'మనమార్గం అటుగాదు యిటుఅని ధర్మపథం జ్ఞప్తికి తెచ్చినా, జైన పక్షపాతంతో ఆమె తన వీపు చరచి చావమోదినట్లే బాధపడినాడు. క్రుద్ధుడైనాడు, ఈ విధంగా పాపకూపంలో పడబోయే భర్తను వెనుక నిలిచి పద్మావతి పడద్రోయలేకపోయింది. ఎదురు తిరిగి అతనిని పుణ్యశిఖరానికే యెక్కించబోయింది. అనేకమార్లు బెదిరించింది. సత్యంకోసం యిప్పుడు మళ్లీ యెదిరించింది.

జటాశంకరుని మందిరంలోవలెనే ప్రతి శైవుని యింట్లో పెడ మొగాలు వెలసినాయి. ప్రభుత్వవిధానమే యీ పెడమొగాలు పెట్టించింది. స్వార్థప్రేరితమైన యీ ప్రభుత్వాన్ని పెరికివేసి సతీపతుల మధ్య, సోదరీ సోదరులకుమధ్య, తల్లిదండ్రులకు సంతానానికిమధ్య స్నేహం అనురాగం పెంపొందించే ధర్మప్రభుత్వం స్థాపించుకోనేందుకు యువజనులలో కోరికబుట్టింది. పద్మావతివలెనే చాలమంది యువజనులు, తమ అధికార భవనాలను విడిచిపోయినారు. కొందరు తమ ఐశ్వర్యాలను కాలదన్నినారు. గంగవలెనే జైన యువకులను ప్రేమించిన జైన యువతీ మణులెందరో ఉన్నారు. జైన కన్యలను వరించిన శైవయువకు లెందరో ఉన్నారు. ఈ ప్రభుత్వ మత రక్షణ శాసనాన్ననుసరించి తమ ప్రేమ భగ్నమయ్యేందుకు ఆ యవ్వన హృదయా లంగీకరించలేదు. తమ జైనసఖులు, సఖీగణులు వలసపోయి దూరమౌతారని శైవులు దుఃఖిస్తున్నారు. ఒక విషమ దుఃఖ కూపంలో కొట్టుకలాడే ఈ యవ్వనులమీద ఒక ప్రేమజాలం విసరి గౌరి ఆ చేపలనన్నిటినీ ఒక భద్రమైన ఉద్యమ ప్రవాహంలో విడిచిపెట్ట నిశ్చయించింది. ఆమె యత్నం ఫలించింది. ఒక్కొక్క శైవయువకుడు తన జైనసఖితో, ఒక్కొక్క శైవ కన్య తన జైన సఖునితో గౌరి యెదుట ఒక రహస్యస్థలంలో సమ కూడారు. గంగా వినయులు వారి కాదర్శప్రాయులు. గంగా వినయులను మంటగలిపిన మతభేదాలను యీ యవ్వనులచేత గౌరి మంట గల్పిస్తుంది. నీతికోసం బలిపీఠాలమీదే పెండ్లిచేస్తుంది. తమ స్వార్థం

కోసం జారవృత్తినే తనకు బ్రతుకుచేసిన యీ యువతీ మతప్రభుత్వమే, జైనయువతీ యువకులనుంచి శైవయువతీ యువకులను వేరువేసి మానవజాతికి, మానవజాతి యంతటికీ వ్యభిచారకళంకం దిద్దుతోంది. మతం చివరకు దీన్నే అంగీకరిస్తోంది! ఇది సహించరాని అధర్మం! అవమానం! కాబట్టి రాత్రియంతా విసుగూ విరామం లేకుండా యువ్వనులచుట్టూ తిరిగి గౌరి ధర్మప్రబోధం చేసింది. వందలకొలది ప్రేమ వీరులు జట్లుజట్లుగా గౌరియెదుట సమావేశమౌతున్నారు. అప్పటికే తూర్పు రేఖలు తెల్లవారుతున్నాయి. ఎండపొడసోకని కొండలోయలో యేటిమడుగున గనుపించే నిర్మలమైన నీటివలెనే ప్రశాంత ఉషఃకాంతులు కనులపండువౌతున్నాయి. ఆ కాంతిజలంలో ప్రేమవీరులు తమ జీవితాలను నూతన ఉత్సాహంతో నింపుకొంటూ చేపలవలె మిలమిల మెరుస్తున్నారు. అక్కడ భావి ఉద్యమంలో కర్తవ్యం నిర్ణయింపబడుతోంది. ఇంతలో ఆ ప్రదేశంలో ఒక సుందరమూర్తి తమవైపుకు నడిచివస్తోంది. ప్రత్యక్ష ఉషాదేవిని చూసినట్లే వారు ఆశ్చర్యపడుతున్నారు ఆమె రజియా! అలూఫ్‌ఖాన్ సైనికులు ఆమెను నిన్న రాత్రి ఓరుగల్లు జేర్చి రహస్యంగా జంగాలకు మేనాతోసహా అప్పగించారు. శివయోగి చేతిలో పడకపూర్వమే రజియా తప్పించుకొని ఆత్మరక్షణకోసం తిరుగుతోంది. కాని యెవరు శరణ్యమిస్తారో తెలీదు. ఇంతలో ఆమెకీ సమావేశం కన్పించింది.

రజి: తెల్లవారబోతోంది. జంగాల బారినుంచి సన్నుద్ధరించే దయాళులెవరైనా ఉన్నారా?

వచ్చీరాని ఉరుదుభాషలో గౌరి ప్రశ్నించింది.

గౌరి: ఎవరివి నీవు సామాన్యునియింటి బిడ్డవలె కన్పించటంలేదు.

రజి: నేనైతే సామాన్యుని యింట్లోనే పుట్టి పెరిగాను. కాని ఒక రాజకీయ పెనుభూతం నాకు స్వర్గం చూపిస్తానని ఆకాశంలోకి యెత్తి, నన్ను అగాధంలోకి విసరివారేసింది. నేను బోగందాన్నై పోయాను. నీమరాలినై వచ్చాను.

ఆమె దుఃఖముతో మాట్లాడలేక కన్నులు నులుము కొంటూ నిలిచింది. గౌరి ఆదరంతో సమీపించి.

గౌరి : మీ మహమ్మదీయ మతంలో గూడా యీ భోగంవృత్తి ఉందా చెల్లీ.

రజి : రాజుల భోగంకోసం ఉంది.

ఒక యువకుడు : మీ మతంలో బీదలున్నారా ?

రజి : దిక్కుమాలిన బీదలేగాదు. భాగ్యవంతులను సేవించేందుకు బానిసలుగూడా ఉన్నారు.

అందరూ ఒక్కసారే నిట్టూర్పువిడిచారు. రజియాను నడిపించుకొనిపోయి, గౌరి తన ప్రక్కనే కూర్చోబెట్టుకొంది.

ఒకయువ : ఈ బానిసవృత్తి భోగంవృత్తి మీ మతంలో వినిపించే దేవుడు గూడా వ్రాసిపెట్టాడా ?

రజి : దేవుడుగాదు వ్రాసిపెట్టింది ప్రభుత్వం.

గౌరి : ఎవ్వరి ప్రభుత్వం ?

రజి : అల్లూఫ్‌ఖాన్ ప్రభుత్వం! ఒకనాడు నాముఖం మీద మృదువుగా తన ప్రియురాలినని దిద్దిన వ్రేళ్ళతో అల్లూఫ్‌ఖాన్ ఆ వ్రాతను తుడిచివేశాడు. నేనొక వేశ్యనని ఇప్పుడు కత్తితో గీశాడు.

ఒక : నీవు వేశ్యవైతే ప్రయోజనం ?

రజి : నేను మీ మతగురువు శివయోగిని మోహంలోముంచి, మత ద్వేషంలోనుంచి అతని మనసు మరలకుండా చెయ్యాలె. మత కలహంతో బలహీనమైతే మీ సామ్రాజ్యం తేలికగా స్వాధీన మౌతుంది. ఇది నా వేశ్యావృత్తికి వెనుకనున్న రాజకీయ మర్మం!

గౌరి : ఈ రాజకీయ మర్మమే నన్నుగూడా వేశ్యను చేసింది.

జైను : రాజకీయ ప్రయోజనం లేందే మే మెందుకు బానిసలౌతాం ?

కొందరు శైవులు : రాజకీయం గాకపోతే మేమెందుకు పేదలమౌతాం!

రజి : నా అనుభవంలో దేవుడు కన్పించటం లేదు. ప్రభుత్వమే, కరువు, దరిద్రం, దాస్యం, నీచవృత్తులు అన్నీ మన ముఖాన రాస్తోంది.

రజి : సత్యం గ్రహించారు. సోదరులారా! మీ ముఖాన నే దుర్దశ వ్రాసింది.

గౌరి : ఇందులో శైవ యువతీయువకులు జైన యువతీయువకులను ప్రేమించగూడదని, పెండ్లాడగూడదని మతప్రభుత్వం శాసించింది.

రజి : నాకూ, అలూఫ్‌కూ మధ్య జాతిభేదమే మా వివాహానికి అడ్డువచ్చింది. ఇక్కడ మతభేదం నెపమైంది.

గౌరి : ఆ నెపంతో శైవ స్త్రీ పురుషులు తమ ప్రేమను చంపుకొని...

రజి : జానుబై పొమ్మందా ప్రభుత్వం!...ఎంత దుఃఖం...సోదరులారా యే మతం పేరుబెట్టుకొన్నా ప్రపంచంలో ప్రభుత్వాలన్నీ ఒక్కరీతిగానే వ్యవహరిస్తున్నాయి. మీరైనా నీతిని రక్షించండి.

యువతీ యువకులు : మే మందుకే సంసిద్ధులమైనాము.

ఉదయమైంది. ప్రియులు తమ ప్రియురాండ్రతో కొంగులు ముడివేసుకొని వధూవరులవలె జట్లుగట్టి నిల్చారు. ఈ క్రిందిభావంతో పాట బాడుతూ ప్రయాణమైనారు.

"మేము గంగావినయులం, ప్రేమ వీరులం, మతభేదం మా ప్రేమను మంటగలుపుతోంది. ప్రేమకోసం మేము పోరాడుతాం! బలి పీఠంమీదే మేము పెండ్లాడుతాం."

"మేము గంగావినయులం. ప్రేమ వీరులం? ధనపిపాసతో మత భూతం మా యైక్యశరీరంమీద తాండవమాడుతోంది, దాని పాదాల క్రింద మమ్ము నలగద్రొక్కినా, మే మేకంగా మాతృగర్భంలోనే అణిగిపోతాం! ఇక్కడ కవల పిల్లల మవుతాం!"

"మేము గంగా వినయులం, ప్రేమవీరులం! మతభూతం మృత్యు రూపం యెత్తింది. తననాలికతో అందుకొని మమ్ము మింగబోతోంది. అయినా మాకు భయంలేదు. దాని విషపుకోరల సందునే మేము యేకంగా కాపురంచేస్తాం!"

పురజనుల ప్రేమ వీక్షణాల నాకర్షిస్తూ విప్లవ నినాదాలు అవిరామంగా సాగుతున్నాయి. ఆ విప్లవకాహళలవలెనే తానుగూడా

శాసనం ధిక్కరించే ఉత్సాహంతో ఎత్తుని భానుడు వర్ణభేదం మరిచి శ్యామసుందరియైన పూర్వదిశాకాంత సందిటిలో క్షణమాత్రం నిలిచాడు. తరువాత అరిషడ్వర్గాలకు ఎదురై నడుస్తున్నాడు. బాల భాస్కర తేజో సమమైన ముఖబింబాలతో ప్రేమవీరులు ధర్మశత్రు వుని కెదురుగా రాజవీథిలో ప్రవేశించారు. జాతీయవాదు లావిప్లవ దళానికి వీడ్కోలిచ్చారు. వారివెనుక గుంపులు గుంపులుగా సాగినారు. పెద్ద లాశీర్వాద హస్తాలనెత్తి విజయం గోరినారు. పిన్నలు హారతులెత్తి ఆమోదమిచ్చారు. కొంతమంది సనాతనులు మెటికలు విరిచి దూషణ లిచ్చారు. ఆ దూషణ లెంతటి భయంకరమైనా వారు వెనుకంజ వేయ లేదు. అమితోత్సాహంతో ముందుకు సాగిపోతూంటే సైన్యాలు వారి మార్గ మరికట్టినాయి.

అధికారి : మీలో శైవులున్నారు.

ప్రేమవీరులు : ఉన్నారు.

అధి : మీరెక్కడికి పోతున్నారు ?

శైవయువకులు : మా సతులతో పోతున్నాం.

శైవయువతులు : మా పతులతో పోతున్నాం.

అధి : శాసన మేమో తెలుసునా ? దేవరా చదివివినిపించండి !

శాసనపత్రం తెరచి ఒక జంగం చదివినాడు– "జైన శైవుల మధ్య వివాహసంబంధం, అధికార శైవమతానికి అగౌరవకరం. కాబట్టి శాంతికి భంగకరంగా జైనయువకులను గాని, యువతులనుగాని వరించిన శైవులు మరణదండనకు పాత్రులౌతారు."

జంగం : ఈ శాసనం శైవమతం రక్షించేందుకు చేసినారు. మీరు శైవులు, ఈ సామ్రాజ్యమంతా మీదే, ఈ సంపదలన్నీ మీవే. మీరే అనుభవించాలె !

యువ : మతాలపేరుతో రాజ్యాలు, కులాలపేరుతో వృత్తులు సొంతం చేసుకొనటమే మన ధర్మమైతే జైనుల గతేమిటి ?

జంగం : జైనులు పాపాత్ములు, వాళ్ళకు దరిద్రమే గతి.

యువ : మీ యధికారంతో శైవులకు శాసించిన భాగ్యం జైనులకు మాత్రం శాసించ రాదా ?
జంగం : పరమదేవు డంగీకరించడు.
యువ : మీరు శాసించినట్లే దేవుడంగీకరిస్తాడా !
జంగం : అవును.
యువ : అయితే జైన శైవులమధ్య ప్రేమనే శాసించరాదా ?
జంగం : ఒరే కట్టుకుంకా నీవు మతగురువు నెదిరిస్తున్నావు. నిన్ను శపిస్తా! ఓ కన్యల్లారా మీరు జైనులను వదలి పోతారాపోరా !
యువతు : ఒకమారు కోరి వరించాం. ఈ పురుషులను యిప్పుడు విడిచిపెట్టి యే పూతాం !
జంగం : ధనంతో తులతూగే రాణులౌతారు.

అంతలో ఒక ముసలమ్మ జనంలోనుంచి ముందుకు వచ్చి, ఆమె శైవస్త్రీయే, కసురుతూ అంది.

ముస : రాణులౌతారా రంకువాళ్ళౌతారా ! యేమయ్యా, శీలం చెడేందుకే మతంలో ఉండమంటావా ?

"శీలంకోసం మతాలకు శిథిలంచెయ్యండి. మతాలు నిలిస్తే మానవత్వం నిలుస్తుంది. మతంలోవుంటే మానవులలో రాక్షసత్వం నిలుస్తుంది, మతాలను ధ్వంసంచెయ్యండి !"

దళానికి ముందునిలిచిన వధూవరులజట్టు అడ్డునిలిచిన సైనికుల సందునుంచి దూరిపోయేందుకు యత్నిస్తోంది. కుపితుడై నరకమని జంగం ఆజ్ఞచేశాడు. సైనికుల పనునుకత్తులా ప్రేమవీరుల మెడలమీద మెరిసినాయి. వారి తలలు తెగిపడినాయి. తొడిమి తెగిపడిన పద్మాల వలెనే ముఖాల్లో యే బాధా కన్పించటంలేదు. అందరి తలలమీద అలంకరింపబడే ఆధిక్యతతో పూజాపుష్పం నవ్వే నవ్వులే ఆ ముఖ కుసుమాల్లో నిలిచినాయి. నేలగూలిన మొండిశరీరాలుచూసి వెనుక నున్న వీరదంపతులు భయపడలేదు. ఆ ముఖపద్మాలవలెనే తెగిపడి పూజాపుష్పంగా, ప్రజలకు శిరోభూషణంగా కీర్తిచెందే కుతూహలంతో

మొదటిజట్టు నిలిచిన స్థానంలోనే రెండవ జట్టు నిలిచింది. పఘూవకాలు సైనికులసందున దూరబోయినారు. కత్తులతో నరుకగానే తలలొక్క ప్రక్కన పడినాయి. శరీరాలొక ప్రక్కన పడినాయి. మూడవ జట్టు నిలిచింది. జట్టు వెనుక జట్టుగా నరకుమని ప్రేమవీరులు ముందుకు వస్తున్నారు. నరకుమని సేనాని యాజ్ఞ చేస్తున్నాడు. నరికేందుకు సైనికులకు చేతులాడటం లేదు. ఎదుట శవాలుకుప్పలు బడినాయి. రక్తం మడుగుగట్టి కాలువలు బారుతోంది. ఇదివరకు ప్రవహించే శత్రు రక్తంలో స్నానమాడి సంతసించిన వాళ్ళేయైనా, సైనికులీ రక్తంచూసి సహించలేక పోయినారు. కళ్ళు తిరిగినాయి. హృదయంలో యేమో బాధపుట్టింది. భరించలేని పాపబాధతో రొమ్ముబట్టుకొని క్రిందబడి 'హోరున' యేడుస్తున్నారు. మీ బాధయేమని సేనాని ప్రశ్నించాడు. పాపమనేమాట తప్పితే వేరొక సమాధానం చెప్పలేదు. నవ్వుతో, స్నేహంతో దగ్గరజేరే ద్రోహులనేనా నరికి చంపటం? సేనాని నరకమని మొత్తుకొన్నా తక్కిన సైనికులు నరకలేదు,. కత్తులు నేలబెట్టినారు. ప్రేమవీరులు సైనికులకు జేజేలుకొట్టుతూ పరుగిడిపోయినారు. అల్లంత దూరంలో నగరసింహద్వారం దాటి, ఆ పైన ఒక మైదానంలో వలస పోయిన జైనులు నిలిచియున్నారు. ఆ సమూహానికి ముందు వృద్ధ అన్నయ దేవుడు, వీరసోముడు, పద్మ, ఆ ప్రేమవీరులను కౌగలిం చేందుకు రెక్కలు జాచి యెదురైనారు. మేము గంగా వినయులం. ప్రేమవీరులమని పాటలు బాడుతూ అన్నయ దేవునికంఠం కౌగలిం చారు. ఆనందపులకిత స్వరంతో అన్నయదేవుడు పలికాడు.

అన్న: మీరేనా గంగావినయులు బిడ్డలారా, జగత్తును వశపరచు కొనేందుకు ప్రేమకంటే పరమాస్త్రం వేరొకటి లేదు. అది నేడు సైనికుల కటికి గుండెలను కరిగించింది. రేపు ధనాశా పిశాచో పాసకులైన పాలకులను దాసోహమనిపిస్తుంది. సత్యం పాలించండి.

ఐక్య కంఠంతో ప్రజలు గర్జించారు. సత్యమే మానవ నిత్య జీవనం, ప్రేమే ప్రపంచ రాజశాసనం! అహింసే పరమధర్మం!!

ఇంతలో ఒక గ్రామవాసి పరుగిడివచ్చి అన్నయదేవుని యెదుట సాష్టాంగపడినాడు. అతడు లింగపురములో పార్వతియింట్లో విశ్వాస పాత్రుడైన సేవకుడు, వీరసోము డాతని గుర్తించి.

వీర : భీముడూ, మాయమ్మ సుఖంగా ఉందా.

భీము : ఆ సుఖమే.

వీర : పార్వతో ?

భీము : ఆమె తండ్రి నెదిరించి పారిపోయి వచ్చింది.

పద్మా : ఏదీ యెక్కడ?

భీము : దేవీ పురంలో జైనుల పక్షాన జంగాలతో వివాదపడుతోంది.

అన్న : అసలు కథేమో చెప్పు.

భీము : ఈ వుత్తరం చదువుకోండి.

భీముడు నాలుగు పత్రాలను చేతికందిచ్చాడు. అన్నయదేవులు వుత్తరం చదివేప్పుడు వీరసోముడు భీము నీవలకు పిల్చి.

వీర : మా పార్వతి యెందు కెదిరించింది తండ్రిని.

భీము : నీమీద ప్రేమే...నీదగ్గరికే పారిపోయి వస్తోంది.

యుద్ధానంతరం ఓరుగల్లు జేరింతర్వాత వీరసోముడు తనదగ్గిర రెక్కలుగట్టుకొని వ్రాలుతాడని పార్వతి యెదురుచూసింది. కాని అతడు రాలేదు. మతగురువుల కుట్రలు అతనిని అక్కడనుంచి కదల నీయలేదు. కడచినరాత్రి గంగావినయుల విషాదగాథను తెలుపుతూ పద్మావతి ఒక లేఖ వ్రాసింది. అది అర్ధరాత్రి సమయం: పార్వతి నిద్రపోతూంటే భీముడు మేల్కొల్పి ఆ వుత్తరం ఆమెకిచ్చినాడు. దీపంవెలుగున కూర్చుండి ఆవుత్తరం చదువుతోంటే ఆమెకు ఆవేశం పెరిగింది. వెంటనే లేచి తండ్రిని వెతుక్కొంది. ఆయన గదిలో లేడు. దేవుడింట్లో కూర్చొని దేవతార్చనపెట్టెలో శివలింగానికి అభిషేకం చేస్తున్నాడు. పార్వతి ఆశ్చర్యంతో

పార్వ : ఈ యపరాత్రి అభిషేకం చేస్తున్నా రెందుకు నాయనగారూ!

తండ్రి : ఇది దొంగపొద్దుగాదూ మఱి! రక్షించమని పూజిస్తున్నా! ఇప్పుడు నిద్రలేచావెందుకు ?
పార్వ : నేను వెళ్ళిపోతున్నా !
తండ్రి : యెక్కడికీ యపరాత్రి.
పార్వ : ఓరుగల్లు.
తండ్రి : ఎందుకూ! యేమైనా కలవరిస్తున్నావా యేం ! యీ నీళ్ళతో కళ్లు తుడుచుకో.

ఉద్ధరిణ్ణతో ఆమె చేతిలో అభిషేకజలంపోశాడు. మారేడుదళం గూడా యిచ్చాడు. ఆమె నెత్తిన చల్లుకొని, దళం కళ్ళకద్దుకొంది.

పార్వ : నన్నాశీర్వదించండి నాయనగారూ
తండ్రి : యేమని ?
పార్వ : శీఘ్రంగా ఓరుగల్లు జేరమని.
తండ్రి : నీకు మతిబోయిందా యేం.

ఆమె ముఖాన వీభూతిపెట్టుతూ 'అక్కడేముంది' అనిఅడిగాడు

పార్వ : ప్రజావిప్లవం బయిలుదేరింది.
తండ్రి : ప్రజలుగారు దొంగముండాకొడుకులు. జైనులు మాత్రమే తిరుగబడుతున్నారు. వాళ్లు పాపాత్ములు. శైవుల పుణ్యమంటే వాళ్లకు సరిపడదు.
పార్వ : ఆ తిరుగుబాటులో మన బీద శైవులుగూడా ఉన్నారు. మన వీరసోముడు
తండ్రి : వీరసోముడుకోసం పోతున్నావన్నమాట. ఆ దరిద్రుడు మన వాడుగాడని చెప్పలేదూనీకు ?
పార్వ : మా మేనత్తకొడుకేగా, శైవుడేగా
తండ్రి : అయితేయేం వాడు పాపాత్ముడు.
పార్వ : సోముడుబావ పాపాత్ముడా? ఎందుకని ?
తండ్రి : ఎందుకస వాడు దరిద్రుడై పుట్టాడో అందుకనే పాపాత్ముడు. వాళ్ల తండ్రి ధనవంతుడైతే సోముడు పుట్టింతరువాతేగా వాళ్లింట్లో

దరిద్రం వచ్చింది. క్రిందటిజన్మలో యెన్ని పాపాలుచేస్తే ఈ జన్మలో వాడికేమీలేకుండా చెయ్యాలని దేవుడాగ్రహించాడో! వీడు పుట్టీపుట్టగానే ఆ ధనమంతా మాయంచేసాడు.

పార్వ: ఆ యింట్లో పుణ్యమంతా అప్పుక్రింద మనింటికే దోచిపెట్టాడు గాబోలు దేవుడు.

తండ్రి: క్రిందటి జన్మలో నా పుణ్యం మెచ్చి ఆ యైశ్వర్యం నా కిచ్చినాడు.

పార్వ: ఆ యైశ్వర్యంతో పేదల ననగద్రొక్కమని గాబోలు!

తండ్రి: ఆఁఆ.... యేమిటే

పార్వ: తొలిజన్మలో మానవులను సేవించి పుణ్యంచేసిన మెత్తని చేతులను మలిజన్మలో బంగారు ఖడ్గాలు చేసి పిసికేస్తాడా దేవుడు? తొలిజన్మలో చేసిన పుణ్యంకంటే మలి జన్మలో యెక్కువ పుణ్యం చేయిస్తాడా, లేక పాపం చేయిస్తాడా దేవుడు?

ఈ ప్రశ్నకు ప్రతిసమాధానంగా గుడ్లు వప్పగించి చూస్తున్నాడు తండ్రి! చివాలున లేచి పార్వతి పోబోతూంటే ఆమెను వెనుకకు బిలిచి అక్కడున్న దేవతార్చనపెట్టెను యెత్తి చూపించాడు. దానిక్రింద పాతరేసిన పెద్ద కుండలో, నిండా ధనం కనుపిస్తోంది.

తండ్రి: రాత్రింబగళ్లు యింత భద్రంగా పూజిస్తున్నా దొంగభయంతో! ఇదంతా మన పుణ్యమే! ఇంకో పుణ్యాత్ముని పెండ్లాడితే ఇంకా సుఖిస్తావుగాని పాపాత్ముని, దరిద్రుని పెండ్లాడితే నీకు పాపమే తగులుతుంది. జైనుణ్ణి మోహిస్తే గంగ గతేమైందో విన్నావా? పాపం భగ్గున మండించింది.

పార్వ: మతరూపంతో గంగ వినయులను మండించిన పాపమే, ఇక్కడ ధనరూపంతో నన్ను సోముడి బావను ఎడబంధం చేస్తోంది. ఈ పాపాన్ని, ఈ స్వార్థాన్ని నిర్మూలించే విప్లవమే ఇప్పుడు విజృంభించింది.

చురచురాచూసి దభాలున తలుపులువేసింది. 'పిచ్చిదానా పోయినిద్రపో' అంటూ మళ్లీ అభిషేకం ఆరంభించాడు. పార్వతి నిద్ర పోలేదు. ఆమె యిల్లు విడిచి భీముని సహాయంతో బయలుదేరింది!

తోవపొడుగునా చిట్టడవిలో నక్కలూ, గుడ్లగూబలూ కూత లేస్తున్నాయిగాని, పార్వతికి వినిపించటంలేదు. దూరంలో వినిపించే ఆర్తనాదంమీద ఆమె శ్రద్ధఉంచింది. అవి భయపెట్టి ఆమెను వెనుకకు పరిగెత్తించేబదులు, ఉత్సాహంగూర్చి ముందుకే ఆకర్షించినాయి. ఆమె కొంత ముందుకుపోయింతరువాత బాటకు ఉత్తరపు దిక్కున దీపాలవెలుగు కనుపించింది. అది దేవీపురమనే చిన్న గ్రామం! ఆ గ్రామంనుంచే యీ యల్లరి వినిపిస్తోంది. అప్పుడు ఓరుగల్లువైపుకు కాలు సాగలేదు. భీము డా చిన్నపల్లెకు మార్గంతీశాడు. పుట్టలు, కట్టలు, పొదలు, బోదెలు దాటుతూ అష్టకష్టాలతోవన పార్వతి పరుగు లెత్తింది. రొప్పుతూ, రోజుతూ ఊరుచేరుకొంది. ఊరివెలుపల జనం రెండుగుంపులుగా చీలి ఒకరికొకరు యెదురై నిల్చారు. ఆ గ్రామ వాసులైన జైను లొకగుంపు, శైవులొకగుంపు! జైనులను తరిమివేసి వారి యాస్తిపాస్తు లాక్రమించుకొమ్మని జంగాలు, ఉద్యోగులు శైవులను పురికొల్పుతున్నారు. తమ గ్రామంలో అడుగుబెట్టితే నరుకుతామని జైనులు కత్తులు, గొడ్డళ్ళు పట్టుకొని నిల్చారు. ఇంతలో పార్వతి వారి యెదుట వ్రాలింది. వారు పార్వతి నెరుగుదురు.

పార్వ : ఎందుకు పోట్లాడుతున్నారు.

జైను : మా జైనులను గ్రామంవదలిపొమ్మన్నారు.

పార్వ : గ్రామంవదలి ఓరుగల్లుపోతే అక్కడ మీ జైనులున్నారు గాదా...

జైను : ఓరుగల్లు పోనీయరట ఉద్యోగులు! ఓరుగల్లు యీ దిక్కునుంటే, మే మా దిక్కునబడి రాజ్యంవదలి పొమ్మంటున్నారు. పోమని తిరస్కరించాం!

పార్వ : మంచిపనిచేశారు. అన్నయదేవులవారు వచ్చిందాకా మీరు శాంతంగా ఉండండి!

దగ్గరే ఒక తాటిబొత్తఉంది. దాని ముచ్చెలో రెండాకులు చీల్చి కత్తిమొనతో ఉత్తరంవ్రాసింది. అన్నయదేవులవారి చరణ సన్నిధిలో

ఆ పుత్తరం ఉంచమని భీముని చేతికిచ్చింది. తరువాత ఏదో యోచిస్తూ నెమ్మదిగా నడిచి శైవులగుంపు దగ్గిరికి నడిచింది. అక్కడామె యోచనలు నిల్చిపోయినాయి. ఆమె తలయెత్తి ప్రసన్నవదనం చూపించింది. జైనులామెకు మిత్రులూగారు, శైవులు శత్రువులూగారు.

పార్వ : మీరంతా అదృష్టవంతులు.

శైవులు : అవునుతల్లీ, మాకీవ్వాళ యెన్నో భూములు, యెన్నో యిళ్లు యెంతో డబ్బు మా మతం యిస్తోంది.

పార్వ : నిన్నటివరకు మీ రెవరు ?

శైవు : నిరుపేదలం .

పార్వ : నేటికి దయదలచారుగా బోలు ప్రభువులు. పోయి ఆక్రమించుకోరేం భూములు.

శైవు : జైనులు గ్రామం విడిచిపోమని పోట్లాడుతున్నారు.

పార్వ : మీరు జైనుల నెదురకడుగుతున్నారు. మీ రక్షణకోసము సేన ఉంది. ప్రభువు లున్నారు.

శైవు : అవును, ప్రభువులు మనశైవులు

పార్వ : అయితే ప్రభుత్వమే తరిమివేస్తుంది జైనులను. ఆస్తులను ప్రభుత్వమే మీకు అప్పగిస్తుంది. అనుభవించి సుఖించేందుకా యీ యాస్తులు శాసించి ది, లేక చచ్చేందుకా మీ కీ యాస్తులు !

ఒక : అవునురా మన కెందుకు పోట్లాట ?

రెండు : అవును మనమీద దయఉంటే పిలిచే యిచ్చేది ప్రభుత్వం !

తమ మోసం యీ యమాయకులు గ్రహించారని జంగాలు, ఉద్యోగులు భయపడి 'ఎవరునీవని' గద్దించిపలికారు. పార్వతివాళ్లతో పలుకనైనాలేదు. మళ్లీ ప్రజలను చూసి:

పార్వ : ప్రభుత్వం మీకు మంచిబతుకు యిచ్చిందని మీ రాశపడ్డారు. కాని జైనులు తమ ఆస్తులతోబాటు తమ బానిసత్వంగూడా వప్పగించిపోతున్నారని మీ కేం తెలుసు ? మీరు రైతులవగానే మీ

నెత్తిన భూస్వాములు కూర్చుంటారు. జైనులను పీడించినట్లే, మిమ్ము పీడిస్తారు. జైనులుగాదు మీకు విరోధులు.

జంగం : జైనులుగాక శైవులకు విరోధులెవ్వరు !

పార్వ : వ్యాపారులు, భూస్వాములు.

శైవు : నిజమేరా ?

ఒకడు : రైతులను చెండుకతినేది వీళ్లేగా.

శైవు : మన నెత్తిమీద వీళ్లను లేకుండా చేస్తారేమో ప్రభుత్వం వోరు, అడగండి.

ఇంతలో ఒకడువచ్చి పార్వతిచేతికి ఉత్తరం ఇచ్చాడు. అందులో లక్ష్మీపురంచేరమని అన్నయదేవుడు పార్వతిని కోరినట్లు వ్రాసింది. జైనులతో పోరాడమని శైవులు మాట యిచ్చింతరువాత, జంగాలు ఓరుగల్లు పోనీయకపోతే గ్రామంలోనే నిలిచిపొండని జైనులకు హితవు చెప్పి పార్వతి లక్ష్మీపురం ప్రయాణమైంది. ఆ క్రొత్తపురుషునివెంట గ్రామందాటి క్రోసుదూరం పరుగెత్తింది. ఇంతలో వెనుకనుంచి శంఖాలు ఊలపెట్టుతున్నాయి. ఏదో ఆపదమూడింది. వెనుదిరిగిచూస్తే నలుగురు జంగాలు పరుగిడి వస్తున్నారు. ముందుకు పారిపోకుండా తనవెంటనున్న పురుషుడు మార్గానికి అడ్డునిలిచాడు. అతడు అన్నయదేవుని అనుచరుడుగాడు. దేవీపురంలో పార్వతి జైనులతో మాట్లాడేప్పుడే జంగాలు కుట్రజేసి ఒకనిని ఆవేషంతో రప్పించుకొన్నారు. పార్వతి మోసపడింది. జంగాలామెను బంధించి ఓరుగల్లువైపుకు నడిపించారు.

పార్వతికి సంభవించిన దుస్థితి అన్నయదేవు డెరుగడు. పార్వతి వ్రాసిన ఉత్తరంచూసి పద్మావతితో దేవీపురం ప్రయాణమైనాడు. శివయోగిమఠానికి సమీపంలో చిన్నచిన్న కొండగుట్టలమధ్యనుంచి దేవీపురానికి కాలిబాటవుంది. ఆ మార్గాన నడిచిపోయే యీ జాతీయ జీవులను ఘాతుకజంగాలు పసిబట్టినారు. జాతీయవృక్షానికి అన్నయదేవుడే జీవగఱ్ఱ! దేశంలో వ్యాపించిన ఆ వృక్షశాఖలు పూచిన పూలల్లో పిందెలు జారకముందే ఆయనను మొదలంట నరికివేస్తేనే

తిమ మతవృక్షంయొక్క విషవాయువులు జైనుల నీదేశంలోనుంచి తరిమివేయగలుగుతాయి! అవనుదొరికిందే తడవు జంగాలు పరుగిడి అన్నయదేవుని, పద్మావతిని బంధించి తెచ్చారు. మఠంలో అన్నయ దేవుని శివలింగానికి బంధించారు. ఆ ప్రక్కనే గది ఉంది. పద్మావతి నందులోకి కొప్పుబట్టి యీడ్చారు. ఆ గదిలోనే పార్వతి రోదనచేస్తూ పద్మావతిని కౌగలించింది.

పద్మా: ఈ స్థితి నీ కెట్లా సంభవించింది పార్వతీ,

శివయోగి అట్టహాసంచేస్తూ జంగం గుంపుతో ప్రవేశించాడు.

శివ: నన్ను సంతృప్తిచేయకపోతే, మీ స్థితి మరోవిధంగా మారు తుంది. చెప్పు మీరంతా జైనుల నెందుకు అభిమానిస్తున్నారు?

పద్మా: జైనులని మే మభిమానించటంలేదు. జాతికి మావంటి మానవులని.

శివ: మీ శివమతం, మీ యాచారాలు - ఎట్లా అంటుకొని అభిమా నించారు.

పద్మా: వాళ్ళ ఆర్తనాదం ఆచారబంధాలను తెంపివేసి మతంలోనుంచి మమ్మ్మ ఆకర్షించింది.

పార్వ: మాకు మతంలేదు. మేము మానవులం! మతాలు వొదిలేశాం!

శివ: మతాలతోబాటు మానాభిమానాలుకూడా వొదిలెయ్యండి...
ఒ కేశిష్యులు, గుడ్డలూడదీసి అన్నయదేవుని యెదుట మానభంగం చెయ్యండి వీళ్లకు.

పద్మా: మా గురుదేవుని అవమానించే అవకాశం మీకు దొరకనియ్యం!

ఆ మానవతులు చేతిగోళ్ళల్లో విషం దాచుకొన్నారు. వేళ్లు నోట్లో ఉంచుకొని విషం చీకుతున్నారు. పరాభవించేందుకు జంగాలు పట్టుకోబోతే శవాలే చేతికి దొరికినాయి. ఆ శవాలను యీడ్పించుకొని పోయి, అన్నయదేవుని యెదుటపరుస్తూ...

శివ: వీళ్లు నీకోసమే చచ్చారు అన్నయ్యా!

అన్న : నా కోసమే గాదు, మానవజాతి గౌరవంకోసం నా బిడ్డలు మరణించారు. నీ పాపపుపొట్ట ఇప్పుడైనా నిండిందా? ఇప్పుడైనా శాంతించావా?

ఒక శవం తలక్రింద, ఒకటి కాళ్లక్రింద వేసుకొని అన్నయదేవుని కెదురుగా పడుకొన్నాడు శివయోగి నవ్వుతూ.

శివ : ఎందుకు శాంతించను? ఇది నా పరమశివుని వేదభూమి! జైనులు యజ్ఞపశువులు. ఆ పశువుల హాహాకారాలు నా ప్రకోపిత హృదయానికి శాంతిగీతాలు! అహాహా శాంతి – సుఖం – ఆనందం!... ఛీఛీ కాస్త ఆగు. ఈ శవం తలక్రింద మెత్తగా లేదు.

పద్మావతి శవం కాళ్లక్రిందకు జరిపి, పార్వతిశవం తలక్రింద వేసుకొన్నాడు.

శివ : ఇప్పుడుచూడు యీశ్వరుని విభూతిమయస్వరూపం, అన్నయ్యా-యెంత తెల్లగా, శుభ్రంగా కనుపిస్తోందో...అప్పుడే నీకూ కనుపించిందా విశ్వరూపం...ఆనందబాష్పాలేనా నీకళ్లల్లో!

అన్న : పిశాచాలకైనా సహజంగాని యీ పాపకృత్యాలు మానవమాత్రుని కానందమిస్తాయా?

శివ : ఒరే మూర్ఖుడా నా మఠంలో నాయెదుట నిలిచినా నీకీ పాపపు చింత పోలేదూ? మతద్వేషంతో మానభంగం చేసేందుకు నీ మనస్సు ఉవ్విళ్లూరటంలేదూ?

ఇంతలో ఒక చిన్న జంగం ప్రవేశించి గురుపాదాలమీద తల వాల్చాడు.

శివ : చూడు అన్నయ్యా, పరమతస్థులను తొక్కిన పాదాలమీద శిష్యుని భక్తి! నీ బలహీన హృదయానికి ఆ సంతోషంలేదుగదా? ఇవ్వాళ జైనులను హింసించి నా శివభక్తు లెట్లా ఆనందిస్తారో తెలుసునా – తల్లి రొమ్ముమీదే పిల్లనుబాది నవ్వుతూ చంపుతారు. శివునికి రక్తాభిషేకం చేస్తారు. ఆ పుణ్యం నీకు లేదుగదా? ఏమిరా శిష్యా!

శిష్యు: చిత్తం దేవరా, రజియా కళ్లు తెరుస్తోంది.

శివ: నే నెంత త్రాగినా ఆమెకు తృప్తిలేదుగాబోలు! ఆమెను తీసుకురా!... చూశావా అన్నయదేవా నా మత మహత్యం, దేవగిరిదుర్గంలోనుంచి మహమ్మదీయస్త్రీనిగూడా నాపాద దాసిని చేసేందుకు దేవు డీడ్చుకొనివచ్చాడు. అదుగో... చూడు ఆమె సౌందర్యం!

ప్రేమవీకులదగ్గిరనుంచి రజియా సెలవుతీసుకొంది. గౌరి ఆదేశించిన ప్రకారం ఆమె తిరిగి జంగాలకే పట్టుబడింది. జంగాలామెను మఠంలోకి తీసుకొనిపోయినారు. శివయోగిని క్షణంలో వశపరుచుకొంది. ఇప్పుడు చిన్న జంగంవెంట రజియా ప్రవేశించి, తనచేతిలో కల్లుగిన్నె నందిస్తూ ఆ శవాలను చూసింది. ఆమె భయంతో కళ్లుమూసుకొని,

రజి: హో నేనేం ఘోరంచేస్తున్నాను?

శివ: అరెరెరే - యిది ఘోరమా - యిది అరె, అరె, అరే శిష్యా నీవు చెప్పరా - జైనులు బ్రతికివుంటే అసహ్యమా, చస్తే అసహ్యమా?

శిష్యు: బ్రతికిఉంటేనే అసహ్యంగా ఉంటారు. వాళ్ల ముఖంచూస్తేనే పాపం!

శివ: భలీ బ్రహ్మజ్ఞానీ, జయించావుపో - జైనస్నేహమమతను!... నేర్చుకొన్నావా రజియా, పాఠం!!

రజి: ఊఁ.

శివ: నీవు సామ్రాజ్య సింహాసనంకోరుతావా, రాణీవౌతావా?

రజి: ఊఁ.

శివ: అయితే ముం దీశవాలమీద నా ప్రక్కన కూర్చో. తరువాత సింహాసనంలో నా తొడమీద కూర్చోగలుగుతావు. వచ్చి కూర్చో; యీ శవాలమీదే నీకు శివదీక్ష యిస్తా:

రజి: వొద్దు, నే కూర్చోలేను.

శివ : సింహాసనం చూస్తే నీ వీఙాట అనలేవు రజియా! పోయి దుర్గంలో చూసిరా సింహాసనం! ఊఁ, యిదిగో ముద్రిక!

ఒక గుర్తును రజియా చేతికందిచ్చాడు. ఆ నరకదృశ్యంలోనుంచి బయటబడిందే తడవు, ఒక గుఱ్ఱమెక్కి బాణవేగంతో దుర్గంలోకి పరు గెత్తింది. ఇక్కడ శివయోగి శవాసనంమీద కల్లు త్రాగుతూ :

శివ : ఎంత తియ్యగా ఉంది యీ కల్లు అన్నయ్యా! రజియా హస్తం వొట్టి మృదులం మాత్రమే అనుకొన్నా! అమృతంగూడా! ఇంతకూ అల్లాఫ్‌ఖాన్‌దే పుణ్యం, రజియాను నాకు పంపించాడు.

అన్న : ఓరి దేశద్రోహీ!

శివ : నేనా దేశద్రోహిని... నే నీశ్వరుని శాంతిదూతనని అల్లాఫ్‌ఖాన్ మెచ్చాడు. రజియాను నాకు 'శాంతిబహుమానం' పంపించాడు. పరమతద్వేషంతో విశ్వేశ్వరుని శాంతిపరచే పరమభక్తుడు నన్ను మించి యింకొకడున్నాడా?

అన్న : నీ వ్యామోహమే నీ ద్వేషం.

శివ : నా వ్యామోహమా మూర్ఖుడా! ఇది నా వ్యామోహమైతే సజీవప్రాణులు నిర్జీవమయ్యేవరకు తృప్తిదీర అనుభవించి పారేసే వాడను. కాని శవాలమీదే యెందుకు దొర్లుతున్నాను, సుఖిస్తు న్నాను? ఇది వ్యామోహంగాదు, ద్వేషం, మతద్వేషం! ఎందుకో తెలుసునా యీ ద్వేషం? నా యీశ్వరునితో సమునైనవాడు ఇంకొకడున్నాడని నా యెదుట ప్రదర్శించి నన్నుడికిస్తే నే నోర్చ లేను. నా దేవుని సత్యంకోసం, నా దేవుని స్థిరంకోసం, నేనా పర మతస్తులను చెండాడుతున్నాను. వాళ్ల చావులే నా దేవునికి జయం! ఆ చావులలోనే, కుప్పలుబడిన ఆ శవాలల్లోనే నా మతశక్తి ప్రదీప్త మాతుంది. అందుకే ఈ శవాలు చూస్తే నాకీ యానందం! వాళ్ల శవాలు చూస్తే యెందుకానందమో, వాళ్ల నీచజీవనం చూసినా అందుకే సంతోషం! ఎందు కీహత్యలో, అందుకే మానభంగం! అయితే అది నా కామతృప్తికోసం గాదు. ఆ మానభంగంతో పర

మతాలను అవమానిస్తున్నాను, నీచంజేస్తున్నాను, అంటరాని పర మతస్తురాలైనా రజియాను మోహంతో అంటుకోలేదు. అవమా నించేందుకు ద్వేషంతో అంటుకున్నాను. ఆమె బ్రతుకు నీచంజేసి, ఆమెకు నా పాదాలు పిసుకమని అందిచ్చాను, నా మతగౌరవం కోసం, ప్రతిష్ఠకోసం! అన్నయా - యీ ద్వేషంతో స్త్రీహత్య జెయ్యి, శిశుహత్యజెయ్యి—నీ 'నిష్కామకర్మను' యీశ్వరుడు మెచ్చుతాడు. బొందెతో నీకు కైలాసమిస్తాడు.

ఆ పాపిష్ఠుని మాటలు సహించలేక అన్నయదేవునిలోనుంచి ప్రాణాలు యెగిరిపోయినాయి. దానికదే తల రొమ్ముమీద వ్రాలింది. నల్లగుడ్లు కనురెప్పలక్రింద దాగి ధ్యానతత్పరుడైనట్లు కనుపిస్తున్నాడు. ద్వేషమయ ప్రపంచాన్ని పరిహాసిస్తూ ఆయన ముఖంలో నవ్వులు నిల్చినాయి. ఆ తాగుబోతుకళ్ళకు మైకంగప్పి ఆయన కీర్తిశేషుడై నట్లు గుర్తించలేదు!

శివ: సిగ్గుతో తలవొంచుకొన్నావేం అన్నయదేవా, ఇప్పటికి నీ మత ద్రోహం గ్రహించావా? ద్వేషంతో కాళ్ళక్రింద నలగద్రొక్కే బదులు, ప్రేమహస్తాలతో పరమతస్తులను పోషించమంటావు, నీవూ, ప్రతాపరుద్రుడూ! ఆర్థికసమానత్వం శాసించి జైనులను, శైవులను ఏకజాతిగా భావించమంటావు. అయితే మతాలో - ఆచారాలో - భేదించిన ఆచారాలే మతాలమధ్య పరస్పరవిరోధం ప్రేరేపిస్తూ ఉంటే ఒక మతస్తుడు వేరొక మతస్తుని సజాతీయుడని ఒప్పుకో నిస్తాయా? మతం ఒక్కటైతేనే, జాతీ ఒక్కటేనంటాయి ఆచారాలు! మతాలు రెండైతే జాతులూ రెండేనంటాయి. ఇప్పుడీదేశంమీద జన్మహక్కు యే మతస్తునిది? అది తేల్చుకొనేందుకే యీ సంఘ ర్షణ! యీ కలహంలో యెవరుబ్రతికితే వారిదే యీ జన్మభూమి, వారిదే సిరి, సంపద, సర్వస్వం!! తెలిసిందా యిప్పుడు. ఆచారాలు, వ్యక్తిస్వామ్యం స్థిరపరచే శాసనంవంటివి! ఈదేశసంపదమీద తన వ్యక్తిస్వామ్యం దేవుడే శాసించాడని నమ్మినతరువాత, యితర

దేవుళ్ళను, మతాలను, ఆచారాలను అభిమానించి ఇతరులు తన వాళ్ళని తన సోదరులని, తన సమాసములని అంగీకరిస్తాడా, అంగీకరించడు. పరమతస్థులను తన దేశంలో గుక్కెడునీళ్లైనా తాగనియ్యడు. మానవసమాజంమీద అల్లుకొన్న పరమతాల నన్నిటినీ చెదపుట్టలు చెక్కినట్లు కత్తిపెట్టి చెక్కి, ఒకే సాకార పరమలింగాకృతికి,మానవులంతా ఒక్కజాతిగా ఒకే శైవులుగా, ఒక్క ఆచారాలతో, నియమాలతో, భక్తితో మొక్కేట్లు యత్నిస్తాడు. చూశావా, మతావేశంలో వాంఛనీయమైన దేశభక్తి యెల్లా నిండిఉందో! ఆ దేశభక్తితోనే జైనుల నీమూలనుంచి యీ మూలకు నరికివేస్తాడు. పాపం లేదు. జైనులను చంపివేస్తాడు. పాపం లేదు. చంపేస్తాడు...

" జిన సమయస్థుల శిరముల దురిమి
మును విష్ణుసమయుల ముక్కులు గోసి
యద్వైతులను హతహతము గావించి
విద్వేష బౌద్ధుల విటతటమాడి
చార్వాకవాదుల గర్వంబు లణచి... "

మఠద్వారంలో యేదో అల్లరి జరుగుతోంది. ఆ మత్తులో, ఆ ఉత్సాహంలో అతని కేమీ వినిపించటంలేదు. ఆనందంతో రాగాలుతీస్తూ, పాటపాడుతోంటే చేయిపట్టుకొని నడిపిస్తూ రజియా చక్రవర్తిని ప్రవేశపెట్టింది. ప్రవేశించగానే ఎదురుగా అన్నయదేవుని బాధిత శరీరం కనుపించింది. ప్రతాపచక్రవర్తి ఆయన పాదాలమీద చుట్టుకొనిపోయినాడు. ఆ ప్రక్కన జటాశంకరుడు, వీరసోముడు కూలబడినారు. చూస్తుండగానే యెంతోమంది జైనులు, శైవులు ప్రక్కకు రిసిపోతున్నారు. శివయోగికి కల్లుమత్తు జారింది. కాని, అతడు భయపడలేదు. తన మతభక్తికి మెచ్చి, ప్రజలు ప్రతాపునే యీడ్చుకొనివచ్చారని భ్రమించాడు.

శివ : అరే ప్రతాపునిగూడా బంధించి తెచ్చారే, ఆ మతద్రోహిని యీడ్చుకొని రండి, శిక్షిస్తాను.

అతని సాహసం చూసి ప్రజ లాశ్చర్యపడినారు. రజియా దుఃఖితుడై యున్న వీరసోముని చెయ్యిబట్టి లేవదీస్తూ—

రజి : అన్నా, ఆ స్త్రీలెవ్వరో చూడు. ఆ దుర్మార్గుడు వాళ్ళమీద పడుకొన్నాడు.

వీర : లే, లేరా కుక్కా !

అంటూ వీరసోముడు శివయోగిని తన్ని లేపాడు, శివయోగి చీకాకుతో లేచి, ప్రజలను చూస్తూ 'గురువును తన్నిన ద్రోహిని చంపే సెయ్యండి !' అని కేక వేశాడు. అతని మొఱ యెవ్వరూ వినిపించుకో లేదు. ముఖాలమీద మూగియున్న దీర్ఘకుంతలాలు తొలగించకుండానే వారిని ప్రజలు గుర్తించారు. 'మా పార్వతి, మా పద్మ' అంటూ వీర సోముడు పార్వతిమీదపడి రోదనచేస్తూంటే, జటాశంకరుడు వచ్చి పద్మావతిని వొళ్లో చేర్చుకొన్నాడు. అన్నయదేవుని పాదాలమీద నుంచి లేచివచ్చిన ప్రతాపుడు వారి యెదుట తూలిపడినాడు దుఃఖంతో. ఆయన పార్వతీ, పద్మావతులను చూస్తూ—

ప్రతా : సర్వనాశనమైంది. ఏ బొమ్మలను ఆదర్శంగా చూసుకొని లోకమంతా మంగళరూపాలను చిత్రించదలచానో ఆ బొమ్మలను నా చేతిలోంచి లాగివేశాడు, చించివేశాడు. ఒరే శివయోగీ యీ ముగ్గురూ శైవులేగదా, వీళ్ల ప్రాణా లెందుకు తీన్నావు. ఇప్పుడు చెప్పు, శైవమతానికి నీకంటే పరమశత్రువు లెవ్వరో.

శివ : నేను శత్రువును గాను. నా శైవమతం సంకరం చేసినవాళ్లను చంపేశాను.

ప్రతా : పరమతస్థులను ప్రేమించి సేవిస్తే నీ మతం సంకరమౌతుందా? కాని వ్యామోహంతో వాళ్లను పిండి పీలిస్తే, నీ మతం పవిత్ర మౌతుందా ! ఓరి దుష్టుడా ! నీ మతద్వేషంలోని వ్యామోహానికి మితిఉందా !

రజి : ఓ సోదరులారా, నా మీద మోహంతో మీ దేశాన్ని, మీ రాజ్యాన్ని తన భోగంకోసం అలూఫ్‌ఖాన్‌కు అమ్మజూశాడు.

శివ : రజియాయేనా మాట్లాడేది. నా రజియా - రజియాను దాసీగా చేసుకొని, మహమ్మదీయమతాన్ని అవమానించా. నా దేశ గౌరవం కాపాడా, నా మతప్రతిష్ఠ నిలిపా. అన్ని మతాలను అవమానిస్తున్నా. హా - హా -

శివయోగి పిచ్చివాడైనాడు. ఆ ద్వేషంతో అతనికి మతిపోయింది.

ప్రతా : అందరినీ అవమానిస్తున్నావు, క్షోభ పెట్టుతున్నావు.

ఇంతలో అన్నయదేవుని శరీరం నలుగురుబట్టి ప్రతాపుని యెదుట నేలమీద ఉంచబోతుంటే సైనికులను వారిస్తూ.

ప్రతా : ఆఁ-ఆఁ-జగద్గురు శరీరం క్రిందబెట్టవొచ్చా, పాపంతగలదూ ! ఇట్లా ఇట్లా,నా వొళ్ళో ఉంచండి! తండ్రీ అన్నయదేవా, నీ యాధ్యాత్మికబలంతో నిర్మించిన యీ సామ్రాజ్యం నీతోనే కూల్చివేశాడే దుర్మార్గుడు. ఇంక మాకు నిలువనీడేదీ ! ఓ సోదరులారా, మానంవహించారేం ? చెప్పండి మీ ధర్మమేమో ! పరమత ద్వేషమే స్వమత వినాశనంచేస్తుందని నా వాదన ! రజియా మీ కళ్లు తెరిచి ఆ మాటలో యథార్థం చూపిస్తోంది. రజియా మీకు ధర్మభిక్ష పెట్టుతోంది. తీసుకోండి, రజియావలె మీరుకూడా అందరినీ ప్రేమించి, అందరి నీతి, సౌఖ్యం, స్వాతంత్ర్యం కాంక్షిస్తారా, లేక ద్వేషిస్తారా !

శివ : ద్వేషిస్తాం !

ప్రతా : ద్వేషించి, ఈ స్త్రీహత్యలు, ఈ దౌర్జన్యాలే మీ స్వమత సాంప్రదాయాలని భావిస్తే, నన్నీ శవాలతో కట్టేసి స్మశానంలో కీడ్వండి ! సింహాసనంలో కూర్చొని నేనీ స్త్రీ మానభంగం శాసించలేను.

శివ : నేనే చక్రవర్తినౌతా, నేనే శాసిస్తా - పరమతస్థుల నందరినీ నాశనంచేయిస్తా - హా - హా !!

ప్రజలందరిలో ఆవేశం పెచ్చుపెరిగింది. కొందరు కోపంతో పళ్లుకొరికినారు. పద్మావతిమీద పడి యేడుస్తున్నాడు జటాశంకరుడు.

వీరసోముడు పార్వతిని వక్షంమీద నొక్కుకొని దుఃఖం ఆపుకోబోయి నాడు. లాభం లేదు. వీరసోముడు రోదనజేస్తూ ప్రతాపుని ఒళ్లోకి ఒరిగి పోయినాడు.

ప్రతా: దుఃఖించు వీరా, దుఃఖించు - నిన్న ఓదార్చే శక్తి నాలో నశించింది. దేవతలే దుఃఖిస్తున్నారు. మనకా ఊరట! అన్నయ దేవుని శిష్యకోటిలో నా చెల్లెలు గంగ, పార్వతి, పద్మా. నా పద్మ, సామ్రాజ్య కళ్యాణదేవత—ఏదీ నా పద్మ...

జటాశంకరుని వొళ్లోనుంచి పద్మావతిని తన వొళ్లోకి లాక్కొన్నాడు. ఆమె ముఖంలో ముఖముంచి యేడుస్తూ...

ప్రతా: మతగురువుల పొట్టను బెట్టాను. ఎందరో ప్రేమ వీరులను, ఇంకెందరో జైన, శైవధీశాలురను ఈ జంగాల పొట్టను బెట్టాను. జాతి సమూలంగా నాశనమైంది. ధర్మం నిర్మూలనమైంది. జీవన్మృతులమై మన మిగుపురం మిగిలాం! శోకించు వీరా. దుఃఖించు. అధర్మం మననుగూడా చంపేంతవరకు దుఃఖించు, ఇంకా దుఃఖించు, ఇంకా, యింకా గట్టిగా—అహో.

చక్రవర్తితోపాటు కనుపుమూడి అందరూ గొల్లుమన్నారు. శివయోగిమాత్రమే నవ్వుతున్నాడు. ఇంతలో గౌరి యెక్కడనుంచో వచ్చింది. ఆమె జనాన్ని నెట్టుకుంటూ ముందుకు వస్తోంది. ఆమె చేతిలో పదునుకత్తి తళతళా మెరుస్తోంది. ఆమె క్రోధంతో పిచ్చిదైపోయింది. మత విధ్వంసం యెక్కడెక్కడ విప్లవం సృష్టిస్తోందో యీ హత్యలువిని పరుగెత్తుకొని వచ్చింది. ఆ జనంలో యెవరెక్కడో ఆమెకు తెలియటంలేదు. ఆమె యెలుగెత్తి పిల్చింది.

గౌరి: ఓ ప్రతాపా.

ప్రతా: ఆఁ సోదరీ, ఇల్లారా...ఇక్కడ, ఇక్కడ చచ్చిపోదాం!!

గౌరి: ఏడీ మా ప్రతాపుడు. నీతిరక్షకుడు? ఏదీ మా పద్మ, మా పార్వతి...అరే చంపేశారే... ఎవరూ చంపింది? నువ్వేనా శివ

యోగీ—నువ్వేనా— నా జగద్గురువును చంపింది, రాక్షసీ, చావు, చావు, చావు...

చావమంటూ నరుకుతోంది. శివయోగికి చెయ్యి తెగింది, కాలు తెగింది. కూలిపోయినాడు. మెడ తెగి మొండెమైనాడు. ఇంకా నరుకు తూనేవుంది. ఆమెను వారించేవా రెవ్వరూ లేరు. అంతా వేడుకగా చూస్తున్నారు. ఆశ్చర్యపడుతున్నారు. ఆమెకారౌద్రం శాంతించలేదు. ఆ శరీరం ముక్కలు నరికి మాంసం పైకెగరేసింది. పేగులుతీసి మెడ హారం వేసుకొంది. రక్తంలో చేతులు తడిపి ముఖానికి పూసుకొంది. అప్పుడు శాంతించింది. శాంతించి ఆనందంతో ఆ రక్తంలో చిందులు తొక్కుతోంది.

ప్రతా: ఓ రుద్రమూర్తీ, ప్రళయమూర్తీ, సోదరీ శాంతించు!

ప్రతాపుడు నమస్కరించగానే ప్రజలంతా నమస్కరించారు. వీరసోముడు రివ్వునబోయి మతపీఠాన్ని ఒక్క తన్ను తన్నినాడు. అది విరిగి తుంపులై నేలదొర్లింది. చూస్తూ ఉండగానే శైవమతానికి శైవులే నిప్పు ముట్టించారు. పారిపోయే జంగాలను పట్టి చంపారు!!

## ౨౦

వెంటనే ప్రతాపచక్రవర్తి జాతీయధర్మం శాసించాడు! రాజ్యాధికారంమీద మతం తన స్థానం కోల్పోయింది. ఇది మత గురువులు సహించలేకపోయినారు. రాజ్యంలో తమ మతం లేకుండా జేస్తే, ప్రజలకు రాజ్యమే లేకుండా జేసేందుకు జంగాలు శపథంచేశారు. శైవసామంతులలో కొందరు, శైవవర్తకులలో కొందరు, ఈ కుట్రను ప్రోత్సహించారు. నగరంలో ఆమూల యెక్కడో నిప్పు ముట్టుకొంటోంది. రాజ్యంలో ఆ మూల గ్రామాలు తగులబడుతున్నాయి! పరమశివుడు మూడోకన్ను తెరిచినాడని జంగాలు ప్రచారంచేస్తున్నారు. ఈ దిక్కున రహస్యంగా హత్యలు, ఆ దిక్కున బహిరంగ అంతః కలహం! ఇది జైనులతో కలిసిన పాపం, మతగురువులను చంపిన పాపం, ఈశ్వరుడు త్రిశూలంతో పొడిచేస్తున్నాడని జంగాలు మహిమలు, మాయలు ప్రచారంచేస్తున్నారు. సామ్రాజ్యంలో నలుమూలలా అగ్నిజ్వాలలు, హత్యలు!

మొన్నటికి రాజశాసనం జాతీయదృక్పథ విశేషం! నిన్నటికి మతశాసనం అంతశ్శత్రుప్రకోపితం! నేటి ప్రజాశాసనం సమూల మతవినాశనం! వల విసరి ఆక్రమించినట్లు చక్రవర్తి శాసించిన సమత్వ ధర్మం సామ్రాజ్యమంతటా అమలుజరిగే ఉపాయం లేదు. శివయోగి మతశాసనం నిన్నటిది గాదు. అది యెన్నేండ్లనుంచో రహస్యంగా అమలుజరుగుతోంది. చివరకు జంగాలు, సామంతులు గలిసి ఒకేరోజున, ఒకే సమయంలో యీ మతశాసనం అమలు జరిపేందుకు కుట్ర లాలోచించారు. సామ్రాజ్య కేంద్రనగరమైన ఓరుగల్లులో జైనులు తరుమబడే క్షణంలోనే సామంతరాజ్యాలలో

ఆ రాజులు జైనులమీద దౌర్జన్యంచేశారు. అన్నిచోట్లనుంచి జైనులను తరిమివేస్తున్నారు. శైవరాజులు సైన్య సహాయంతోనే జైనులను తరిమి వేస్తుంటే, ఇక్కడ రక్షణలేక జైనులు దేవఘడ్‌కు ప్రయాణమైనారు. ముందు బోయి మతశాసనం జైనులను తరిమిస్తుంటే, ఆ వెనుక సమత్వశాసనం రాజుల చేతికందుతోంది. అయినా సామంతులు తమ చక్రవర్తిని తిరస్కరించారు. బాధలు పడలేక లక్షలకొలది జైనులు సామ్రాజ్య సరిహద్దులు దాటినారు.

సామంతులు స్వేచ్ఛను గోరినారు. సామ్రాజ్య ఛత్రంక్రింది నుంచి జారిపోయి తమ భూములను తామే యేలుకొని, తామే అను భవించేందుకు ఆశపడినారు. ప్రతాపుడు వారి స్వాతంత్ర్యం అంగీకరించక బోతే, అలూఫ్‌ఖాన్ అంగీకరిస్తున్నాడు. ఆ తురక రాజుతో రహస్యంగా స్నేహం చేసుకొన్నారు. వారిలో వ్యామోహం బలిసింది. ఆత్మరక్షణ ప్రేరితులై, జైనులు అలూఫ్‌ఖానుని శరణ్యం గోరినట్లే, ఈవ్యామోహ పరులుగూడా ఆ పాముపగడకిందే గొప్పవాళ్లయేందుకు ఆశించారు.

సామంతులే గాదు, ఇదివరకు కేంద్రాధికారంలో బాధ్యత పదవు లలంకరించిన శైవులుగూడ కొందరున్నారు. శివయోగి మహత్యంవల్ల తమ సామర్థ్యానికి మించిన అధికారాలు వీరికి లభించాయి. ఈ సమత్వ విధానంలో వారి కీయధికారాలు దక్కనేదక్కవు. అది గాక, వారు చేసిన దుర్మార్గాలు తక్కువగావు. మునుముందు సామ్రాజ్యంలో వారికి నిలువనీడ ఉండదేమో! అందుకని అధికార వ్యామోహ పరులు కొందరు దేవఘడ్‌కు పారిపోయినారు. అట్టివారిలో జటా శంకరు డొకడు. ఈ యధికారమోహం తన ధర్మపత్నిని చంపివేసినా అతనికి బుద్ధిరాలేదు. తిరిగి సర్వసేనాధిపతి అవటమే అతని జీవిత విశేషం! ఆ యదృష్టం అతనికి శివయోగితోనే నశించింది. తన జన్మ భూమిలో నలుగురిలో తలవొంచి తిరిగే గతిపట్టింది. అందుకని అతడు జన్మభూమి కెదురై, సగర్వంగా తలయెత్తి నిలువగోరాడు. శత్రుపక్షంలో జేరి, జన్మభూమిమీదే దండెత్తేందుకు సిద్ధపడినాడు. జటాశంకరుడు

మాతృద్రోహాని కెప్పుడూ వొడిగట్టేఉన్నాడు. ఇప్పుడా పాపప్రభిక్షకోసం దేవఘుడ్ దుర్గద్వారం యెదుట నిలిచాడు. ఓరుగల్లు దుర్గరహస్యాలన్నీ అలూఫ్ఖానుని చెవిలో పాటలు పాడి మెప్పించి, ఆపదవిని బొందుతాడు.

దేవఘుడ్ దుర్గద్వారం యెదుట మైదానంలో వలసవచ్చిన జైన ప్రజలు లక్షలకొలది యువరాజ దర్శనంకోసం సమకూడుతున్నారు. ఆ వచ్చే జైనులను ఆహ్వానించి, ఆదరించేందుకు మహమ్మదీయ ప్రభుత్వం నిశ్చయించింది. మహమ్మదీయ మతగురువులు, పండితులు, అధికారులు, ఉద్యోగులు ఆ జైనులను ఆహ్వానిస్తున్నారు. ఆ మతగురువులు చేసే మర్యాదలు, ఇచ్చే కౌగలింతలు అనుభవిస్తుంటే— తమకు తెలియకుండానే తమ కులదేవుడు నరకంలోనుంచి స్వర్గద్వారం దగ్గిరకు తరిమినాడనిపిస్తోంది. కోటబురుజుమీద ఒక వేదికను నిర్మించి అందంగా అలంకరించారు. అలూఫ్ఖాన్ అందులో నిలిచి వరాలు పలుకుతాడు. ప్రజలంతా ఆశతో ఆ మందిరంవైపే చూస్తున్నారు. జటాశంకరుడు ఆ జనసమూహంలోనే ఒక మూల తన సహచరులతో గూడి నిలిచిఉన్నాడు. ఇంతలో యెవరో తన భుజంమీద తాకినట్లు తోచింది, వెనుదిరిగి చూశాడు. రజియా కిలకిల నవ్వింది.

వలస వచ్చిన త్రిలింగదేశ ప్రజలలో అలూఫ్ఖాన్‌కు వ్యతిరేకంగా ధర్మప్రచారం చేసేందుకు రజియా ఓరుగల్లునుంచి యిక్కడకు పరుగెత్తి వచ్చింది.

ఆమె మధురహాసం అందరినీ ఆకర్షించింది. జటాశంకరుడు భయపడినాడు.

రజి : పద్మావతీ పతివి, జటాశంకరులు గారా తమరు.

జటా : అవునవును.

రజి : నన్ను గుర్తించారా ?

జటా : ఆఁ...నీవు రజియావు గాదా.

రజి : అవును. ఇక్కడికి దయచేశారేం తమరు ? సేనాధిపతులయ్యేందుకేనా ?

జటా : నా రహస్యం నీకెట్లా తెలిసింది రజియా ?

రజి : నీ పదవీ వ్యామోహం యెవ్వరికీ తెలియంది గాదు.

జటా : వ్యామోహమా ?

రజి : అవును. పదవి కోసమేగాదా, నీ భార్య ప్రాణాలు శివయోగి కమ్ముకొన్నావు.

జటా : నే నెందుకు అమ్ముకొన్నాను ? స్వయంగా తన ప్రాణాలు బలి పెట్టి, శివయోగి కీ లోకంలోను, నాకు ఓరుగల్లులోను స్థానం లేకుండా జేసింది. ఇప్పుడు కాకతీయ ప్రభుత్వంలో నాకు గౌరవపదవే లేదు.

రజి : అందుకని అలిగి, తల్లి రొమ్ము గుద్దేందుకు తయారైనావు గాబోలు !

జటా : ఏయ్ రజియా, మర్యాద తప్పి మాట్లాడుతున్నావు. ఇక్కడ నా గౌరవోద్యోగం త్రిలింగ దేశానికి అపరాధం చేస్తుందా ?

రజి : అలూఫ్ ఖాన్ దగ్గర సర్వసేనాధిపత్యం నీ మాతృదేశం మీదే గాదా, నిన్ను దూకిస్తుంది. నీ శక్తిని నీ దేశంకోసం ధారబొయ్య లేకపోయినావు.

జటా : నేను దేశంకోసం గాదు. ఓరుగల్లులో ఉన్నా, దేవఘుడ్‌లో వున్నా, నేను పదవికోసం – పదవి నా గౌరవంకోసం, తెలిసిందా ?

చాలా పెడసరంగా మాట్లాడి, రజియాకు కోపం కలిగించాడు. ఆమె యెంతో అసహ్యంతో చుట్టూ మూగిన ప్రజలను చూసి ప్రశ్నించింది.

రజి : ప్రజాసేవకుడుగాని స్వార్థపరుని పదవులిచ్చి పోషించేరాజు మాత్రం మీకు రక్షకుడౌతాడా ! జైనసోదరులారా, శైవుల చేతిలో దాస్యం తప్పించుకొని, ఇక్కడ ఆఫ్ఘనులకు బానిస లయ్యేందుకు వచ్చినారుసుమా !

ప్రజ : ఇక్కడ బానిసతనం లేదు. చూడు ఒక్కనాడైనా యిల్లా ఆదరించారా శైవులు ! ఆ యధికారు లెట్లా కౌగలిస్తున్నారో చూడు !

రజ: ఒకరోజున అలూఫ్ఖాన్ నన్నిట్లాగే కౌగలించాడు. అతని అరచేతిలో స్వర్గముందని భ్రమించాను. కాని రాజకీయ ప్రయోజనంకోసం పువ్వును నలిపినట్లు నా జీవితాన్ని నా చేతులతో నలిపి వేశాడు. తన సామ్రాజ్యం విస్తరించేందుకు నన్ను భోగందాన్నై బ్రతకమన్నాడు. దాస్యవృత్తియొక్క మారురూపమే భోగంవృత్తి! దాస్యాన్ని దరిద్రమే సృష్టిస్తోంది. శైవరాజ్యంలో పోషించినట్లే, ఈ మహమ్మదీయ రాజ్యంలోనూ అభిమానంతో భోగంవృత్తి పోషింపబడేప్పుడు, శైవరాజ్యంలోవున్న అసమానత్వం, బానిసత్వం ఇక్కడమాత్రం లేదని మీ రెందుకు అనుకొన్నారు? పోయి దేవఘడ్ ప్రజల నడగండి; ఎంతమంది మహమ్మదీయులీ రాజ్యంలో తమ దారిద్ర్య విమోచనంకోసం 'అల్లా'ను దీనంగా ప్రార్థిస్తున్నారో! ఇక్కడగూడా గౌరవ వృత్తులున్నాయి. ఆ వృత్తిధర్మంలో మానవునికి అభివృద్ధి లేదు. యజమానుల పాదాలక్రింద మానవ జీవితాలు వికసించకుండానే చీడబట్టి చచ్చిపోతున్నాయి. ఓ సోదరులారా! మతాలపేర్లల్లో మార్పేగాని, రాజ్య విధానంలో మార్పులేదు. మతాలు చీకటి తెరలు. ఆ తెరలచాటున మన నిజమైన శత్రువును చూడలేకపోతున్నాం! ప్రభుత్వ విధానమే మనకు ప్రబల శత్రువు. ఆ ప్రభుత్వంలో వున్న అధికారులే అక్కడ శైవులతో విరోధం పెట్టారు. ఇక్కడ మహమ్మదీయులతో విరోధం పెట్టుతున్నారు. మీ దారిద్ర్య విముక్తికోసం ఇక్కడ మహమ్మదీయులతో మీరు నిత్యం పోరాడితీరాలె! మీరు దరిద్రులై యిక్కడికి వచ్చారు గదా, అయితే అధికారుల కౌగిళ్ళకు మీ కంఠాలు అందిస్తున్నా రెందుకు. వాటిని పిసికివేస్తారుసుమా! ఇక్కడ మీరు దరిద్రుల సహవాసం వెతకండి! మీ దరిద్రజాతినే కౌగలించండి! వారితో ఐక్యమై యీ మత ప్రభుత్వాలను కూల్చివెయ్యండి. ప్రజాప్రభుత్వాలను స్థాపించండి!

ఆ ఉపదేశంవల్ల సత్యప్రకాశమైంది. ఆ వెలుగులో లక్ష్యమేదో గ్రహిస్తున్నారు ప్రజలు. కాని జటాశంకరుడు భయపడినాడు. అతడు

వాళ్ళు మంటలెత్తినట్లు గంతులువేస్తూ, 'రాజద్రోహం, రాజద్రోహం' అని కేకవేశాడు. సమీపానే జైనసత్కారంలో నిమగ్నులైయున్న అధికారులు, ఉద్యోగులు, మతగురువులు పరుగిడివచ్చారు.

మతగురు: ఎవరు రాజద్రోహం చేస్తోంది.

రజి: ఓ మతపిశాచీ, నేనే రాజద్రోహిని, రజియాను.

మతగురు: అరే రజియా, సైతాన్, మతగురువులను చంపేస్తుంది. నన్ను చంపేస్తుంది. చంపేస్తుంది...

భయంతో మతిపోయింది. ఏదిక్కుకు పారిపోవాలోగూడా ఆ గురువుకు తోచలేదు. అతడు వొణుకుతూ, ఆ జనంలోనుంచి పారిపోయినాడు. అధికారులు తెల్లబోయి చూస్తున్నారు. మళ్ళీ రజియా గొంతెత్తి పలికింది.

రజి: ఓ సోదరులారా!

జటా: దీని నోరు మూయ్యండి. ఇది రాజద్రోహం మాట్లాడుతుంది.

ధైర్యంతో జటాశంకరుడు ముందుకు దూకి, ఆమె నోరు నొక్కాడు. రజియా పెనుగులాడబోయింది. మఱి నలుగురు ఉద్యోగులామెను బంధించబోయినారు. అయినా బలం చాలలేదు గాబోలు, ఒక సేనాని బూరా ఊదితే, చాలమంది భటులు పరుగిడివచ్చారు. ఆ భటుల కఠిన హస్తాలలో ఆమె శరీరం ఊపిరాడకుండా నొక్కక పోయింది. అప్పుడు స్థిమితంచిక్కి, ఒక అధికారి సంతోషంతో జటాశంకరుని సమీపించి...

అధి: మీరు గొప్ప రాజభక్తులు. సాహసీ మీరెవరు?

జటాశంకరుడు గర్వంతో లావెక్కి నిలిచాడు. ఆత్మ ప్రశంస గొప్పవాళ్ళ కాచారం గాదు. తనను పరిచయం చేయమని ఓప్రక్కనున్న తన శైవమిత్రునివైపు చూశాడు. అధికారిని చూసి.

అతడు: శైవ సామ్రాజ్యంలో సేనాపతి జటాశంకరులవారు.

అధి: ఓహో, మీరేనా...యీ సామాన్యులలో...యువరాజు మీ రాక కెదురుచూస్తున్నారు. మీకు మా హృదయపూర్వక ఆహ్వా

నాలు. దయచేయండి దుర్గంలోకి. ఏయ్ భటులూ, ఈ రజియాను దుర్గంలో యువరాజు విచారిస్తారు, తీసుకపోండి!

అధికార స్నేహబంధంలో ధర్మద్రోహి జటా శంకరుడు, అధికార నిర్బంధంలో ధర్మానురాగిణి రజియా దుర్గంవైపు నడిపింపబడినారు. ఇంతలో ప్రజలంతా తలలు నేలకు వంచి సలాములు చేస్తూ జయ ధ్వనులు సాగించారు. యువరాజు అల్లాఫ్‌ఖాన్ ఆ వేదికమీద ప్రత్యక్షమైనాడు! ఎదుట విశాలమైన మైదానంలో అగణిత జైన సంతానాన్ని చూస్తే - యిదివరకు అజేయమైన శైవ సామ్రాజ్యం యిప్పుడెంత బలహీనమైందో అతనికి అర్థమైంది. యువరాజు సంతోషంతో, ఉత్సాహంతో ఉచ్చైస్వరంతో ప్రజలను చూసి పలికినాడు.

"ఓ జైనసోదరులారా! మీకు శరణ్యం యిచ్చేందుకు ఖుదా ఆశీర్వాదబలం మాకు అధికంగా వుంది. అధికారబలంతో పీడించే కాఫరు మతస్థులను దండించి, ఈ దేశంలో అల్లా పేర రాజ్యాలను స్థాపిస్తున్నాం! మీరంతా దీనులు. దిక్కులేనివాళ్లు. ఆకలి తీర్చమని మా ద్వారం దగ్గర భిక్షుకులై నిల్చారు. అయితే దేవఘుడ్ దుర్గం ధర్మసత్రం గాదు; మీకు కుంటివాళ్లూ, గుడ్డివాళ్లూ గారు. కాని మీరసహాయులు, శక్తిహీనులు. ఈ దుర్గంలో ఖుదా మీకు శక్తినిచ్చి, ధీరులను చేస్తాడు. కాఫరు శైవులను నాశనం చెయ్యటమే మీ ధర్మం!"

ప్రక్కనే పరచియుంచిన పట్టుగుడ్డలో వెండి, బంగారు నాణెములు పోగుబెట్టి వున్నాయి. అల్లాఫ్‌ఖాన్ దోసిటబట్టి ఆ ధనరాసిని ప్రజల మీదకు చిమ్మినాడు. జయధ్వానాలు చెలరేగినాయి. ప్రజలవైపు మందహాసంచేసి, అల్లాఫ్‌ఖాన్ బురుజుమీదనుంచి లోపలకు దిగుతూంటే, ఒక పండితుడు యెదురుగా వచ్చి రజియాయొక్క విద్రోహ గాథను విశదీకరించాడు. యువరాజుగూడా చాలా భయపడినాడు. అతని మనస్సు సూదులుపెట్టి పొడిచినట్లు బాధపడింది. తన నడకలో రాజఠీవి తొలికించటంగూడా మరిచిపోయి, చీకాకుతో

వడివడిగా రాజమందిరంలోకి వెళ్ళినాడు. అక్కడ ఉద్యోగులమధ్య ధీరవనిత రజియా నిల్చిఉంది. ఆమెలో ఆశలన్నీ తుడిచివేసి యేదో యొక వింత తేజస్సు విరాజిల్లుతోంది. అలూఫ్ కనుపించగానే, ఒకరోజున ప్రేమతో అతనితో ఆడిన ఆటలన్నీ ఆమెకు స్మృతిలో లేవని చెప్పటం పొరబాటు. ఆమె హృదయ మందిరంలో ఆ ప్రేమ క్రీడలన్నీ యెప్పటి కప్పుడే పటాలు చిత్రింపబడినాయి. అవి ఒకటొకటిగా కళ్ళల్లో నిలుస్తూన్నమాట నిజమేగాని, ఆ మనోహరమైన ప్రేమ చిత్రాలమీద కృత్రిమ రాజకీయం పొగచూరి బూజుబట్టింది. ఆ బూజులోనుంచే ఆ చిత్రాలు రంగుమాసి కనుపిస్తున్నాయి. అసహ్యంచాటునే ఆ యందం కనుపిస్తోంది. అనీతిచాటునే ఆ బొమ్మలు తైతక్కలాడుతున్నాయి. ఒకనాడమాయికంగా యీ బొమ్మలాటాడి భంగపడింది గాదా? తిరిగి ఆ యాటనే ఆడేందుకు ఆ శీలవతి యేపాపకళంకం అంగీకరించదు. ఆమెకు అనురక్తికి మారు విరక్తే కలిగింది. జాతిభేదాలు, మతభేదాలు పాటించి పాలించే ప్రభుత్వాలను అసహ్యించేందుకే ఈ బూజుబొమ్మలను లోకంలో బహిరంగపరుస్తోంది. మత ప్రభుత్వాలమీద ప్రజలకవిధేయత కలిగిస్తోంది. ఈ యవిధేయత యువరాజును భయపెట్టింది. అతడామెమీద యెంతో కోపంతో కుర్చీలో కూర్చుంటూ.

అలూ: నీ పాడు చరిత్ర లోకంలో ప్రచారం చేసుకొనేందుకైనా, నీకు సిగ్గులేకపోయింది.

రజి: సిగ్గెందుకు? జీవితం పాడుజెట్టటమే నీ రాజధర్మం గాదా! అల్లా పేరుతోనే శాసించావు గాదా నాకు భోగంబ్రతుకు. నీ శాసనం, నీ ధర్మం ప్రచారం జేసేందుకు నాకు సిగ్గెందుకు, అభిమానంతోనే నేను ప్రచారం చేస్తున్నాను.

అలూ: అభిమానమైతే శివయోగిని సేవించక, చంపించావెందుకు?

రజి: నాశనమే వ్యభిచార ధర్మఫలితం!

ఎదురుగా గోడమీద ఒక చిత్రపటముంది. ఆ పటంలో ఒక జొన్నచేను. మధ్య ఎత్తయిన మంచెమీద కూర్చుండి రజియా అలూఫ్

ఖాన్‌తో సరసమాడుతోంది. పిట్టలుతోలే వొడిశెల అతనిని బంధించే ప్రేమసూత్రమైంది. ఇది చిత్రం! యేడాది క్రిందట ఈకథ నిజంగానే జరిగింది. రజియా ముందుకు దూకి, కోపంతో గోడమీద ఆ చిత్రాన్ని చేత్తో తెంపి పుచ్చుకొని చూస్తూ.

అలూ : అది నీ బొమ్మే -

రజి : అందులో నా తండ్రి జొన్నచేను. ఆ చేలో ధాన్యంవలెనే నా ప్రేమగూడా ఫలించాలని ఆశించాను! కాని సస్యశ్యామలమైన నా జన్మభూమి వొళ్లో, ఆ ప్రేమనే వ్యభిచార దేవతను చేసి దానిని రాజ్యం పూజిస్తోంది, ప్రజలదారిద్ర్యం కోసం! నే నా వ్యభిచారం సహించలేను.

ఆ పటాన్ని రజియా చించి ముక్కలుచేసింది. అలూఫ్‌ఖాన్ పిచ్చినవ్వు నవ్వి ఆమెను సమీపిస్తూ.

అలూ : నా మీద నీ కింకా ప్రేమ ఉందా రజియా!

రజి : ఒకనాడు ప్రేమించి నదినై నీవెనుకే ప్రవహించాను. ఇప్పుడు పామునై పగబట్టి తిరుగుతున్నా.

అలూ : పాము, పగ తీసుకపొండి దీన్ని. ఓరుగల్లులో పారెయ్యండి!

కత్తిబట్టి తరిమినంతవేగంగా అలూఫ్ ఒక గదిలోకి పారిపోయి నాడు. స్వార్థపరు డెంత పిరికివాడో రజియా గ్రహించింది. స్వత స్సిద్ధమైన ధైర్యమూ, ఉత్సాహమూ అతనికి ఉండనేఉండదు. పాపపీడ నుంచి అతని మనస్సు శాంతించేందుకు, డబ్బుబెట్టి నృత్యమూ, సంగీతం కొనుక్కొంటాడు. ఆ ప్రక్కనే విశ్రాంతిభవనం ఉంది. అందులో చాలమంది వేశ్యలు అలూఫ్‌లోని నిరుత్సాహంకోసం ఎదురుచూస్తూ పనీపాటూలేకుండా ఉంటారు. యువరాజు అక్కడికే పరుగెత్తాడు. సంగీతం, నృత్యం ఆరంభమైంది. ఆ మధురగానం వినిపించగానే అక్కడ యువరాజు తన మనస్సును ఉత్సాహపరుచుకొంటున్నాడని రజియా గ్రహించింది. కాని ఆ సంగీతం ఆమె మనస్సును స్వాధీనం చేసుకో లేకపోయింది. సత్యమొక్కటే ఆమెను ఉత్సాహపరిచేది, ఆకర్షించేది! శత్రువులమధ్యలో ఆమె నిర్భయంగా వెలుపలికి నడుస్తోంది.

మార్గంలో ఒకచోట చిన్నమసీదు వుంది. కొంతమంది మత గురువుల యెదుట జటాశంకరుడుని లిచిఉన్నారు. అతడు మహమ్మదీయ మతంలోకి సంస్కరింపబడ్డాడు. నెత్తిమీదిజుట్టు గడ్డంమీద నిలిచింది. ధరించే ఉడుపులలో మార్పువచ్చింది. ఇది బాహ్యసంస్కారం! ఈ స్వల్పసంస్కారాన్ని అంగీకరించేందుకు జటాశంకరునికి స్వమత వేషాభిమానం తేలికగా వదలలేదు. ప్రపంచంలో మతంవెనుక మతం ఎన్ని పుట్టుకొనివచ్చినా, అవి యేదో ఒక నూత్నవిజ్ఞానాన్ని ప్రసాదిస్తూనేవున్నాయి. దానితో మానవు లాకర్షింపబడి దానిని ఉపాసిస్తూనేవున్నారు. క్రొత్తరుచుల ననుభవించి ఆనందిస్తున్నారు. ఏ మతం ప్రదర్శించిన విజ్ఞానమూ మానవుని భయపెట్టటంలేదు. కాని, మతం వశపరుచుకొన్న రాజ్యాధికారం, అందులోవున్న ప్రలోభమూ యివే మానవుని ద్వేషానికీ, భయానికీ కారణ మౌతున్నాయి. ఆ సుందర రాజమందిరాల్లోనే అంటుకొనిపోయేందుకు జటాశంకరుడు తహతహలాడుతున్నాడు. కాని, యిక్కడ భాగ్యమంతా ఒకపక్షమే భోగిస్తోంది. అత డా భోగ్యంమీద అధికారం పొందాలంటే అత డాపక్షంలోనే చేరాలె. మహమ్మదీయుడై పోవాలె! కాని అతనిని పరమ శివుడు ఆ వెనుకే భయపెట్టుతున్నాడు. అతడు కేవలం కళోపాసకు డయినట్లయితే దేవుళ్ళను, దేవతలను లెక్కజేసేవాడు గాడు. కాని అతనికి అధికారంమీద దురాశ మెండు. దానివల్ల భవిష్యత్తులో భంగమో, భద్రమో తెలియటంలేదు. అందుకనే విశ్రాంతిభవనంలో నుంచి సంగీతం చెవులోదూరి. గడియలు దిప్పి అల్లాను ప్రవేశబెట్టబోతే, పరమశివుడు అతని మనోద్వారాన్ని మూసివేస్తున్నాడు. అతనిలో యీ సంఘర్షణ చాలసేపు జరిగింది. చివరకు ఓరుగల్లులో పదభ్రష్టుని జేసిన పదవీ వ్యామోహమే అతనిని మతభ్రష్టునిగూడా జేసింది. అతడు మహమ్మదీయమతంలో కలిసిపోయినాడు. అప్పుడే తా నధికారి నైనా ననే గర్వంతో భటులమధ్య పోయే రజియాకు కేవ వేసి నిలిపి:

జటా : రజియా, నేను మీ మహమ్మదీయ మతంలో కలిశాను.

రజి : అప్పటికైనా నీతో వ్యామోహం నశిస్తే సంతోషమే.

జటా : హుఁ... నేను సర్వసేనాపతిని. గురూ, మనం యువరాజ దర్శనం చెయ్యాలె !

రజియా చాలాదూరమైంది. జరుపవలసిన కర్మకాండ యింకా పూర్తి గాలేదు కాబోలు. హూల్వీ అతనిని పుత్రవాత్సల్యంతో జేవత వలెనూస్తూ.

హూల్వీ : బిడ్డా ! నీవు మహమ్మదీయుడవని మరచిపోవుగదా ?

జటా : మరిచిపోను.

హూల్వీ : నీ పేరేమి ?

జటా : జటాశం......

హూల్వీ : కాదు, కాదు. మళ్ళీ శుద్ధిచెయ్యాలె !

జటా : అవునవును నాపేరు అబ్దుల్లా...

హూల్వీ : ఆఁ, అట్లా జ్ఞాపకముంచుకో...

చూడు ఇతడు జైనుడు. ఇప్పుడే మన మతంలో కలిశాడు.

జటా : అవును, అట్లాగే కనపిస్తోంది. ఆ వేషం !

గురు : అతనిని కౌగలించుకో, అతడు నీ సోదరుడు.

జటా : ఛీ, ఛీ, అతడు జైనుడు, నీచుడు, నే నంటుకోను.

గురు : అతడూ మహమ్మదీయుడే బిడ్డా, నీ స్వమతస్థుడే !

జటా : కాదు, కాదు. అతడు జైన మహమ్మదీయుడు, నేను శైవ మహమ్మదీయుడను.

గురు : బిడ్డా ! యీ విభేదం యింకా మా మతంలో రాలేదు. కౌగలించుకో !

అధికార మహమ్మదీయుడు కౌగలించేప్పుడుమాత్రం సాగిపోయే జటాశంకరుడు ఒక బానిసను కౌగలించేప్పుడుమాత్రం యెంతో కష్టపడినాడు. ఎంతో అసహ్యం చూపించాడు. పై వేషం మారినంత తేలికగా అతని చిత్తవృత్తి మారలేదని గురువు గ్రహించాడు. తిరిగి ఉపదేశం ఆరంభించాడు !

గురు : బిడ్డలారా, అల్లాకోసం యీ మహమ్మదు మతధ్వజం దేశ మంతటా మీరే యెగరెయ్యాలె! ఏ రాజ్యధ్వజం చంద్రుణ్ణి, నక్షత్రాన్ని ధరించిఉండదో అక్కడ కటిక చీకట్లు కమ్ముకొని ఉంటాయి. మీ కత్తుల నక్కడే మెరిపించండి. మీ ప్రాణా లక్కడే అర్పించండి. మీ మతాన్ని వెలిగించండి. తెలిసిందా... అనండి - ఈమాట అనండి - 'అల్లా హో అక్బర్'

ఇద్దరు : అల్లాహో అక్బరు.

గురు : హిందువులు కాఫరులు.

ఇద్దరు : హిందువులు కాఫరులు.

గురు : శైవులు కాఫరులు.

ఆ మాట జైనసోదరు డనగలిగాడుగాని, జటాశంకరు డనేందుకు అతని నోరు నొక్కుకొనిపోయింది. అతడు పలుకలేదు.

గురు : బిడ్డా నీ వనలేదేం ? శైవమతంమీద నీ కింకా అభిమానమేనా? నీ పూర్వమతం పాముకుబుసంవంటిది. అది విడిస్తేనేగాని నీవు మక్కాలో ఉన్న పరంజ్యోతిని చూడలేవు. నిన్ను రక్షించే అల్లా, నీకు ఉన్నతపదవి నిచ్చే అల్లా- ఆ మక్కాలో ఉండి పిలుస్తున్నాడు. విను - విను - వినపిస్తోందా ?

జటా : వినిపించటంలేదు.

గురు : అయితే, యీమాట పలుకు! నీ చెవులమీద శైవమతపు పొర తొలగిపోతుంది. అల్లా పిలుపు వినిపిస్తుంది. అను, అను: 'శైవులు కాఫరులు'

జటా : శైవులు...

'కాఫరు' లని అతడు పలుకలేకపోయినాడు.

గురు : ఏం బిడ్డా— కాఫరులని చెప్పవేం!

జటా : చెప్పలేను.

గురు : ఎందుకని ?

జటా : క్షణంక్రిందటి నా శైవరూపాన్ని, నే నెట్లా అసహ్యించుకొనేది! నన్ను నే నెట్లా తిట్టుకొనేది ?

గురు : నీవు యిప్పుడు శైవమతస్థుడివా? మన మహమ్మదీయజెండా యెగరవేసి వెలుగులు కురిపించేందుకు ఓరుగల్లుమీద దండెత్తావా? కాఫరురాజ్యాన్ని నాశనంచెయ్యవా? మహమ్మదు మతం స్థాపించేందుకు ఆడించే నీ కత్తిక్రింద కాఫరు శైవుల రోదనకంఠం వినిపిస్తే, నీ కత్తి నిలిచిపోతుందా? మతద్రోహం చేస్తావా? రాజ్యద్రోహం చేస్తావా?

జటా : చెయ్యను.

గురు : అయితే అను, శైవులు కాఫరులు.

జటా : శైవులు కాఫరులు.

గురు : ఇప్పుడౌతావు సేనాపతివి.

సంతోషంతో కౌగలించుకొని, ఆ యువకుణ్ని విశ్రాంతి భవనంలోకి నడిపిస్తోంటే క్రొత్తపోడుగునా వారు 'జైనులు కాఫరులు, శైవులు కాఫరులు' అని స్మరణచేస్తూ, తమ పూర్వ అభిమాన మతాల మీదే ద్వేషం అలవాటుచేసుకుంటున్నారు. ఆ పాఠం వల్లిస్తూనే యువరాజు యెదుట నిలిచాడు. అప్పుడలూఫ్‌ఖాన్ స్త్రీలమధ్యలో అనుభవించే సౌందర్యమద్యం అప్పటి కింకా యీ క్రొత్తవారిని చూడనీయనంతటి మత్తుకలిగించలేదు.

అలూఫ్ : వీ రెవరు?

గురు : ఈయనే జటాశంకరుడు. ఇప్పుడే స్వీకరించాడు మన మతం!

అలూఫ్ : మతం, రాజ్యం, పదవి, బంగారం.

పొట్టపగల నవ్వుతూ ఎగురుకొంటూ వచ్చి, అలూఫ్, జటాశంకరుని కౌగలించాడు!

## ౨౧

వలసవచ్చిన జైనులలో చాలమంది మహమ్మదీయమతం స్వీకరించారు. చాలమంది జైనసన్యాసులు ఫకీర్లైనారు. కొంతమంది జైనులీ మహమ్మదీయమతరూపంలో జైనసామ్రాజ్యంలో జేరి, అక్కడ మిగిలియున్న జైనులలో తమ బంధువులను, స్నేహితులను ప్రోత్సహించి యీ మతంలోకి సంస్కరించారు. నెలరోజుల్లోనే ఓరుగల్లుసామ్రాజ్య సరిహద్దు గ్రామాల్లో మహమ్మదీయ మతపతాకలు ఎగురుతున్నాయి. ఇది తన వెనుక రాజకీయ కుట్రల బాహ్యస్వరూపమని ప్రతాపచక్రవర్తి గ్రహించాడు.

శైవులమీద ద్వేషంతోనే జైనులు మహమ్మదీయులౌతున్నారు. శైవులమీద ద్వేషంతోనే, జైనులు దేవఘడ్‌లో సైనికులుగా జేరుతున్నారు. దేవఘడ్ రాజ్యంలో పూర్వంకన్న యిప్పుడు సైనికబలం అతీతమైంది. కాని శైవసామ్రాజ్యంలో క్రొత్తసైనికులు చేరటంలేదు. ఆశ్రమవిద్యార్థులు గ్రామాల్లోజేరి జంగాలు సృష్టించే మతకలహాలను అణచివేయటంతోనే కాలంగడచిపోతోంది. దేశంయొక్క వీర్యమంతా స్వాతంత్ర్యయుద్ధంకోసం మిగలటంలేదు. దానిని అంతఃకలహం మింగివేస్తోంది. సామ్రాజ్యం యింత బలహీనమైపోయింది. ఇక ప్రతాపచక్రవర్తి ఏవిధంగా నిర్జిస్తారు? స్వేచ్ఛాచారులయ్యేందుకు సామంతులకు వీలుచిక్కింది. తమ సామంతరాజ్యాలన్నిటిలోను చక్రవర్తి యొక్క ప్రతినిధులనుతరిమివేసి, సామంతులు స్వేచ్ఛను ప్రకటించారు. సామంతుల విద్రోహంతో ప్రతాపుని సామ్రాజ్యచక్రం విరిగిపోయింది. జైనప్రవాసంతో తన పాదాలక్రింద దేశం జరిగిపోయింది.

మతాలతో ప్రజలు చీలికలైనారు. చిన్నచిన్న రాజ్యాలతో దేశమంతా ముక్కముక్కలుగా ఖండింపబడింది. ఆ ఖండాలలో ఒక

గల్లు మండలం విశాలమైంది. ఆ మండల జనసంఖ్య ముప్పది లక్షలు. ప్రజల్లో వివిధమతా లున్నాయి. కాని వారిలో మత దురభిమానం తక్కువ. ఎన్నడైనా మతకలహం వచ్చినంతలో సమసిపోతుంది. అక్కడిఐక్యతాశక్తిని ప్రయత్నించిజంగాలే శిథిలంచెయ్యలేకపోయినారు. ఆ ప్రజలవల్లనే కాకతీయరాజ్యం విస్తరించింది. ఆ మండల ప్రజలకు ప్రతాపునియందు భయంతో గూడిన రాజభక్తి లేదు. ప్రతాపుడు వారికి స్నేహపాత్రుడు. ఆ మండలానికి ఓరుగల్లు కేంద్రనగరం. ఆ నగర దుర్గమే ప్రతాపుని దివ్యభవనం! తొమ్మిదిలక్షల ధనుర్ధరులైన వీర భటులే అతని పెద్దకుటుంబం! ఆ మండల వాసులతో బాటు ప్రతాపు డొక కుటుంబీకుడై, ఆ భూఖండంమీద, ఆ మట్టిదిబ్బమీద నిల్చాడు. ధర్మఖడ్గం చేతధరించి ఎదురుచూస్తున్నాడు శత్రువులకోసం!

ఓరుగల్లు మండలప్రజలు స్వాతంత్ర్యప్రియులు. శత్రువులు తమ ధర్మం దోచుకోనవస్తే, అక్కడి పూచికపుల్ల సహితం బాణమై తగులుతుంది. అభిమానంతో ఆ ప్రజలే తమ స్వరక్షణకోసం యుద్ధసన్నాహాలు చేస్తున్నారు. అందుకని యుద్ధవిషయంలో ప్రతాపు డెవ్వరినీ శాసించటం లేదు. ఆత్మసంరక్షణకోసం తన కత్తిని తానే నూరుకొంటున్నాడు.

ఇదిమాత్రమే ప్రతాపుని ధర్మబలం! ఈ ధర్మాన్ని శిథిలం జేసేందుకే స్వార్థపరులు కుట్రలు పన్నినారు. ధర్మమూర్తి ప్రతాపరుద్రుని చుట్టూ శత్రువులు జేరినారు. శైవమత మొక శత్రువు, జైనమత మొక శత్రువు, మహమ్మదీయమతం ఒక శత్రువు, సామంతపద్ధతి ఒక శత్రువు! ఇంతమంది శత్రువులు గలసి సామ్రాజ్యపునాదులను పీకివేశారు. ప్రతాపు డేకాకియై నిల్చాడు. అయినా గోటితో చీల్చేందుకు ప్రతాపుడు గడ్డిపోచగాడు. అతడు హిమాలయంవలె ఉన్నతుడు, ఘనుడు! ప్రళయశక్తులు గలిగిన యెన్నో మారణయంత్రాలు వెంట తీసుకొని అలూఫ్‌ఖాన్ ప్రయాణమైనాడు. తురకసేన సరిహద్దుల మీద పొర్లి సామ్రాజ్యంలో నిప్పునురుగలు గక్కుతూ ప్రవహిస్తోంది!

క్రోవలో ప్రతాపునివంటి ఒరిసువురు జాతీయధర్మపరులైన సామంతులు, తమ సేనలతో అడ్డుకట్టగట్టి పగలంతా శత్రువాహినిని నిలుపగలిగారు. తమ మారణయంత్రాలతో ఆ వీరులను హతంజేసి శత్రువులు ముందుకు సాగినారు.

మరియొక దేశభక్తు డెవ్వడూ మార్గంలో అడ్డుకొనలేదు. తక్కిన సామ తులందరూ స్వామిద్రోహులే, దేశద్రోహులే. తమతమ దుర్గాలను తురకసేన సమీపించగానే సామంతు లెదురేగి స్వాగతమిచ్చారు. ఇప్పు డాసామంతులకు ప్రతాపుడు చక్రవర్తిగాడు. మహమ్మదీయ చక్రవర్తిత్వాన్ని అంగీకరించారు. తమ కోటలమీద మహమ్మదీయ బావుటాల నెగురవేశారు. ఇది ప్రజలయొక్క సమ్మతిగాదు. ఇది నిరంకుశంగా స్వార్థం కోసం సామంతులంగీకరించిన బానిసతనం. అల్లూఫ్‌ఖాన్ తన ప్రతినిధులను ఆ యా సామంతమండలాల్లో నిలిపినాడు. సామంతులు భక్తితో లక్షలకొలది రూపాయలు, ఆహారపదార్థాలు, కానుకలిచ్చారు. ఆత్మవినాశనంలోనే స్వార్థపరుల కానందం లభిస్తుంది గాదా? సామంతులు గూడా సేనాసమేతులై శత్రువులతో గలిసి ఓరుగల్లుమీద దండెత్తినారు. ఓరుగల్లుదుర్గం ముట్టడించారు.

యుద్ధరంగంలో ఒకటి స్వపక్షం, ఒకటి శత్రుపక్షం! ఒకటి రక్షణకోసం రెండవది భక్షణకోసం! ఇరుపక్షాలమధ్య పోరు ప్రారంభమైంది. హిందువులు మహమ్మదీయులు హోరాహోరి పోరాడుతున్నారు.

ఒకరికొకరు తీసిపోవట లేదు ఇరుపక్షాల సేనానులు అభేద్యమైన వ్యూహాలు పన్ని జయింపచూస్తున్నారు. తమ శత్రువ్యూహాలను భేదించి ఓడింపచూస్తున్నారు. ఒక క్షణ లో ఓటమి, తిరిగి ఉద్రేకం—మఱియొక క్షణంలో జయం, తిరిగి ఉత్సాహం! ఉత్సాహంతో, ఉద్రేకంతో, పౌరుషంతో సేనలు పోరాడుతున్నాయి. పోరాడే శత్రుసైన్యంలో అంతా ఆఫ్ఘన్‌నుంచి అవతరించిన మహమ్మదీయులు గారు, లేక మహమ్మదీయమతం స్వీకరించిన భారతీయులు గారు.

ఆ సేనలలో మహమ్మదీయుల కన్న సంఖ్యకు హిందువులే యెక్కువగా కన్పిస్తున్నారు. ఒక్క మహమ్మదీయులే హిందువులమీద దండెత్తి నట్లైతే అది మతయుద్ధమని చెప్పవచ్చు! ఏదో ఒక నూత్నధర్మం కోసం సల్పే పోరాటమని సంకోచించవచ్చు! కాని యిది మతయుద్ధం గాదు. శైవసామ్రాజ్యం కూల్చివెయ్యటమే వారి కోరిక! ఆ సామ్రాజ్యం తమ అభివృద్ధి నరికట్టి, దాసులనుజేసి, పీడించి బాధించి దుఃఖపెట్టింది. పుట్టింది మొదలు జీవితం నిరాశతో నింపి చచ్చిపోయేం దుకు త్వరపెట్టింది. సామ్రాజ్యతత్వం అనేకరూపాలలో అమాయిక ప్రజలను చచ్చిపొమ్మని చావులు గల్పించింది. నిరాశతో బ్రతకలేక అనేకమారులు చచ్చిపోయినారు. తిరిగి ఆ చావే యీ యుద్ధంలో చస్తున్నారు. ఈ యుద్ధంలో చచ్చినా, బ్రతికినా, జయించినా ఓడినా ప్రపంచానికి అల్లాఉద్దీనుని ప్రభుత్వమే ప్రసాదిస్తారు. తిరిగి ఆ సామ్రాజ్యతత్వమే మహమ్మదీయమతం పేరుతో ప్రజలకు ఆ దాస్యమే, ఆ దారిద్ర్యమే, ఆ నిరాశే, ఆ దుఃఖమే, చావే కల్పిస్తుంది. ప్రపంచానికి తమ వెనుకమిగిలే యీ ప్రమాదం వారికేం తెలుసు? ఎదుట శైవమతం శత్రురూపంతో కన్పిస్తోంది. దాని మీద ద్వేషంతో మండిపడుతున్నారు. వెనుకనుంచి ఒక మతం దేవతా నినాదాలు గర్జిస్తూ ఉంటే, ఉత్సాహంతో పోగి మృత్యువుదగ్గరకు పోతున్నారు. ప్రయోజనం తెలియకుండానే యెందరినో చంపి ఎం దరో చచ్చిపోతున్నారు. రక్తం ప్రవహిస్తోంది. సోదరమానవ శవాలు ఆ నెత్తురులో తేలియాడుతున్నాయి. ఉద్రేకులై ఉన్మత్తులై యెందరినో చంపారు. ఎందరో సేనానులు హతులైనారు. జాతీయ వీరుడైన వీర సోముడు దుర్గద్వార రక్షకుడు. ఇంతవరకతడే సేనాని. ఆ ద్వారంమీద జాతీయధర్మదేవతకు తన శిరస్సు బలియిచ్చాడు. అంగరక్షకులైన అతని ఆప్తమిత్రులు, ఆ శిరస్సును ప్రతాపరుద్రదేవుని అంజలిలో పుణ్యప్రసాదమని సమర్పించారు. మహాప్రసాదం! కరుణాగారే తన కన్నులకు ఆ ప్రసాదం అద్దుకొని "వీరసోముడు నాకోసం ముక్తిస్థా నం సిద్ధపరిచాడు. పోయి నేనక్కడే నిలుస్తాను. ఉన్మత్తునివలె ప్రతా

పుడు తన గుఱ్ఱం పరుగెత్తించాడు, అతని వెనుక అంగరక్షకులు, ఆ వెనుక సైన్యం!

వీరప్రతాపు డిప్పుడు చక్రవర్తిగాడు. అతడొక ప్రజానియంత మాత్రమే! ఇప్పు డా నియంతృత్వం వొదిలేసి, వీరసోముని స్థానంలో సర్వసేనాపతి అయినాడు. కాని ఆయన విడిచిన అధికారం అంతటితో శత్రువుల చేజిక్కదు. జాతీయ ధర్మవీరులలో తుదివరకు ఒకరివెనుక ఒకరు ఆ యధికారం స్వీకరిస్తూనే ఉంటారు. ప్రతాపునివెనుక రజియా, నియంత. ఆమె వెనుక గౌరి, ఆ తరువాత —మరియెందరో వీరనారీ మణులు, వీరపురుషులు, ఒకరి వెనుక ఒకరు స్థానంవహించి, సైన్యాలు నడిపి, శత్రువులతో పోరాడుతారు.

ప్రధాన ద్వారందగ్గర వీరసోమునిస్థానంలో ఒక జాతీయవీరుడు సేనానియై వెనుక నిలిచి సైన్యాన్ని ముందుకు నడుపుతున్నాడు. జాతీయ సేన ముందంజవేయటం లేదు. ఉన్నచోటులోనుంచి కదలక మీదకు దుమికే శత్రుసైన్యాన్ని కత్తులుగుచ్చి ఆపుతోంది. అది వారిలో నిరుత్సాహానికి చిహ్నం! మరి రెండుప్రయత్నాలలో శత్రువులు అడ్డు తొలగించుకొని ద్వారం ఆక్రమిస్తారేమో! అంతలో ప్రతాపుడు ప్రత్యక్షమైనాడు. ఆయన ద్వారం దగ్గిర నిలువలేదు. తన గుఱ్ఱాన్ని శత్రుసైన్యంలోకి దూకించాడు. శత్రువులలో చొచ్చుకొని ముందుకు పోతున్నాడు. శత్రుసైన్యం ప్రతాపుని చుట్టుముట్టింది. ఆయన తల చుట్టూ వేయికత్తులు గిరగిర తిరుగుతున్నాయి. ప్రతాపుడు బ్రతికి జయిస్తాడా జాతీయధర్మం దేశంలో ప్రతిష్ఠిస్తాడు. మత పక్షపాతం మంటగలుపుతాడు. సామంత పద్ధతిని నిర్మూలిస్తాడు. ఎక్కడా తొక్కే యజమాను లుండరు. బాధితు లుండరు. దుఃఖితు లుండరు. కర్మిష్ఠులైన ప్రజలే తమ కర్మఫలంమీద భోగ్యాధికారులు. ప్రజలే సేవకులు, ప్రజలే పాలకులు, వీరభటులీ జాతీయ ధర్మం గ్రహించే యుద్ధం చేస్తున్నారు. ఆ ధర్మంకోసమే నేను ప్రాణాలర్పిస్తున్నాను. ప్రతాపుడు ధర్మమూర్తి! ఆ ధర్మశిరస్సు ఇప్పుడు తెగిపడుతుందేమో—తరువాత

యుద్ధం ఉండదు, జయం ఉండదు. ఏకంగా మన్నూ మిన్నూ గజగజ లాడేట్టు నినాదాలు చెలరేగినాయి. శత్రువులమీదకు వీరభటులు విజృంభించారు. శత్రువులమధ్యకు వీరప్రతాపుడు చొచ్చుకొని పోయి నంతదూరం వీరభటులు శత్రువులను తరిమితరిమి తమ నియంతను రక్షించుకొన్నారు.

అంతమాత్రంచేత శత్రువులు నిరుత్సాహపడలేదు. ఆ వీరావేశంలో హతులైనంతమంది సైనికులను దేశంయొక్క సామంత శత్రుత్వం తెచ్చి రణరంగంలో కుమ్మరిస్తోంది. మరుసటిరోజుకు తిరిగి క్రొత్తసైన్యం క్రొత్తసేనానులు, కొత్తవ్యూహాలు రంగంలో ప్రత్యక్షమైనాయి. మాయని తేజస్సుతో ఉత్సాహంపెట్టే స్వధర్మం తప్ప జాతీయప్రభుత్వానికి సహాయం లేనేలేదు. చావగా మిగిలిన సైన్యం నిన్నటికన్నా స్వల్పమేగాదా? ఈ యల్పసంఖ్యాబలాన్నే తేలికజేసి శత్రువులు మీదకు దూకారు. ద్వారంవరకు తరిమారు. మళ్ళీ ప్రతాపుడు శత్రువులను చెండాడుతూ ముందుకు పరుగిడినాడు. పోయినపాడుగునా శత్రువులను ఛేదించి, అంగరక్షకు లాయనమార్గం సుగమంచేశారు. ఆ వెనుక జాతీయవీరులు ద్విగుణీకృతోత్సాహంతో శత్రువులను నుసుమాడి తరిమివేశారు. ఈ సంఘటనలో ఎందరో సైనికులు హతులై పోయినారు. ఎంతో నష్టమైంది. ప్రతాపుని సాహసం చూసి అల్లూఫ్ఖాన్ ఆశ్చర్యచకితుడైనాడు. ఈ విధంగా ప్రతాపుని జయించటం కష్టసాధ్యం! అందుకని మారణయంత్రాలను రంగంలో నిలిపాడు. వాటివల్లే తన సైనికులు ధైర్యం తెచ్చుకొన్నారు. జటాశంకరుడు మతంలో కలిసింతరువాత అత డిప్పుడు సర్వసేనాని. దుర్గంలో ప్రవేశించే రహస్యమార్గం అతనికి తెలుసు. ఆ మార్గంలో అతడు ప్రవేశించాడు. అతనివెంట యెన్నో ఫిరంగులు, యెంతో సైన్యం!

దుర్గంలోపల అబ్దుల్లా, దుర్గంవెలుపల అల్లూఫ్, లోపల వెలుపల ముందూ వెనుకా ఫిరంగిమ్రోతలు! ఆ మధ్యలో జాతీయసైన్యం!

నిప్పులు చెరిగి వీరభటులను మాడ్చివేశారు. రుయ్యిరుయ్యిమని గుండ్లు తగిలి, ద్వారాలు, బురుజులు, గోడలు, గోపురాలు, మందిరాలు అన్నీ కూలిపోయినాయి. క్షణంలో సర్వనాశనమైంది. ప్రతాపరుద్రదేవుని శత్రువులు పట్టుకొన్నారు!

ఇప్పుడు ప్రతాపరుద్రదేవుని చుట్టూ అంగరక్షకులు లేరు. కదిలితే క్షతాంగుని చేసేందుకు సేనాధికారులు నిలిచి ఉన్నారు. వారినతడు చూడటమే లేదు. కనుచూపు మేరవరకు కనుపిస్తోంది శిథిలక్షేత్రం, దీనంగా చూస్తూ ముందుకు నడుస్తున్నాడు. నవ్వుతూ, ఆయనకిరుప్రక్కలా ఆఫ్ఘన్ జాతీయులు, అలూఫ్, రహీం మఱి యితర అధికారులు, అందరికళ్ళకు కన్పించేది పాడుబడినభూమి, అందులో విరిగి కప్పలుబడిన రాతిముక్కలు మట్టిపెళ్ళలు. కాని ప్రతాప రుద్రదేవుని మనోనేత్రం కూలిపోయిన కళానిర్మాణం చూస్తోంది. అంగవైకల్యమై కొనఊపిరితో ధర్మదేవత మూలుగుతూ, బాధతో తనవైపు చూస్తున్నట్లు ప్రతాపుడు పెద్ద నిట్టూర్పు విడుస్తూ, ఇంకా ముందుకు నడిచాడు. ఎంతదూరం పోయినా శిథిలాలు తప్ప నాశనంతప్ప అతనికేమీ మిగిలినట్లు కన్పించటం లేదు. ఇంతలో ఒక వికృత స్వరం వినిపించింది. అప్పుడాయనకు స్పృహ తెలిసింది. 'ఏయ్ ప్రతాపరుద్రా, రుద్రా' అని కేకలు వేస్తూ అబ్దుల్లా ఆ శిథిలాల మీదనుంచి నడుస్తూ ఎదురుగా వస్తున్నాడు. ఆ తురక వేషంలోనే అతడు జటాశంకరుడని సందేహ మాత్రంగానైనా గ్రహించాడో లేదోగాని, అతడు సమీపిస్తూ నడిచే ప్రతి అడుగూ తన గుండె మీద పడుతూన్నట్లే అవమానంతో ప్రతాపుడు బాధపడుతున్నాడు. అబ్దుల్లా వచ్చివచ్చి యెదుట కూలిపోయిన దేవాలయంలో బైటికి కన్పిస్తో శివలింగంమీద నిలిచి, అట్టహాసంతో ప్రతాపుని ఆక్షేపిస్తున్నాడు. ప్రతాపుడాశ్చర్యంతో ప్రక్కనున్న అలూఫ్‌ఖానుని చూసి —

ప్రతా : ఇతడు మా జటాశంకరుడు గాడా?

జటా : ఇప్పుడు నా పేరు జటాశంకరుడు గాదు. అబ్దుల్లా!

ప్రతా : ఆశ్చర్యం ఇదంతా నీవు చేసిన నాశనమేనా?

జటాశంకరుడెంతో అభిమానంతో తలెత్తిపలికాడు.

జటా : అవును నేనే, మీ రంతా కాఫరులు - బొమ్మలు పూజిస్తారు. అల్లాకోసం ఆ కాఫరు మతాన్ని నాశనంచేశాను.

ప్రతా : అబ్దుల్లా, నీ పూర్వజన్మ నీకేమైనా జ్ఞాపకముందా ?

జటా : ఏమని ?

ప్రతా : నాల్గునెల్లనాడు శైవుడవని, జటాశంకరుడవని, ఈ పరమశివ లింగాన్ని భక్తితో -

జటా : ఇది పరమశివుడు గాడు పాషాణం. రాయి !!

ప్రతా : ఈ రాతిని పూజించేవాడివిగాదా ! ఇప్పుడీ రాతిమీద భక్తి లేదూ ? పరమ శివుడంటే నీకు భయంలేదూ ?

జటా : కాఫరుమతం, కాఫరు దేవుడంటే నాకెందుకు భయం ? అల్లా అంటే నేను భయపడతాను. మా అల్లా మక్కాలో ఉన్నాడు !

'అల్లాహో అక్బరు' అని ఆ శివలింగం మీదే నిలిచి కేక వేశాడు. అందరూ నవ్వినారు. ప్రతాపుడు నిశ్చేష్టుడై చూశాడు. మళ్లీ సంతోషంతో జటాశంకరుడు కళ్ళు తెరిచి శాంతంగా పలికాడు.

జటా : అల్లా నన్ను మక్కారమ్మని పిలుస్తున్నాడు. నాభక్తికి మెచ్చాడు.

ప్రతా : మక్కా పోతావా, యీ దేశంలో నీకు జన్మసంబంధం లేనేలేదా ?

జటాశంకరుడు దివ్యదృష్టి నటించి

జటా : ఉన్నది. కాని చాలా దూరసంబంధం !

ప్రతా : ఎంతదూరం ?

జటా : నేను మక్కాలోనుంచి యీదేశాన్ని చూస్తున్నాను. మక్కా యిక్కడికి కెంతదూరమో యీదేశం నా కంతదూరం !

ప్రతా : అయితే యీదేశంమీద నీకు మాతృప్రేమ లేదా ?

జటా : ఒళ్ళుతెలిసే మాట్లాడుతున్నావా రుద్రా ? నీ వెవరిని ప్రశ్నిస్తున్నావు ? న న్నీదేశానికి కన్నకొడుకునిచేసి పుట్టించలేను 'అల్లా' - సేనాపతిని చేసి పుట్టించాడు. తెలిసిందా ? ఎందుకు ఆశ్చర్యపడతావు...అరే మీరంతా ఆశ్చర్యపడుతున్నారే, ఏమి

యువరాజా ఎందుకు ఆశ్చర్యం?...నేను సేనాపతిని గాదా - నేను - నేను గాదా ?

అలూ : నీవు రహీంయొక్క కనుచూపులో మెలిగే సేనాపతివి.

జటా : అయితే అసలు సేనాపతి యెవరు ?

రహీం : నేను, రహీంను!

జటా : నేను గాదా, నేను గాదా ?

రహీం : నీవు భారతీయుడవు. ఆఫ్ఘన్ జాతీయు డేలే రాజ్యంలో బాధ్యత గలిగిన పదవి భారతీయునకు లభించదు.

క్రింద పాదాల దగ్గిర యెవ్వరో స్త్రీ కిలకిల నవ్వింది. అతడు తుళ్ళిపడినాడు. ప్రతాపుడు వొంగి చూశాడు. యుద్ధ లో తెగిపడిన అనేక శరీరాల మధ్య వీరవనిత రజియా - ప్రమాదమైన గాయాలు తగిలినాయి. నేలమీద పడివుంది. ఆమె ధరించిన ఉడుపులన్నీ నెత్తురుతో తడిసిపోయినాయి. ఒక చెయ్యి తెగిపోయింది. తలమీద కత్తి పోటు నుంచి రక్తం ముఖంమీదుగా కారుతోంది. ఎన్నికత్తులు గాయ పరచి ఆ వీరవనితను నేలగూల్చినాయో ? లేచేందుకు సత్తువ లేదు. ఆమె ప్రక్కనే గౌరి ప్రాణం లేకుండా పడివుంది. రజియా మాత్రమే కొన వూపిరితో ఉంది. ప్రతాపు డామె ప్రక్కన కూలబడి రజియా తలను ఒళ్ళో చేర్చుకొని రక్తం తుడుస్తూంటే అలూఫ్‌ఖాన్ అప్పటికి గుర్తించాడు.

అలూ : రజియా.

రజి : ఊఁ, రజియాను భారత మహమ్మదీయ స్త్రీని! నా దేశం కోసం పోరాడాను!

అలూ : రజియా, నీకు మహమ్మదుమీద భక్తి లేదా ?

రజి : ఉన్నది. కాబట్టే నేనీ ప్రతాపుని సేవలో జేరినాను! మహమ్మదు వలెనే ప్రతాపుడు గూడా తన దేశంలో శాసనతనాన్ని నిర్మూలిం చేందుకు సిద్ధపడినాడు. ఇంతకన్నా మహమ్మదు ఇతరు డౌతాడా! మూర్ఖుడా నీవు నీ మహమ్మదు ధర్మానికే సంకెళ్లు తగిలించావు.

తన ఒంటిచేత్తో శృంఖలాబద్ధమైన ప్రతాపుని హస్తాలను ముఖం మీదకు లాక్కొని రజియా ముద్దులాడింది.

అలూ : అరబ్బీ మహమ్మదే నీకళ్ళల్లో ఉంటాడని నేననుకొన్నా రజియా!

రజి : అందుకని అరబ్బీలనో, ఆఫ్ఘనులనో దేవతలని భ్రమించి వారికి మహమ్మదు పేరుమీద భారత గులామై పోతుందా ! కాదు. భారతజాతి తన దేశ స్వాతంత్ర్యాన్ని రక్షించుకొంటుంది. తన నీతిని నిలుపుకొంటుంది.

ప్రతా : అవును రజియా, పదవిలోనుంచి, వ్యామోహంలోనుంచి చూసే జటాశంకరుని వంటి విశ్వాస ఘాతకునికి యెంతో దూరంలో నుంచి యెంతో పరదేశం, యెంతో శత్రుదేశం అవుతుందిగాని- 'అల్లా'లోనుంచి, ప్రేమలోనుంచి చూసే నీకూ, నాకూ యీ దేశం మాతృదేశమే ! మాతృఋణం తీర్చుకొన్నావు సోదరీ నీవు! ఈ యసహాయస్థితిలో నిన్నేమీ సేవించలేనుగదా ?

రజి : సుఖంగా నీ వొళ్ళో ప్రాణాలు విడిచేకంటే నాకేం గావాలె అన్నా ! అయితే నా విచారం అదిగాదు.

ఆమె జటాశంకరునివైపు చూసి.

రజి : చూడు అబ్దుల్లా, స్వార్థపరులే ఒకే జాతిలో మతభేదం, ఒకే మతంలో జాతి భేదం నాకు తీసుకొని అన్యాయం చేస్తారని నీకు తెలీదూ! నీవు వ్యామోహపడే పదవిలోనే నీకుస్థానం లేకపోయింది-

జటా : సేనాపతి పదవిలో నాకే స్థానం లేకపోతే ఆఫ్ఘన్ జాతికి ఈ దేశంలో నేను స్థానమియ్యను. చంపేస్తా, చంపేస్తా.

కత్తిదూసి అలూఫ్‌ఖాన్‌మీదకు దూకాడు. వెంటనే రహీం అడ్డువచ్చి అతని రొమ్ములో కత్తి పొడిచాడు. ఆ పోటుతోనే చచ్చి, అబ్దుల్లా ప్రతాపుని ఒళ్ళో రజియామీద విరుచుకొని పడిపోయాడు. 'హా' యని రజియా అరిచింది. ప్రతాపుడా పాపిని క్రిందకునెట్టి రజియాను చేతులతో యెత్తుకొని లేచాడు. అయితే రజియా బ్రతుకలేదు. ఆ శుభ హస్తాలలోనే అస్తమించింది.

## ౨౨

రెండు నెల్లైనా జరగలేదు. ఎంతో తొందరగా సైన్యాలను నడుపుకొంటూ అలూఫ్ ప్రతాపుని బంధించుకొని ఢిల్లీ చేరాడు. ప్రతాపరుద్రుని పేరు ఢిల్లీ కీనాడే కొత్తగాదు. మొదట దండెత్తి ఓడి ప్రతాపుని కీర్తి ఢిల్లీకి మోసుకొని పోయిన వాడు మల్లిక్ కాఫూర్! రెండవవాడు అలూఫ్‌ఖాన్! ఇతడుగూడా ఒకమారు ఓడి ఢిల్లీలో విస్తరించిన ప్రతాపుని కీర్తిని స్థిరపరిచాడు. తిరిగి ప్రయత్నించి ఆ కీర్తి శేఖరుని యిప్పుడు జయించాడు. ఒకడు నాలుగుమారులు శౌర్యవంతులైన మహమ్మదీయుల నోడించిన వీరపురుషుడు ప్రతాపరుద్రుడు. రెండవవాడు ఆ ప్రతాపరుద్ర దేవుని బంధించిన 'మహాబలశాలి' అలూఫ్‌ఖాన్! ఈ యిరువురు సమానంగా ఢిల్లీ ప్రజల నాకర్షించారు హిందువులు మహమ్మదీయులు వేడుకపడి చూసేందుకు ఢిల్లీ చేరారు. గొప్ప ఆహ్వానం జరిగింది. శృంఖలా బద్ధుడైన ప్రతాపుని ప్రక్కనుంచుకొని ఢిల్లీ నగరమంతా ఊరేగాడు. దుర్గంలోకి ఆహ్వానించేందుకు తండ్రి గ్యాసుద్దీన్ తుఘలక్ యీ దేశంలో లేడు. నాల్గు రోజుల్లో సుల్తాన్ ఢిల్లీ చేరుతాడు. తండ్రి వచ్చిందాకా దుర్గం వెలుపలే ఉండేందుకు నిశ్చయించాడు.

బెంగాలులో ఒక పెద్ద ప్రజావిప్లవం జరిగింది. దారిద్ర్యమస్థితి సహించలేక ప్రజలు సుల్తానుమీద తిరుగబడినారు. ఆ విప్లవం అణిచివేసేందుకు అక్కడి రాజప్రతినిధికి అసాధ్యమైంది. విశ్వప్రయత్నంచేసి అక్కడ శాంతి నెలకొల్పి సుల్తాన్ ఢిల్లీకి మరలినాడు.

సుల్తాన్ చాలా వృద్ధుడు. ఆయన పవిత్ర రాజకీయ జీవిత గాథల్లో యిది ప్రశంసనీయమైన సాహస ఘట్టం! తన ముసలి తండ్రికి

గొప్ప ఆహ్వానం జరిపించాలని అలూఫ్ కుతూహలపడినాడు. పెద్దపెద్ద పొడుగాటి చెట్లమానులను పోటీ నిలిపి దానిని పట్టుగుడ్డలతో డేరాగా నిర్మించాడు. కీర్తిశేషులైన ఢిల్లీ సుల్తానుల మతగాథలనేకంగా ఆ పట్టు డేరామీద చిత్రాలు వ్రాయించాడు. అందులో ఒకటి తన తండ్రికి ప్రీతిచేసే చిత్రం! ఖుస్రూ హిందూ దేవతా విగ్రహాలను మసీదులలో పెట్టించి పూజలు చేయిస్తే, తన తండ్రి ఖుస్రూను చంపి ఆ విగ్రహాలను ఊడ్చివేసిన వీరగాథ! రెండవది స్వయంభూ దేవాలయం ప్రక్కన ప్రతాపరుద్రునికి తాను సంకెళ్లు వేసిన వీరగాథ. ఈ రెండు చిత్రాలు డేరాయొక్క ముఖద్వారంలో కనుపించేట్లు ఏర్పాటు చేశాడు. తండ్రి ప్రవేశించేంతవరకు యితరు లెవ్వరూ అందులో అడుగుపెట్టరాదని కఠినంగా శాసించాడు.

ఆ డేరా కెదురుగా కొబ్బరియాకులతో ఒక చిన్న గుడిసె వేయించుకొని అలూఫ్‌ఖాన్ అందులో కూర్చుంటున్నాడు. అతడు ఫకీరు వేషంలో యెంతో నిరాడంబరంగా ఉన్నాడు. ఎప్పుడూ మత గ్రంథమైన ఖురాను యెదుట తెరచి ఉంటుంది. కాని అతడు మతగ్రంథాన్ని మాత్రం చదవటంలేదు. తోలుముక్కలు నీళ్ళలో తడిపి, వాటిమీద యేవో రాజముద్రలు మాత్రం వేస్తున్నాడు ఇనుప అచ్చులతో! అతడు అనుక్షణం యెందుకో అకారణంగా నవ్వుతాడు. అతని ప్రక్కనే ప్రతాపచక్రవర్తి సంకెళ్లలో చేతులు తగిలించి కూర్చుని ఆ డేరామీద చిత్రాలనే చూస్తున్నాడు.

అలూ : ప్రతాపరుద్రదేవా! రజియా చెప్పినట్లు తమకూ, మహమ్మదు ప్రవక్తకు ఆశయాల్లో భేదంలేదు సుమా! అందుకే కోరి నా చెంత ఉంచుకొంటున్నా తమను. అయితే మీ ధర్మాలాచరించేందుకు గాదుసుమా!

ప్రతా : ఇంకెందుకు?

అలూ : మీ యెదుటనే కొన్ని ఘోరాలు చెయ్యటం అలవాటు చేసుకొంటే, నా సామ్రాజ్య రథచక్రం మానవుల గొంతులు

మీదుగా యీ మూలనుంచి పరుగులెత్తేప్పుడు అల్లా ప్రత్యక్షమై బ్రతిమలాడినా సరే అది మధ్యలో ఆగిపోదు. అది చైనాలో ఆ మూల వరకు పరుగు లెత్తుతూనే ఉంటుంది.

ప్రతా : ఆశ్చర్యం, నీవు చైనామీద కూడా దండెత్తుతావా ?

అలూ : నా ధనవ్యామోహానికి అంతులేదు ప్రతాపరుద్రదేవా ! చూడండి వీటిని.

ప్రతా : ఇవి తోలు ముక్కలు.

అలూ : ఈ తోలు ముక్క విలువ తులం బంగారమని శాసిస్తాను.

ప్రతా : అందువల్ల ప్రయోజనం ?

అలూ : బంగారం వాడినట్లే ప్రజలు తోలు బిళ్ళను వాడుతారు. బంగారంతో కొన్నట్లే జీవన సామగ్రి యీ తోలు ముక్కలతో కొంటారు.

ప్రతా : ఆ విలువ చెల్లుతుందా ?

అలూ : సందేహమెందుకు, స్వామిద్రోహి జటాశంకరుని ముఖాన సేనాపతిత్వమని విలువగట్టే ప్రభుత్వం, ఈ ప్రాణంలేని తోలు ముక్కకు విలువ నిలుపలేదా ? ప్రభుత్వ ఖడ్గానికి పదునుంటే ఒక్క తులమేగాదు, తోలు ముక్క పది తులాల బంగారమన్నా చెల్లి తీరుతుంది.

ప్రతా : పిచ్చివాడా, దీనివల్ల అశాంతిసుమా !

పెద్దపెట్టున నవ్వి అలూఖ్ 'పిచ్చి, అశాంతి' అంటూ గంతు లేస్తూ ఆ తోలుముక్కలన్నీ దోసిబట్టి ఎగురవేశాడు. ఇంతలో మత గురువు ప్రవేశంచూసి ఆయన యెదుట తలవంచి గౌరవించాడు.

గురు : యువరాజా తమకొక శుభవార్త తెచ్చాను.

అలూ : తమరేమని దయచేసినారు ?

గురు : ఆలస్యంలేకుండా నేడే మీ పట్టాభిషేకం చూసేందుకు ప్రజలా రాటపడు తున్నారు.

అలూ : తమకు నేనొక శుభవార్త వినిపిస్తా వినండి! నా సామ్రాజ్యానికి తమరే ప్రధాన మత గురువులు.

ఇరువురూ నవ్వుకొన్నారు. ఇంతలో వెలుపలనుంచి జయధ్వనులు వినవచ్చినాయి! తొందరపడుతూ

గురు : అదుగో సుల్తాన్ సమీపిస్తున్నారు. మీరు తయారవ్వండి!

గురువు పరుగిడినాడు. అలూఫ్ ఒక చేతిలో ఖురాన్ పుచ్చుకొని మరియొక చేత్తో ప్రతాపుని చేతి యినుప గొలుసులు బట్టి

అలూ : మోసకులకే గౌరవ పదవులు. కాని తమబోటి ప్రవక్తలకో - మహమ్మదు ప్రవక్త తుదివరకు-యెప్పుడు కత్తులమీదే నడిచాడు. కష్టాలే అనుభవించాడు... దయచేయండి అపర మహమ్మదు ప్రవక్తా, తమబోటి ధర్మాత్మునే మఱియొకని నాహ్వానించుదాం!

ప్రతాపుని చేతిసంకెళ్ల నుంచి యినుప గొలుసులు వ్రేలాడుతున్నాయి. ఒక చేత్తో ఖురాన్ ఒక చేత్తో గొలుసులు బట్టుకొని అలూఫ్ ముందు నడుస్తూంటే, వెనుక పశువు బోయినట్లు ప్రతాపుడు నడిచాడు. ఒక పెద్ద యేనుగుమీద అంబారీలో కూర్చుండి సుల్తాన్ గ్యాసుద్దీన్ తుఖలక్, ఆ వెనుక అశ్వికదళం, తరువాత కాల్బలం సమీపించినాయి. అలూఫ్ఖాన్ దగ్గరవరకు నేరుగా జనసమూహంలోనుంచి ఏర్పరిచిన మార్గంలో సైనికుల మధ్య ఏనుగు నడిచివచ్చింది. గ్యాసుద్దీన్ అంబారీ దిగగానే, ఇనుప గొలుసులు భద్రంగా పట్టుకొన్న చేతులతోనే అలూఫ్ తండ్రిని కౌగలించాడు. ఆ గొలుసుల చప్పుడు విని సుల్తాన్ భయంతో...

సుల్తాన్ : ఈ గొలుసు లేమిటి కుమారా!

అలూ : ఇవి ప్రతాపరుద్రుని బంధించిన గొలుసులు, చూడండి నా వెనుక ప్రతాపరుద్రు డిదుగో.

ప్రతాపరుద్రుని గంభీర రూపం తుఖలక్‌ను ఆకర్షించింది. తుఖలక్‌లో గొప్ప ఆశయాలున్నాయి. అవి ప్రతాపరుద్రుని జాతీయ

ధర్మం కంటే భిన్నమైనవి గావు. వాటి నా చరణాలో పెట్టేందుకు మత ద్వేషపరుల అధికసంఖ్య ఆయన ప్రయత్నాల నరికట్టింది. కాని బంగాళంలో ప్రజావిప్లవం కళ్లార చూసింతరువాత, మత గురువులను తిరస్కరించైనా జాతీయ ధర్మం స్థాపించేందుకు కొందరబడి వచ్చినాడు. ఇక్కడికి రాగానే ద్వారంలో అశుభం! ప్రతాపుని చేతి సంకెళ్లు చూసి ఆ ధర్మాత్ముడు దుఃఖించాడు.

గ్యాసు: కటు స్వభావంతోనే నన్ను కౌగలించావా కుమారా! నీవు పాపం చేశావు!

అలూ: తమకు చాలా యెండబడి వచ్చారు. తమ మనస్సు చాలా చీకాకుగా ఉంది. తమకు విశ్రాంతి తీసుకోండి!

'పాపం చేశావు, చాలా పాపం జేశావు అంటూ సుల్తాన్ వడివడిగా ఆ కట్టు డేరాలోకి నడిచిపోయినాడు. అలూఫ్ తండ్రి నను సరించేప్పుడు ప్రతాపుని విడువలేదు. మత గురువులు, మంత్రులు మొదలైన కొంతమంది పరివారంతో కొలువు చేరాడు. అక్కడ చల్లగా ఉన్నా చీకాకు పడుతునే ఉన్నాడు.

అలూ: ఇక్కడ చల్లగా లేదా?

గ్యాసు: మనస్సుకు శాంతిలేదు అలూఫ్, ఆ ప్రతాప రుద్రుని చేతులకు సంకెళ్ళు తీసెయ్యి.

అలూ: క్షమించండి నాయనగారూ, నేనాపని చెయ్యను.

గ్యాసు: ఇప్పటికైనా పాపం చేసినట్లు నీ మనస్సు పరితపించటంలేదా?

అలూ: లేదు నాయనగారూ నేను పుణ్యామే చేశాను. ఒక కాఫరుని బంధించాను,

గ్యాసు: కాఫరంటే-

అలూ: కాఫరంటే యెవరో మరిచి పోయినారా తమకు...ఆశ్చర్యం! మట్టి బొమ్మలు పూజించేవాడు కాఫరు. ఆ కాఫరు మతాన్ని నాశనం చెయ్యటమే మహమ్మదు మతధర్మం!

గ్యాసు: బొమ్మ పూజతో పాటు అరబ్బీలో దాస్యాన్ని దారిద్ర్యాన్ని మహమ్మదు ప్రవక్త నిర్మూలించాడని మరచిపోయినావా! బొమ్మ పూజతో బాటు దారిద్ర్యాన్ని దాస్యాన్ని ధిక్కరించలేని పిరికి పంద మహమ్మదీయుడైనా, వాడు కాఫరునే అంగీకరిస్తావా?

ప్రతా: సెబాసు సుల్తాన్‌జీ, దేవతా విగ్రహాలతో బాటు దారిద్ర్యాన్ని దాస్యాన్ని పూజించే నీచుడు హిందువుడైనా మ్లేచ్ఛుడే!

గ్యాసు: అవును ప్రతాపరుద్రజీ! దేశంలో దరిద్రం దాస్యం సృష్టించేది ప్రభుత్వమని గ్రహించలేక ముక్తి నిమ్మని ప్రజలు బొమ్మలు పూజించేవాళ్ళు! ఆ ప్రజల చేతుల్లోంచి బొమ్మలులాగేసి మహమ్మదు ప్రవక్త కత్తులందించాడు. ఆ స్వార్థ ప్రభుత్వంమీద కత్తులు దూయించాడు. ప్రజలకు దాస్యవిముక్తి అప్పుడు కలిగింది.

అలూ: తమ ఉపదేశం అంగీకరిస్తున్నా. కాని బొమ్మలు పూజించే వాళ్ళను రాజ్యంలో క్షమించలేను.

గ్యాసు: అదనీకు శాంతి నివ్వదు. దేశంలో ప్రభుత్వం మనస్వాధీనంలో ఉంది. నేను నీవు నీ తమ్ముడు ప్రతాపుడు నలుగురం నలువైపులా దారిద్ర్యాన్ని నిర్మూలిస్తూంటే క్రమేణా ప్రజలు కర్మోన్ముఖులై మతాలను, బొమ్మలను, దేవుళ్లను, అల్లాను మరిచిపోతారు.

అలూ: అందరినీ మరిచిపోతారా – అల్లాను మరిచిపోతారా – ప్రజలు అల్లాను, అల్లాను – అల్లా – అల్లా...

అల్లా అని ఆరాటంతో అంటూ ఆ కపట భక్తుడు ప్రతాపరుద్రుని గొలుసులు బట్టి యీడ్చుకొంటూ వెలుపలికి పోయినాడు. తన కుమారుని పిచ్చి భక్తి తెల్లబోయి చూస్తూ సుల్తాన్ కూర్చునే ఉన్నాడు. అలూఫ్ నేలమీద మోకాళ్ళాని కూర్చుని 'అల్లాహో అక్బరు, అల్లాహో అక్బరు అని కేకవేశాడు. చెట్లు కొమ్మలమీద పహరా నిచ్చేభటులు డేరాతాళ్ళను తెంపివేశారు. పెద్దధ్వనితో డేరా

కూలిపోయింది. సుల్తానుకొయ్యలక్రింద నలిగిపోతూఉంటాడు. ప్రజ లంతా సుల్తానుని రక్షించేందుకు చుట్టూమూగారు. అలూఫ్‌మాత్రం ప్రార్థిస్తూనే ఉన్నాడు; అనుమానంలేకుండా తనతండ్రిని చంపేసెయ్య మని గాబోలు! ప్రక్కనున్న ప్రతాపు డాతనిని మేల్కొలుపుతూ

ప్రతా : అలూఫ్! డేరా కూలింది. నీ తండ్రి కొయ్యలక్రింద పడిపోయి నాడు.

అలూ : 'అల్లా, అల్లా' నా తండ్రి చనిపోయినాడా రుద్రదేవా - నాకు మూర్ఛవస్తోంది - నన్ను పట్టుకో - పట్టుకో...

అలూఫ్ ప్రతాపుని చేతిలో మూర్ఛిలినాడు. ఆ మూర్ఛ నిజమో అబద్ధమో యెవ్వరికి తెలుసు. నలుగురి సేవకుల సహాయంతో అతనిని చిన్నగుడిసెలోకి చేర్చి, ప్రతాపు డుపచారం చేస్తున్నాడు. ఇంతలో మతగురువు వచ్చి శాంతంగా!

గురు : యువరాజా మీ రెందుకు భయపడుతున్నారు! కళ్లు తెరవండి!

అలూ : ప్రజలేమనుకొంటున్నారు గురు దేవా!

గురు : ఇదంతా మీ భక్తిమహత్యం, అల్లా మహత్యం అనుకొంటు న్నారు. నీవు నిర్దోషివి. పట్టాభిషేకానికి సిద్ధంకండి!

అలూ : చూశారా, రుద్రదేవా? పాపాలన్నిటిని 'భక్తి' యెట్లా మరుగుపరుస్తోందో! మహమ్మదు ధర్మం గూడా యీ పిచ్చిఆవేశం చాటునే అదృశ్యమైంది. మీ రెందుకు వృథా శాంతికోసం దేశంలో ప్రవక్తలై అవతరిస్తారు మాటిమాటికి! సత్యం, అహింస నేర్చుకోదలిస్తే పశుజాతిలో అవతరించడి! లేక మానవజాతిలో అవతరిస్తే కృత్రిమం స్వార్థం స్వధర్మంగా చేసుకోండి! తెలిసిందా ప్రవక్తా! ఇప్పుడు మీరు నా ఉపదేశం అంగీకరిస్తారా!

ప్రతా : ఏమని?

అలూఫ్ : నీ రాజ్యం నీకిచ్చివేస్తాను. నాకు సామంతుడవై ఉంటావా?

ప్రతా: నీవు దేశంలో జాతీయధర్మం పాలిస్తావా నేను నీకు అంగరక్షకుడనై సేవ చేస్తాను.

అలూఫ్: అసంభవం, మతభేదం పాటించకపోతే సామ్రాజ్యం చైనా వరకు పాకిపోదు.

ప్రతా: అయితే నాకు రాజ్యమక్కర్లేదు.

అలూఫ్: మంచిది. నిన్ను స్వేచ్ఛగా విడిచిపెట్టుతా. మీా కేవిధంగా జీవిస్తారు!

ప్రతా: తపస్సు చేస్తాను!

అలూఫ్: పొండి, యే కొండగుహల్లోనో తపస్సుచేసుకోండి!

ప్రతాపుడు లేచి నిలిచాడు. మెత్తనిదిండ్లమీాద తల ఆనించుకొని ముఖంమీాద గుడ్డ గప్పుకొన్నాడు. అతనికెంతకో దుఃఖంవచ్చి లోలోనే కుళ్లి యేడుస్తున్నాడు, ఇంతలో ఒక మతగురువువచ్చి—

గురు: యువరాజా, కొయ్యలు తొలగించి నీతండ్రి శవాన్ని బైటికి తీశారు. నీవు దుఃఖించి ప్రయోజనంలేదు. సింహాసనమెక్కి మహమ్మదు మతం విస్తరింపజేసేందుకు మేలుకో!

అతని మతభక్తి మతగురువులే అంగీకరించిం తరువాత అందులో కపటాన్ని, కృత్రిమాన్ని బహిరంగపరచేందుకు ఎవ్వరు సాహసిస్తారు. అనతికాలంలోనే అలూఫ్‌ను సింహాసన మెక్కించారు. అతడు 'మహమ్మదు ప్రవక్తవంటి' వీరుడు. 'కాఫరు రాజ్యాలను' కూల్చివేశాడు. అటువంటి భక్తుని 'అలూఫ్‌ఖాన్' అని సామాన్యమైన పేరుతో పిలిస్తే రాజ్యానికి న్యూనత! అందుకే గాబోలు అతనికి 'మహమ్మదు' అనే బిరుదు అంకితంగాచేశారు! అప్పటినుంచి అతని పేరు అలూఫ్ గాదు. 'మహమ్మదు తుఘలక్'—

ఆరునెల్లైంది. యోగిరూపంతో ప్రతాపుడు తన ఆంధ్రభూమిలో ప్రవేశించాడు! అక్కడ రాజమతం యిప్పుడు మహమ్మదీయ మతం! శైవమతం బానిసమతమైపోయింది. మతగురువులైన జంగాలు భిక్షుకు

లైనారు. దేవుడిగుళ్ళల్లో వర్ణాశ్రమధర్మం నశించి వొట్టిదేవుళ్ళు, వొట్టి పూజలు, వొట్టి ఆచారాలుమాత్రమే నిలిచాయి. శ్రీ వీర ప్రతాప రుద్రదేవుడు ఒకనాడాభూమిలోనే మరణించాడు, ప్రభుత్వంయొక్క ప్రలోభఖడ్గమే ఆయన ప్రాణాలు పైకిదోడింది. అయితే, ఆ కత్తిమొన హిందూ ధర్మహృదయాన్నా లేక జాతీయ ధర్మహృదయాన్నా చించి వేసింది? తర్కించుకొనేందుకు పాఠకులకే ప్రయాస నిస్తున్నాను !!



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | AA102C180 | Date | 30/9/2021 |
| Front Cover | yes | Back Cover | NO |
| Blank Pages | ci, 6, 8, | | |
| Missing Pages | NO | | |
| Prepared | K. Amrutha | Scanned | Mounika |
| BOOK SIZE | H 8.2 W 5.2 | Pages | 228 |

